SRI KANCHEE KSHETHRA

# SUPRASIDHA DEVALAYAMULU

(GLORIOUS TEMPLES OF KANCHEEPURAM)

## SAHASRA SWARNA KALASABHISHEKAM

## SOUVENIR

AUTHOR :
'PANMOZHI CHELVAR'
**T. V. R. CHARI** M.A.
(Asst. Station Director, Doordarshan Kendra, Hyderabad.
Vice President, Kambankazhagam, Kanchi)

PUBLISHERS :
**Sri Kanchi Kamakshi Ambal Devasthanam**
Sarada Navarathri Kalai Nigazhchigal Trust (Regd.)
(S. K. K. A. D. S. N. K. N. Trust)
15A, Kalandar Street, Big Kancheepuram - 631 501.



# SRI KANCHI KAMAKSHI AMBAL DEVASTHANAM
## Sarada Navarathri Kalai Nigazchigal Trust (Regd.)

(S. K. K. A. D. S. N. K. N. TRUST)
15-A, Kalandar Street,
BIG KANCHEEPURAM - 631 502.
Phone : 2613

5. *Smt. Pankajammal,*
*W/o. Sri G. Krishnamoorthy,*
*15-A, Kalandar Street, Big Kancheepuram.*

6. *Smt. T. Padmavathi*
*W/o. Sri T. V. R Chari,*
*16-B, Kalandar Street, Big Kancheepuram.*

**Ex. Officio Members :**

1. *Sri K. S. Chellappa,* B. A , B L ,
*Srikaryam,*
*Sri Kamakoti Peetam and*
*Sri Kamakshi Ambal Devasthanam,*
*Kancheepuram.*

2. *Sri A. Sreenivasan,*
*Asst. Commissioner / Executive Officer,*
*Sri Kamakshi Ambal Devasthanam,*
*Kancheepuram.*

**Hon. Auditor :**

*Sri D. V. D. M. Sankar Sah,* B. A., A C. A.,
*Chartered Accountant,*
*506, Gandhi Road, Kancheepuram - 1.*

**Bankers :**

*STATE BANK OF INDIA*
*Gandhi Road, Kanchipuram - 1.*

*THE SOUTH INDIAN BANK LTD.,*
*Vallal Pachaiyappan Street, Kancheepuram - 1.*

*THE INDIAN BANK*
*No. 1, Salai Road, Kancheepuram - 2.*

*CITY UNION BANK*
*Vallal Pachiyappan Street, Kancheepuram - 1*

HARA HARA SANKARA
JAYA JAYA SANKARA



THEIR HOLINESSES
**SRI SANKARACHARYARS**
OF KANCHI KAMAKOTI PEETAM
KANCHEEPURAM

*WITH HUMBLE PRAYERS AT THE LOTUS FEET OF THEIR HOLINESS AND GODDESS SRI KAMAKSHI AMBAL*

P. K. DORAISWAMY
*GANDHI NAGAR - NELLORE - 1.*

Sri Chandramouleeswaraya Namaha

Sri Sankara Bhagavatpadacharya Paramparagatha
His Holiness
Sri Kanchi Kamakoti Peetadhipathi

*Jagadguru*
*Sri Sankaracharya Swamigal*

*SRIMATAM SAMSTHANAM*
*Kancheepuram - 631 502*

---

Date . 7th September '89

Temples are an essential part of every believer's life and contribute greatly to providing him solace and peace of mind. The 'Murthi' in every temple's sanctum is full of grace and blesses devotees who come for worship Each temple has a hoary legend associated with it Kancheepuram, celebrated in history over ages as a jewel amongst cities, is full of temples.

Sri T. V. R. Chari, Asst. Station Director, Doordarshan Kendra, Hyderabad, prepared and had published in Tamil in 1980, a booklet on the many beautiful temples of Kancheepuram ("Kanchiyin Kavinmighu Koilgal"), the Telugu version of this booklet in 1981 and English in 1982 The Second edition of the Telugu version is published for release by us during this Navarathri in 1989 as a Souvenir It is a matter for satisfaction that these three launguage versions will be of assistance in acquainting the public about the many temples of Kancheepuram, as well as in securing their co-operation in the services connected with the temples

It is hoped that every believer and bhakta will read the books and be the recipient of the Almighty's beneficience.

**NARAYANA SMRITHI**

Sri Chandramouleeswaraya Namaha
Sri Sankara Bhagavadpadacharya Paramparagatha
HIS HOLINESS
SRI KANCHI KAMAKOTI PEETADHIPATHI
**Jagadguru Sri Sankaracharya Swamigal**
**Srimatam Samasthanam**
**KANCHIPURAM - 631 502.**
Camp: కాంచీపురం Date: 7-9-1989

# శ్రీ ముఖము

అయోధ్య, మధుర, మాయ (హరిద్వార్), కాశి, కాంచి, అవంతిక, ద్వారకాపురి యను సప్త మోక్షప్రద క్షేత్రములందు 'నగరేషు కాంచీ' యని శ్లాఘింపబడిన సుప్రసిద్ధ పుణ్యస్థలము కాంచీపురము

శ్రీ కాంచీక్షేత్రమునందలి ప్రసిద్ధమైన దేవాలయముల పురాణములను కాంచీపురవాసియు, ప్రస్తుతము హైదరాబాదు దూరదర్శన కేంద్రమున సహాయ కేంద్ర నిర్దేశకులుగా నున్న శ్రీ టి. వి. ఆర్. చారి మా ఆదేశానుసారము క్రోడీకరించి రచించిన "కాంచియిన్ కవిన్ మిగు కోయిల్గళ్" అను తమిళ గ్రంథము 1980 సంవత్సరమున ప్రచురింపబడినది అతను తెలుగులో రచించిన "శ్రీ కాంచీక్షేత్ర సుప్రసిద్ధ దేవాలయములు" అను నీ సద్గ్రంథము శ్రీ కాంచికామాక్షి ఆలయ నవరాత్రి కార్యక్రమ ట్రస్టువారిచే ప్రచురింపబడి ప్రస్తుతము పునర్ముద్రణ గావించబడి నవరాత్రి ఉత్సవసందర్భముగా 12-10-89 నాడు శ్రీ కంచికామాక్షమ్మవారి సన్నిధిని ఆవిష్కరింపబడనుండుటకు సంతోషము.

శ్రీ చారిచే రచింపబడిన తెలుగు, తమిళ గ్రంథములనుండి లభ్యమగు ద్రవ్యము దైవకార్యములకై వినియోగింపబడనుండుట విని సంతసించుచున్నాము.

మాయందత్యంత భక్తిగల్గిన శ్రీ టి. వి. ఆర్ చారి యిట్లనేక సద్గ్రంథములను రచించి ఆస్తిక లోకమునకు ఉపకారమొనరించి కీర్తితో వర్ధిల్లునట్లు అనుగ్రహించుటతోబాటు, ఈ సద్గ్రంథమును భక్త జనులు పఠించి ప్రయోజనమును బొంది భగవత్కృపకు పాత్రులగుదురని ఆశించుచున్నాము.

నారాయణస్మృతిః

# PUBLISHERS WORD

*Sri Kanchi Kamakshi Ambal Devasthanam Sarada Navarathri Kalai Nigazhchi Trust, Kancheepuram has been formed under the devine orders and with the blessings of his holiness Sri Sankaracharya of Sri Kanchi Kamakoti Peetam with the nett proceeds of the book "Kanchiyin Kavinmighu Kovilgal" written by Sri T V. R. Chari, M.A., and published by Sri Pachaivannar, Pavalavannar Bhakta Jana Sabha in October 1980. The Telugu Version of the book by the same author was published in 1981 and in English 1982. We are happy to bring out the Second Edition of the Telugu Version, along with other articles, as a Souvenir on the Sacred occasion of Sahasra Swarna Kalasabhishekam to Goddess Sri Kamakshi Ambal, during the Navarathri Celebrations in 1989. The nett proceeds from these Books will be utilised for Temple purposes. On this sacred occasion we offer our prayers and pranamams at the lotus feet of his Holiness Sri Sankaracharya Swamigal of Sri Kanchi Kamakoti Peetam for showering blessings on us.*

*We thank all noble hearted philanthropists and friends who have helped in conducting the Navarathri celebrations in augmenting the funds of the Trust and in bringing out the books by way of advertisements and donations.*

*We thank Sri T. V. R. Chari, the honorary adviser of our Trust for his dedicated and selfless services in conducting the Navarathri Celebrations, our heart felt thanks are due to Sri K. S. Chellappa, B.A., B.L., Sri Karyam of Sri Kanchi*

*Kamakoti Peetam and Sri Kanchi Kamakshi Temple, Sri A. Srinivasan, Assistant Commissioner / Executive Officer of Sri Kamakshi Ambal Temple, Kancheepuram, the Archakas and the Temple Staff of Sri Kanchi Kamakshi Ambal Temple for their kind & whole hearted co-operation. We are grateful to Sri La Sri Sundaram Guruji Swamigal of Mylapore, Madras for his guidance and continued kind co operation.*

*We express our heart felt thanks to Sri D. V D M. Sankar sah, B. A , A. C A , Chartered Accountant, who is our honorary auditor and to Sri K. V Jayarama Iyer, Advocate, Kancheepuram for their guidance and Co-operation.*

*Our heart felt thanks are due to Sri S. Vaidyanatha Krishnan, Advocate, Coimbatore, Sri K. Viswanathan, Regional Manager, State Bank of India, Coimbatore, Sri S. Sridharan, Proprietor Jayasree Jewellery, Coimbator, Sri C. P. Ramalingam, Coimbatore, Sri N S. Venkatasubba Aiyer, Advocate, Coimbatore, Sri D. Anantha Subramaniam, Madras, Sri T. N Venkata Raman, Coimbatore, Sri S. Subramaniam, Auditor, M.S.S. & Co., Tirupur, Sri K Bapirajugaru, Kakinada, Wg. CDR Parthasarathy, Senior Divisional Manager, Best & Crompton, Madras, Sri Akiri Ramakrishna Rao, Hyderabad, Sri R Vasu devan, Managing Director, Adsites advertising Co., Madras - 6 M/s. Rajesh Photo Stores, Hyderabad, Sri K. K. Natarajan, President, Kamban Kazhagam, Kancheepuram, Dr. C. K. Raman, M. A , Ph D., Treasurer, Kanchi Kamban Kazhagam, Sri K S.N Murthy of Ananthapur, Srimathi Kiranmayee of Machilipatnam, Sri V. Srinivasan, Sri R Narasimhan and Sri G Ramaswamy of Tiruchirapalli, Sri P. Subrahmanian, State Bank of India, Dharmapuri, Sri S. Soundara Rajan, State Bank of India, Salem, Sri A. C. Thiruvengadam, State Bank of India Madras, Srimathi Pollachi Jayalakshmi Ambal, Madras, Proffesor V. Siva Subramaniam, Mailam, Proffesor P. C Reddy Advocate & Social Reformer, Nellore. Sri P. K. Doraiswamy*

*Naidu, Philonthrapist, Nellore Sri V Srinivasachari, Sri A.V. Rangachary, Sri Rallapalli Ramasubba Rao and Sri Arra Krishnamoorthy of Nellore and all philonthropists and friends, for joining us in our service to the goddess and kind co-operation; Our thanks are due to our bankers for their co-operation. We express our thanks to M/s. Sakthi Achagam, Kancheepuram & M/s. K. R. Printers, Nellore for bringing out this Souvenir in time*

*Our heart felt thanks are due to all musicians for their whole hearted, kind and continued co-operation in rendering Kainkaryam to the Goddess.*

*My thanks are due to all the members of our Trust for their kind co-operation. We express our thanks to the generous public for making the function a grand success and request them for their continued co-operation in our services for the devine cause.*

*We offer our humble prayers at the lotus feet of goddess Sri Kamakshi and his Holiness to shower their grace on all of us for peace and prosperity.*

G. Srinivasan
*Managing Trustee*
*S. K. K A. D. S N. K. N. Trust*
*Kancheepuram - 631 502.*

*12-10-1989*

# రచయిత పలుకులు

శ్రీకరంబును, శుభకరంబుననగు కాంచీక్షేత్రము మన పుణ్య భారతమందలి దివ్యస్థలములలో మిక్కిలి ప్రసిద్ధి జెందినది. ఎటు చూచినను ఎత్తైన గోపురములతోను, విశాలమైన ప్రాకార ప్రాంగణ ములతోను విరాజిల్లు దేవాలయములతో శోభిల్లుచున్న కాంచీపురమును సందర్శించుటకై దేశమునందన్ని వైపులనుండి యాత్రికులు అనుదినము వచ్చుచుందురు. "దేవాలయముల నగరము" అని ప్రసిద్ధిజెందిన కాంచీ పురములోని దేవాలయములను దర్శించి వాని యందలి శిల్పకళానైపుణ్య మును కనులారగాంచి యచట వేంచేసియుండు దైవములను సేవించి ధన్యులగుచుండుట మనమెఱుగుదుము.

శ్రీకాంచీ క్షేత్రముననున్న దేవాలయముల స్థల పురాణములను క్రోడీకరించి తెలుగులో రచింపుమని 1978 వ సంవత్సరమున శ్రీకాంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శంకరాచార్య శ్రీ జయేంద్ర సర స్వతీస్వాములవారు యీవిధేయుని ఆదేశించి ఆశీర్వదించిరి. శ్రీ ఆచార్య స్వాములవారి దివ్యాజ్ఞను మహాప్రసాదమనియెంచి ఈపవిత్రకార్యమును నిర్వర్తించుటకై ఆళ్వార్లు అనుసంధాన మొనరించిన నాలాయిర దివ్య ప్రబంధము, శ్రీకాంచీపురాణము, శ్రీదేవీభాగవతము, శ్రీమద్భాగవ తము, శ్రీకాంచీమహిమ, శ్రీకామాక్షీవిలాసము మొదలగు గ్రంథము లను పఠించుట తటస్థించినది. దానితోబాటు కంచిలోని దేవాలయములను దర్శించి వాని స్థలవిశేషములను యచట మహనీయుల నడిగి తెలుసు కొనగల్గు అవకాశము లభించినది. అట్లు సేకరించిన విషయములను సంకలన మొనరించి ప్రథమమున తమిళములో గ్రంథరూపమున రచింప గల్గితిని.

" కాంచియిన్ పవిత్రగు కోయిల్‌గళ్ " అను పేర 1980 విజయదశమి శుభదినమున ఆవిష్కరింపబడిన నా తమిళ గ్రంథమును శ్రీ శంకరాచార్య స్వాములవారి యాదేశానుసారము తెలుగులో రచింప గల్గు భాగ్యము నాకు కల్గినది. శ్రీ కాంచి కామకోటి పీఠాధిపతుల ఆదేశానుసారము నిర్వహింపబడుచున్న శ్రీ కంచి కామాక్షీ అమ్మవారి దేవస్థాన శారద నవరాత్రి కార్యక్రమ నిర్వహణ నిధి వారిచే నా యీ తెలుగు పుస్తకము " కాంచీక్షేత్ర సుప్రసిద్ధ దేవాలయములు " అను పేర ప్రచురింపబడి 8-10-1981 విజయదశమి శుభదినమున ఆవిష్కరింపబడినది. ఈ గ్రంథము మరల పునర్ముద్రణ గావించబడి నవరాత్రి ఉత్సవములలో 12-10-1989 శ్రీ కంచి కామాక్షీ అమ్మవారి సహస్ర స్వర్ణ కలశాభిషేక శుభసందర్భమున శ్రీ కాంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ శంకరాచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారిచే ఆవిష్కరింపబడుట పరమభాగ్యము.

ఈ శుభ సమయమున నాయందత్యంత వాత్సల్యముతో నా రచనలను కటాక్షించి కరుణతో శ్రీముఖము ననుగ్రహించిన శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శంకరాచార్య స్వాములవారి పాదారవిందములకు సాష్టాంగప్రణామములను సమర్పించు కొనుచున్నాను. నాపైని యభిమానముచే దయతో శుభాశీస్సులను ప్రసాదించిన శ్రీసదాశివ బ్రహ్మేంద్ర సారస్వత్యవధూత స్వాములవారి యధిష్ఠానము, పుదుక్కోట శ్రీ భువనేశ్వరి అధిష్ఠానాధిపతులు సద్గురు శ్రీ శాంతానంద స్వాములవారికిని, కాంచీపురము శ్రీ తొండై మండలాధీనాధిపతులు శ్రీ జ్ఞానప్రకాశదేశిక పరమాచార్యస్వాముల వారికిని ప్రణామంబు లాచరించు చున్నాడను.

ఈ విధేయుని యందత్యంత వాత్సల్యంతో మంగళాశాసనము ననుగ్రహించి కరుణించిన తిరుక్కోయిలూర్ శ్రీ ఎంబెరుమానార్ జీయర్ స్వామివారి పాదారవిందములకు సాష్టాంగ ప్రణామంబు లాచరించు చున్నాను. నాయందత్యంత వాత్సల్యముతో కరుణజూపి నా రచనలను,

చదివి చూచి సన్నను గ్రహించిన మహనీయులు, శ్రీ జగదాచార్య సింహాసనాధిపతి, కాంచీపురం మహా విద్వాంసులు కీ. శే. శ్రీ ఉ. వే. ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులవారిని ఈ సమయమున స్మరించి ప్రణామంబు లాచరించుచున్నాను.

ఈ శుభసమయమున నన్నింతవాడినిగ జేసిన నా జననీజనకులు, నెల్లూరుజిల్లా, బుచ్చిరెడ్డిపాళెం గ్రామ వాస్తవ్యులు శ్రీమతి రుక్మిణమ్మ, శ్రీమాన్ ఉ. వే తిరుమల శ్రీరామయ్యంగార్లకు ప్రణామంబుల నర్పించుచున్నాను. నా రచనలలో నన్నెల్లప్పుడును ప్రోత్సహించి తోడ్పడుచున్న నా సహధర్మచారిణి శ్రీమతి పద్మావతికి, నా కుమార్తె చి. సౌ. విజయలక్ష్మికి యీ శుభసమయములో నా కృతజ్ఞతలను తెల్పుకొనుట వుచితమని భావిస్తున్నాను.

నా రచనలను సరిచూచి ఉపకరించిన ఇందుకూరుపేట M.K R. హైస్కూలు తెలుగు పండితులు ఉభయభాషా ప్రవీణులు. శ్రీ వట్టిపల్లి మల్లినాథశర్మగారికిని, నా కనిష్ఠ సోదరి శ్రీమతి వసంతలక్ష్మి భర్తయు, ఇందుకూరుపేట M.K R హైస్కూలు ఉపాధ్యాయులునగు, శ్రీమాన్ A. V. రంగాచారి, M.A , B.Ed , గారికి నా కృతజ్ఞతలను తెల్పుకొనుచున్నాను.

ఈ పుస్తకమును ప్రథమమున రచించి ప్రచురించుటకు అనుమతి నొసగి సహకరించిన అప్పటి ఆకాశవాణి పాండిచేరి కేంద్రపు స్టేషను యింజనీరు శ్రీ ఎ. శ్రీనివాసన్‌గారికి, ప్రస్తుతము హైదరాబాదు ఆకాశవాణి కేంద్ర నిర్దేశకులు శ్రీ టి. ఎన్ గణేశన్‌గారికి, హైదరాబాదు దూరదర్శన్ నిర్దేశకులు శ్రీ డి. బాలకృష్ణగారికి నా కృతజ్ఞతాభివందనములు.

ఈ పుస్తకమును ముద్రించుటకు ముందుకువచ్చిన శ్రీ కంచి కామాక్షి అమ్మవారి నవరాత్రి కార్యక్రమ నిర్వహణ నిధి మేనేజింగ్ ట్రస్టీ శ్రీ జి. శ్రీనివాసన్‌గారికి, తదితర నిర్వాహకులకు, నా యీ

ప్రయత్నమునకు పలువిధముల తోడ్పడిన సహృదయులందఱికిని నా హృదయపూర్వకభివందనములు.

స్వల్పకాల వ్యవధితో అచ్చువేయవలసి వచ్చినందున అచ్చులో తప్పులు దొర్లియుండవచ్చును. పాఠక మహాశయులు దయతో సహకరించవలసినదిగా కోరుచు, నా యీ చిన్ని పుస్తకమును ప్రేమతో పఠించి ఆదరించునట్లు బద్ధాంజలి ఘటించి ప్రార్థించుచున్నాను.

భవదీయుడు,

కాంచీపురము,
12-10-1989.

**తిరుమల, పరవస్తు,**
**విజయరాఘవాచార్యులు,**
(టి. వి. ఆర్. చారి, ఎం. ఏ.,)
సహాయ కేంద్ర నిర్దేశకులు,
దూరదర్శన్ కేంద్రం,
హైదరాబాదు - 13.

శ్రీరస్తు.
శ్రీ రామజయం
శ్రీ కామాక్షీదేవ్యై నమః
శ్రీ వరదరాజాయనమః

# శ్రీ కాంచీక్షేత్ర సుప్రసిద్ధ దేవాలయములు

శ్రీకరమై, శుభప్రదమై, పుణ్యఫలదమై, ముక్తిదాయకమై పవిత్ర స్థలమని పదునెనిమిది పురాణములలో ప్రశంసింపపడిన దివ్య క్షేత్రము కాంచీపురము.

"అయోధ్యా మధురామాయా కాశీ కాంచీ హ్యవంతికా
పురీ ద్వారవతీచైవ సప్తైతా మోక్షదాయకాః"

అను మోక్షదాయక సప్త నగరములలో "పుణ్యావివర్ధిని" యని ప్రస్తుతింపబడిన కాంచీక్షేత్రము సుప్రసిద్ధములైన దేవాలయములతో విరాజిల్లుటచే "నగరేషుకాంచీ" యని ప్రఖ్యాతి గాంచినది.

'దేవ' — భగవంతుడు. — 'ఆలయం' — ఉండెడిచోటు దేవాలయము అనఁగా భగవంతుఁడు అర్చామూర్తియైయుండు స్థలము. నాయకుని నివాస స్థలము — జగన్నాయకుడైన దేవునికి నెలవైనది అని యర్థము. సర్వవ్యాపియు, సర్వమయుండును, సర్వజ్ఞుడును, సర్వశక్తుడును, సమస్త కళ్యాణ గుణ సంపన్నుడనగు సర్వేశ్వరుడు లీలావినోదముగ జగత్తును సృజించి సృష్టిలోని జీవరాసుల నుద్ధరించు సంకల్పముతో స్వాభావికమైన కరుణావిలాసముచే నర్చావతారరూపమున భువిని వెలసి మహిమల ప్రదర్శించి, తనయునికిని ప్రకటించి నానాగా

వలయమున జిక్కియున్న జీవుల తన వశము గావించుకొని వారిలో భక్తిని గల్గించి వారు తన్నారాధించి తరించుట కనువైన ప్రదేశము దేవాలయము.

'పతి' లేక పరమాత్మయగు సర్వేశ్వరుని సేవించి, 'పశువు' లేక 'యాత్మ' పరిశుద్ధమునొంది — మాయనుండి విడుదలజెంది — మాయారహితమైన మోక్షమునొందుట కుద్బోధకమై తనరారు స్థలములు దేవాలయములు. అహంకార మమకారములనుగంటి యజ్ఞానాంధకారము నుండి వెలువడి యాత్మ పరిశుద్ధిజెంది యాత్మజ్ఞానమును పెంపొందింప జేసికొని నిజస్వరూపమును గ్రహించు శక్తిని బొందుటకు దోహద మొనర్చునవి దేవాలయములు బాధలనుండి విముక్తిని గల్గజేసి దుఃఖ మును బోగొట్టి యానందానుభూతిని ప్రసాదింపగల ప్రశస్తములైన ప్రదేశములు దేవాలయములు. ఆశ్రితవాత్సల్యముచే భక్తులను ఐడు దోవల బోనీయక యడ్డుకొని కాచునట్టి కరుణామయుడైన పరమేశ్వరుడు వేంచేసియుండు పవిత్ర స్థలములు దేవాలయములు. వేలుపై వెలసి వేడి వచ్చువారికి కావలసిన వరాలనిచ్చి బ్రోచుచు భగవంతుడు వేంచేసి యుండు భద్రమైన పుణ్యస్థలమగుటచే భక్తి శ్రద్ధలతో దర్శింప దగినవి దేవాలయములు. దేవస్థానము, గుడి మందిరము, కోవెల, సన్నిధి యన్ని యనేకమగు పేర్లు వాడుకలో యున్నను యవియన్నియు దయా మయుడగు దేవుడుండు దివ్య దేవాలయములే యని స్ఫురింపజేయును. అందుచేతనే "గుడిలేని ఊరిలో కాపుర ముండరాదు" అనే లోకోక్తి దేవాలయ సందర్శనావశ్యకత నుద్ఘాటించుచున్నది. మనస్సును పరిశుద్ధ పఱిచి ప్రశాంతతను ప్రసాదించి పరమాత్మ తత్వము నవగాహన మొనర్చుకొనుట కనుగుణమైన వాతావరణముతో విరాజిల్లు విశిష్టమైన తావులు దేవాలయములు. అట్టి దేవాలయములనేకము లిమిడి శోభిల్లు పుణ్యస్థలము కాంచీపురము.

మన పుణ్య భారతదేశపు దక్షిణ ప్రాంతమునందున్న తమిళదేశములో "తొండైనాడు", "తొండమండల" మన బరగు తుండీర మండల ప్రాంతమున ప్రఖ్యాతిగాంచిన పుణ్యస్థలములలో కాంచీ క్షేత్రము సుప్రసిద్ధము. తుండీర భూపతి పరిపాలనకు లోనైన ప్రదేశమగుటంజేసి యీ ప్రదేశము తుండీర మండల మనబరగినది. కాంచీ క్షేత్రమునకు సత్యవ్రత క్షేత్రమను మరొక పేరుగలదు. సత్యవచనమును వ్రతముగా గొనిన మహనీయులు నివసించు క్షేత్రమగుటచే సత్యవ్రత క్షేత్రమను సార్థక నామధేయము గల్గినది. అందుచేతనే తొండై మండల వాసస్థులు అనగా "తుండీర మండలమున నివసించువారు అబద్ధమాడ జాలరు"ను లోకోక్తి వాడుకలో నున్నది.

హిందూమతముయొక్క ప్రధాన శాఖలైన శైవ వైష్ణవములు పరస్పర సౌజన్యముతో వర్ధిల్లి విశిష్టత బొందినది కాంచీక్షేత్రమన నది యతిశయోక్తి గాజాలదు.

"భుజగశ్రేయనుండు, భుజగ విభూషణుండు
నెపుడు గరుణతో వరదులయ్యెదరుమాకు"

అనినట్లు శివ కేశవులు ఈక్షేత్రమున వరదానకుశలురై వెలసియున్నారు. పుణ్యభూమి యగు మన భారతదేశమునకు నాభీస్థానముగ పరిగణింపబడుట చేతను, గోరూపధారిణియగు పృధ్వికి కాంచీస్థానముగ నెంచబడుటచేతను, ప్రణవస్వరూపిణియగు పరాశక్తికి మేఖలవలె నొప్పుచున్నట్లు, పురాణములందు ప్రస్తుతింపబడి యుండుటచేత, ఈ క్షేత్రమునకు కాంచీ క్షేత్రమను పేరుగల్గినది. అత్యంతశక్తి ప్రభావోపేతమై శోభిల్లు కాంచీ క్షేత్రమున పరాశక్తి త్రివిధాత్మకముగ అనగా శివ, కేశవ, శక్తి స్వరూపములతో విరాజిల్లుచున్నట్లు పురాణములలో వివరింపబడి యున్నది.

బ్రహ్మదేవునిచే బూజింపబడిన పుణ్యస్థలమగుటచే నీ క్షేత్రమునకు "కంచి" యను పేరు గల్గినది. తొలుత దేవతలను రక్షించుటకై బిలాకాశమునుండి వెలువడిన యాదిపరాశక్తి ఈ క్షేత్రమున శ్రీ చక్రరాజ సింహాసనమున శ్రీ కామకోటి పీఠమున వెలసి బ్రహ్మచే పూజింపబడుటచేతను, పూర్వ మీక్షేత్రమున విరించి యొనరించిన యాగకుండము నుండి శంఖచక్ర గదాపాణియై శ్రీమన్నారాయణుండావిర్భవించి బ్రహ్మచే నారాధింపబడుటచేతను, ఈక్షేత్రమునకు కంచి యను పేరు గల్గినది. కఃయనగ బ్రహ్మ; అంచితయనగ పూజింపబడినది - బ్రహ్మదేవునిచే పూజింపబడిన విశిష్టత గల్గుటచే నీ క్షేత్రమునకు "కంచి" యను ప్రసిద్ధ నామమేర్పడినది. సత్యవ్రత క్షేత్రమన బరగు నీ కాంచీ క్షేత్రమున నొనర్చు పుణ్యములు కోటి గుణితఫలమును గల్గించునని పురాణప్రశస్తి. ఈ క్షేత్రము త్రిగుణాత్మకముగ రుద్రకోటి, పుణ్యకోటి, కామకోటి యను పేర్లచే ప్రసిద్ధి జెందినది. శివాత్మకముగ ఏకామ్రేశ్వరుడు వెలసియున్న రుద్రకోటి. విష్ణుపరముగ వరదరాజ మూర్తియై విష్ణుమూర్తి వెలసిన పుణ్యకోటి, పరాశక్తి పరముగ కామరాజ పీఠమని పేరు బడసిన శ్రీ చక్రరాజ పీఠమున కామాక్షియై వెలసిన కామకోటి సుప్రసిద్ధములు.

పంచభూతలింగేశ్వర క్షేత్రములలో పరమేశ్వరుడు పృథ్వి (భూమి, మన్ను) రూపమున ఏకామ్రేశ్వరుడై వెలసిన దివ్యస్థలము కాంచీక్షేత్రము. ఇచట సైకతలింగముగ వెలసిన ఏకామ్రేశుడు కరుణాతిరేకమున భక్తులనేకుల ననుగ్రహించి సల్పిన లీలావినోదము లద్భుతములు, అష్టే శక్తి క్షేత్రములలో ఆకాశక్షేత్రముగ పరిగణింపబడు కాంచీపురమున పరాశక్తి బిలాకాశరూపమున వెలువడి గాయత్రీ మంటపమున కామాక్షియై వెలసి భక్తుల నాదరించి గటాక్షించి యనుగ్రహించిన యద్భుతములనేకములు.

దేవరాజు. దేవాధిరాజు. వరదరాజనియు, ప్రణతార్తిహారుడనియు అతులిత కరుణామయుడనియు (పేరరుళాళన్) వినుతింపబడు కంచి వరదుని వైభవము పురాణములందును. ఆళ్వార్లనుసంధానము జేసిన దివ్య ప్రబంధ పాశురములందును, కాంచీపూర్ణులు (తిరుక్కచ్చి నంబిగళ్) శ్రీ మద్రామానుజులు, శ్రీ మన్నిగమాంత మహాదేశికులు, శ్రీ మన్మనవాళ మహామునులు మొదలుగాగల మహనీయుల జీవిత గాథలనుండియు వారనుగ్రహించిన సూక్తి ముక్తావళినుండియు విశదమగుచున్నది. తెల్లని పెద్ద గొడుగుల నీడను అత్యంత శోభాయమానుడై విరాజిల్లు కంచి వరదుని గరుడసేవ సుప్రసిద్ధము.

శ్రీ కచ్చియప్ప శివాచార్యుడను మహనీయునకు (జ్ఞాన) మొసగి, స్కంద పురాణమును తమిళమున రచింపజేసి కంచిలోని తన యాలయమంటపమున సమావేశమైన పండిత సభలో కుమారస్వామి స్వయముగ నేతెంచి ముందుండి వెలువరింప జేసిన యద్భుతము సంభవించిన దివ్యస్థలము కంచిలోని కుమరకోట్టము. పాంబన్ స్వాములనబడు సిద్ధపురుషునికి ప్రత్యక్షమై ప్రసన్నుడై వెలసిన శ్రీ సుబ్రహ్మణ్య స్వామి దేవాలయము కంచిలోని కుమరకోట్టము.

నూటయెనిమిది శివాలయములు, ఆళ్వార్లచే మంగళా శాసనము జేయబడిన పదునైదు శ్రీ వైష్ణవ దివ్యస్థలములు, పురాణ ప్రసిద్ధమైన మూడు విష్ణ్వాలయములు, శ్రీ కామాక్షియమ్మవారి దేవస్థానము, యాది కాలపరమేశ్వరి దేవ్యాలయము, అనేకములైన దుర్గాలయములు. గణపతిగుడులు నిండియుండుటచే దేవాలయ నగరమని కాంచీపురము ప్రసిద్ధి జెందినది.

కంచిలోనిబస్టాండుకు యెడమవైపుననున్న ప్రాంతము విష్ణుకంచి లేక చిన్నకంచి యనియు, కుడివైపు ప్రాంతము శివకంచి లేక పెద్ద కంచి యనియు పిలువబడుచున్నవి. విష్ణుకంచిలోని దేవాలయములలో

శ్రీ వరదరాజస్వామిసన్నిధి (కంచి వరదునిగుడి), అష్టభుజుని సన్నిధి (ఎనిమిది చేతుల విష్ణుమూర్తి గుడి), యధోక్తకారి సన్నిధి (శొన్న వణ్ణం శైదప్పెరుమాళ్ — చెప్పినట్లు చేసిన విష్ణుమందిరము. వేళుక్కైయన బరగు యళగియ సింగర్‌కోయిలనబడు యోగనరసింహుని దేవాలయము, దీపప్రకాశర్ లేక విళక్కొళి పెరుమాళనబడు దీపాధారజనార్ధనుని గుడి, ముక్తేశ్వరుని యాలయము పేర్కొనదగినవి. శివకంచిలోని దేవాలయములలో శ్రీ వైకుంఠనాధుని యాలయము, ఉలగళంద ప్పెరుమాళనబరగు వామనమూర్తి దేవాలయము, శ్రీ కామాక్షియమ్మవారి దేవస్థానము శ్రీ పచ్చవణ్ణర్ మరకతవర్ణుని సన్నిధి. పవళవర్ణుడను ప్రవాళవర్ణుని వన్నిధి కుమర కోష్ఠమనబడు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి గుడి, శ్రీ కామకోటి పీఠాధిపతులు వేంచేసియుండు శ్రీ శంకరమఠము, శ్రీ యేకామ్రేశ్వరుని దేవాలయము, పాండవదూత ప్పెరుమాళను శ్రీ కృష్ణుని యాలయము, శ్రీ కైలాసనాధుని యాలయము, శ్రీ కచ్ఛపేశ్వరుని యాలయము, చిత్రగుప్తుని యాలయములు ప్రసిద్ధి జెందినవి.

అంబరమై యాకాశమునంటుచున్నట్లగపడు సత్యున్నతమైన గోపురములు. నిడివిగల యాలయ ప్రాకారపు బురుజులు ఎటువైపున కాంచీ నగరమును ప్రవేశించినను కనులకింపుగ గన్పట్టి మనలను భక్తి పరవశులగు నట్లొనర్చును. గోపురములందును, ప్రాకార మంటపములందును జెక్కబడియుండు శిల్పకళానైపుణ్యము వర్ణనాతీతము అందుచే దేశము నందలి నానా దిక్కులనుండి యాత్రికులనుదిన మీ నగరమునకరుదెంచి యాలయ నిర్మాణ నైపుణ్యమును, శిల్ప కళాచాతుర్యమును కనులార గాంచి యానందించుటతోబాటు ఆయా దేవాలయములందు వెలసియున్న దైవదర్శనమును బొంది సఫల మనోరధులగుచున్నారు. ఇచ్చటి శిల్ప కళాకౌశలమును కనుగొని కళారసికులైన విదేశీయులు కుతూహలముతో నిచటికి వచ్చుట చేతను కాంచీపురము సుప్రసిద్ధ యాత్రాస్థలమై విరాజిల్లు చున్నది.

నాయన్మార్లని ప్రసిద్ధి జెందిన శివ భక్తాగ్రేసరులు, ఆళ్వార్లన బరగు విష్ణుభక్తాగ్రేసరులు, ఆచార్యపురుషులు. మహనీయులనేకులు ఈ దివ్యస్థలములనవపించి భగవంతునిదివ్యమంగళస్వరూపమును తనివిదీర సేవించి, భగవత్కల్యాణ గుణవిశేషములను తమ సూక్తిగీతములలో వర్ణించి వివరించి లోకోపకార మొనరించి యుండుట మన భాగ్యము. ఆదిశంకరులీ కాంచీక్షేత్రమున శ్రీ కామకోటి పీఠమును స్థాపించినదియు. వారి పారంపర్యమున వేంచేసియుండు శ్రీ కామకోటి పీఠాధిపతులీనాటికీ మననెల్ల భక్తిమార్గమున నడపించి ధర్మచింతాపరులగు నట్లనుగ్రహించ గల భాగ్యప్రాప్తిని బొందియుంటుసీ శ్రీ కాంచీ క్షేత్ర విశిష్టత వర్ణనాతీతము.

సుందరతర శిల్పకళాసంశోభితమై. సత్పురుషసంబంధ సంప్రాప్త యశోభాసితమై సకలకల్యాణగుణ సంశోభిత వర దైవ సాన్నిధ్య సంప న్నోపేతమై విరాజిల్లు సత్యవ్రత నామాంకిత శ్రీ కాంచీక్షేత్ర సుప్రసిద్ధ దేవాలయములు పుణ్యప్రదములు.

——:o:——



# కంచిలో కనకవర్షము

శిల్పకళానైపుణ్య సంశోభితమై, రమణీయ గోపుర ప్రాకార విరాజమానమై, సుమనోహరంబై, పుణ్యతీర్థోపేతమై నలరారు శ్రీకాంచీ క్షేత్ర సుప్రసిద్ధ దేవాలయములతి ప్రాచీనములు. సత్యవ్రత క్షేత్ర మనబరగు నీ మహిమాన్వితమైన దివ్య క్షేత్రమున ననేక సమయము లందేనక మతములు వర్ధిల్లగా, మతాచార్యులనేకులు జన్మించి లోకము నకు జ్ఞానభక్తి మార్గములను బోధించి తరణోపాయము నెఱిగించి భగ వంతుని కళ్యాణగుణాతిశయములను వివరించి యున్నారు.

నాల్గువేల భక్తి భరిత గీతములతో తమిళమునను న్న నాలాయిర దివ్య ప్రబంధమని ప్రసిద్ధి జెందిన ద్రవిడ ప్రబంధము ననుగ్రహించి యందు శ్రీమన్నారాయణుని కళ్యాణగుణ విశేషములను వినుతించి విష్ణుమూర్తి యర్చావతారమున వెలసియున్న దివ్యదేశముల విశిష్టత నభివర్ణించి తరించిన శ్రీ వైష్ణవ భక్తాగ్రేసరులగు పండ్రెండుగురు ఆళ్వార్లలో మొదటి యాళ్వారవతరించిన ప్రఖ్యాతి గాంచినదీ కాంచీ క్షేత్రము. ఆళ్వార్లు వైభవముగా వివరించి యనుగ్రహించిన దివ్య ప్రబందాను సంధానము క్రమపఱిచి విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిష్ఠాప కులై యతిరాజని ప్రఖ్యాతిగాంచిన శ్రీమద్రామానుజులవారు వరదాన కుశలుడగు వరదునిచే సంరక్షింపబడి యద్దేవదేవునికి తీర్థకైంకర్య మొనర్చి ధన్యమైన చరిత్ర గల్గినదీ కాంచీక్షేత్రము. శ్రీవరదరాజునితో ముఖాముఖి సంబాషణ మొనర్చు బాగ్యమును బొందిన తిరుకచ్చినంబిగళని ప్రశంసింపబడు శ్రీకాంచీపూర్ణులను దైవానుగ్రహ ధనుడువసించిన ఘనత గల్గినదీ కాంచీక్షేత్రము. శ్రీనిగమాంత మహాదేశికులు. శ్రీమన్మనవాళ మహామునులు మొదలైన యాచార్యవరేణ్యులును, తిరుక్కురళను

ప్రాచీన తమిళ గ్రంథమునకు విశిష్టమైన వ్యాఖ్యానమును విరచించి విఖ్యాతినొందిన పరిమేళయగరను పండితోత్తముడును వసించి ప్రాబల్యము నొందిన ప్రతిభతో నొప్పునదీ కాంచీపురము.

అశ్రిత వాత్సల్యముచే భక్తవశంకరుఁడగు శంకరుడనన్యసాధారణ సామర్ధ్యమును ప్రదర్శించి నమ్మివచ్చిన నిజభక్తుల నాదుకొని వారిభక్తి భావాధిక్యము విఖ్యాతమగునట్లొర్చు సంకల్పముతో వారిభక్తి వైరాగ్య ములను పరిశోధించు తెరగున పరిపరివిధముల సంకటముల గల్పించి వాని బరిష్కరించుటలో భక్తవరేణ్యులు జూపిన యతులిక భక్తితత్పర తను వెలువరింపజేసి వారిభక్తిబలిమి తన భక్తవాత్సల్యము ప్రకటిత మగునట్లు ప్రదర్శించిన యద్భుతచర్యల విశిష్టత, నాయన్మార్లని వినుతి కెక్కిన శివ భక్తాగ్రేసరుల వృత్తాంతములనుండి తెలియనగును. అరువత్తిమూవరను నీ యరవై ముగ్గురు నాయన్మార్లలో శాఖ్యనాయనార్ తిరుక్కురిప్పుత్తొండనాయనార్, "ఐయడిగళ్ కాడవర్‌కోన్" యను శివ భక్తవరేణ్యులు శివభక్తి తత్పరులై వసించి తరించిన కీర్తిగల్గినదీ కాంచీక్షేత్రము. షణ్మతస్థాపకులని విఖ్యాతిగాంచిన యద్వైత సిద్ధాంత ప్రవర్తకులైన యాదిశంకరుల శ్రీ చక్రప్రతిష్ఠజేసి శ్రీ కామకోటి పీఠవాసిని యగు కామాక్షి కరుణావిలాసముచే వాక్పటుత్వమునుబొంది "మూకపంచశతి" యన్న పేర ప్రసిద్ధమైన యైదువందల శ్లోకములలో శ్రీ కంచి కామాక్షి వైభవమును వినుతించి విఖ్యాతినొందిన మూక మహాకవి వసించిన దివ్యస్థలము శ్రీకాంచీక్షేత్రము. కుమారస్వామి కటాక్షమున స్కాందపురాణమను పద్యకావ్యమును తమిళమున రచించిన కచ్చియప్ప శివాచార్యుడను శ్రీ కంచి శివాచార్యుల భక్తి పాండిత్యముల ప్రతిభ ప్రకటితమైన దివ్యస్థలము కాంచీపురము. యాత్రర్థమరుదెంచిన పాంబన్‌స్వాములవారికి కుమారస్వామి మార్గదర్శియై సాక్షాత్కరించిన పుణ్యస్థలము కాంచీపురము.

భక్తవరేణ్యుల ప్రార్థనా ఫలితముగ భువిలో భక్తివిశ్వాసములు వృద్ధిజెంది ధర్మము నిలబడి లోకకళ్యాణము సిద్ధించుట కనుగుణమైన వాతావరణము నెలకొనుటకై యనన్యసాధారణ సామర్థ్యాది కళ్యాణగుణ సంపన్నుడైన సర్వేశ్వరుని సంకల్పమాత్రమున సత్యవ్రత క్షేత్రమైన కాంచీక్షేత్రమున సంభవించినప్పటి యద్భుతములనేకములు. అందు అమ్మ వారి కరుణావిలాసముచే కంచిలో కనకవర్షము కురిసిన సంఘటనలు భక్తులపాలిట భగవంతునకుగల యపారదయను వెల్లడించును. శ్రీ కాంచీ క్షేత్రమున బిలాకాశ రూపమున వెలువడి గాయత్రిమంటపమున శ్రీకామ కోటిపీఠమున కొలువై యున్న పరాశక్తి శ్రీ కంచికామాక్షి కరుణా కటాక్షమున కనకవర్షము గురిసినదియు, అట్లే కంచివరదుని పత్నియై వెలసియున్న మహాలక్ష్మిమహాదేవి(పెరుందేవిత్తాయార్)మహిమాన్విత కటాక్షముచే బంగారువాన గురిసినదియు, భక్తవరేణ్యుల ఘనతను, భగవంతుని కారుణ్యాతిరేకమును వెల్లడించిన యద్భుత సంఘటనలు మిక్కుటములు.

పూర్వము కామకోష్ఠమున బిలా కాశరూపముననుండిన మహా త్రిపురసుందరి దేవహితార్థము బిలమునుండి బయల్వెడలి బంధకాసురుని సంహరించి యుతకారమొనర్చినంత బ్రహ్మదేవుడా పరదేవతను నుతించి లోకకళ్యాణార్థం కామకోష్ఠమున ప్రతిష్ఠించి యారాధించి పిదప కాంచీ పురనివాసివియగు నాకామాక్షీదేవికి నిత్యారాధనము క్రమముగజరిపించు నెపముతో నాతల్లిని నాదర్శించిన పుష్పములనుండి యొక కమలము నాకాశమున విసిరివేయ నాకమలము కమలాకరుని కిరణస్పర్శచే విరిసి భూమిపైబడి మనుష్యరూపము నొందెను. బ్రహ్మదేవుడతనికి ఆకాశ భూపతియని నామధేయ మొనర్చి కాంచీమండల భూపతినిజేసి కామ కోష్ఠమున ప్రతిష్ఠింపబడిన శ్రీ కామాక్షినారాధింప నియోగించెను.

శ్రీకామాక్షి సేవాతత్పరుడై, ధర్మమార్గమున కాంచీమండలమును పరిపాలించిన యాకాశభూపతికి బహుకాలము వఱకు పుత్రప్రాప్తిగల్గ

కుండెను. ఇట్లుండ కొంతకాలమునకు వర్షములేమిచే కాంచీమండలమున క్షామమేర్పడెను. బిడ్డలులేని కొఱతతో చింతాక్రాంతుడైన యాకాశ భూపతి దేశమున దుర్భిక్ష మేర్పడినందులకు మిగులవగచి వేదవిదులను సంప్రదించి పుత్రాపేక్షతో శ్రీకామాక్షీదేవి నుద్దేశించి వ్రతమాచరించెను. ఆకాశభూపతి భక్తిశ్రద్ధలకు మెచ్చిన శ్రీమాత యతనికి వినాయకుని యంశమున కుమారుడుదయించునట్లనుగ్రహించెను.

పుత్రోత్సాహముచే నాకాశభూపతి భక్తిద్విగుణీకృతమై పరాశక్తి యగు శ్రీ కామాక్షి దేవికి విశేషమైన పూజలు జలిపించి సంతర్పణ జేయించెను. ఆ సంతర్పణలో స్త్రీల పంక్తినొక ముసలి ముత్తైదువ రూపమున గూర్చుండి శ్రీ కామాక్షి విందారగించెను. అమ్మవారి కడుపు చల్లబడుటచే సంతర్పణ పందిరి వెలుపల భూమి చల్లబడునట్లు వర్షము కురిసెను. ముదావహముగ కురిసిన వానతో బంగారముగలిసి వర్షించిన యద్భుతమునుగాంచి యందాశ్చర్య చకితులై భ్రమించి నిల్చిజూడ నాముత్తైదువ యదృశ్యమయ్యెను. భాగవతకైంకర్యమున తన్నన్వ యించుకొను నుద్దేశముతో మహారాణి సంతర్పణకై యుంచిన ధాన్యమును తానే స్వయముగ శోధించి సరిచేసియిచ్చుసమయమున తన వ్రేలినుండిన బంగారపు టుంగరమునందలి బంగారు ముత్యములలో నొకటి రాలి ధాన్యముతో గలియునట్లయ్యెను. అమ్మవారారగించిన పొంగలితోజేరి యాబంగారు ముత్తెము అమ్మవారి కుక్షినిజేరగద్దే విందు భోజనమున సంతసించిన యాదిశక్తి, యాకాశభూపతి భక్తియౌన్నత్యము లోక ప్రసిద్ధి జెందునట్లనుగ్రహించ నెంచి శ్రీ కామాక్షియే కనకవర్షము గురిపించెనని యాకాశరాజతనయుడైన తుండీరుడను శిశువు వక్కాణిం చినది యచటివారినెల్ల సంభ్రమాశ్చర్యముల ముంచెను. శ్రీ కామాక్షి యమ్మవారి కరుణావిలాసముచే కాంచీపురమున కనకవర్షము గురిసిన సన్నివేశము అత్యద్భుతము.

కాంచీపురమున శ్రీ వరదరాజవల్లభయై వెలసియున్న పెరుందేవి త్తాయారనబరగు మహాలక్ష్మి మహిమాన్విత కరుణావిలాసముచే కంచిలో కనకవర్షము గురిసిన మరొక సందర్భము సుప్రసిద్ధము. కాంచీపుర మునకు సమీపమునసున్న "తూప్పుల్" (తుంబవసమను) అను పుణ్య స్థలమున నవతరించిన యాచార్య వరేణ్యులు శ్రీ నిగమాంత మహా దేశికులవారు. ఆయన శ్రీవరదరాజుని పదధ్యానముదక్క అన్యవిషయ ములందాసక్తి లేక మహాజ్ఞానియై సర్వజ్ఞుడని ప్రసిద్ధి కెక్కెను. వారి బహుళఖ్యాతి కోర్వలేని కొందఱు వారినవమానించు దురుద్దేశముతో మూర్ఖుడైన విప్రయువకునొకని స్వామివారి కడకంపి యతని వివాహ ప్రయత్నమునకు ద్రవ్య సహాయమొనర్చి తోడ్పడవలసినదిగ ప్రార్థింప నియోగించిరి.

శ్రీ పతియే సర్వస్వమని నెఱనమ్మియున్న దేశికులవారు ద్రవ్యా పేక్షతో తన్నాశ్రయించి వచ్చిన యువకునికి తోడ్పడ గత్యంతరము లేక యతని నమగ్రహించి బ్రోవుమని తానాశ్రయించియున్న వరదరాజవల్లభ యైన మహాలక్ష్మిని స్తుతించి ప్రార్థించిరి. శ్రీస్తుతియనబరగు నాస్తోత్ర రాజముచే నుతించపడిన మహాలక్ష్మి కరుణావిలాసముచే కనకవర్షము గురిసిన యద్భుతమెల్లర భ్రమింపజేసి మహనీయుడైన స్వామిదేశికుల వారిఘనతను అమ్మగారి యాశ్రిత వాత్సల్యతను వెల్లడించెను.

శ్రీ నిగమాంత మహాదేశికస్వాములవారిచే ననుగ్రహించబడిన యీ శ్రీస్తుతి మంగళప్రదమై పారాయణస్తోత్రరాజముగ ప్రశస్తముగ ప్రాబల్యము నొందియున్నది. భక్తవరేణ్యుడును, ఆచార్యవరేణ్యుడు ననగు శ్రీనిగమాంత మహాదేశికుని ప్రార్థనవిని పెద్దమనసుతో పెరుందేవి తాయార్లు కరుణించి కంచిలో కనకవర్షము గురిపించిన యీ అద్భుత సంఘటన వర్ణనాతీతము.

కంచిలో కనకవర్షముగురియజేసి యచ్చోకరుణతో వెలసియున్న శ్రీకామాక్షీదేవిని, శ్రీవరదరాజపత్నియగు పెరుందేవితాయారను లక్ష్మీ దేవిని మనసార సేవించి, స్తుతించుట సంపత్కరము; శ్రేయస్కరము శుభప్రదము.

# శ్రీ వరదరాజ వైభవము

శ్రీ వైష్ణవ భక్తవరేణ్యులైన యాళ్వారులచే మంగళా శాసనము జేయబడిన నూటయెనిమిది దివ్యదేశములలో తుండీర మండలమున ప్రసిద్ధి జెందిన దివ్య దేశము కాంచీపురమునందలి శ్రీ వరదరాజస్వామి దేవస్థానము. కాంచీపురమందు ఆగ్నేయమునగల ప్రదేశము హరిక్షేత్ర మని పురాణ ప్రసిద్ధి నొందియున్నది. విష్ణుకంచి, చిన్నకంచి యన బడు నీ ప్రదేశమున కాంచీపురపు సరిహద్దులో నెలకొనియున్న పురాతన దేవాలయము శ్రీ వరదరాజస్వామి దేవస్థానము. మహోన్నతమైన గోపురములతోను, నిడివైన ప్రాకారములతోను నొప్పు కంచివరదుని దేవాలయము కాంచీపురమును ప్రవేశించువారిని దూరంనుండియే ఆకర్షించి భక్తులను దైవసన్నిధి కాహ్వానించినట్లు గన్పడును. అందు పుణ్య కోటి విమానమున "హస్తిగిరి" యనబడు చిన్నకొండపై శ్రీ వరదరాజ స్వామి వరప్రసాదియై వెలసియున్నాడు.

హస్తిగిరినాధుడు, అత్తిగిరివరదుడు, హస్త్యద్రీశుడు, దేవరాజు, వరదరాజు, ప్రణతార్తిహరుడు, పరమకరుణాకరుడు (పేరారుళాళన్) యజ్ఞమూర్తి" అను పేర్లతో నాళ్వార్లచేతను, భక్తవరేణ్యుల చేతను, వినుతింపబడిన కంచివరదుడు వెలసియున్న శ్రీకాంచీక్షేత్రమహాత్మ్యము ఆళ్వార్ల దివ్యప్రబంధ పాశురములనుండియు, మహాత్ముల సూక్తుల నుండియు తెలియనగుచున్నది. అభిష్టవరదానకుశలుండని ప్రశంసింప బడిన వరదుని కరుణాతిరేకమును వివరించు దివ్య ప్రబంధ గీతము లందును, శ్రీ వైష్ణవాచార్యులను గ్రహించిన భగవద్విషయ వివరణము లందును, శ్రీ వరదరాజవైభవము ప్రశంసింపబడియున్నది.

పూర్వము పద్మసంభవుడు పద్మనాభుని దివ్యమంగళస్వరూపమును సేవింపనెంచి బహుకాలము తపమాచరించెను. జనార్దనుడు ప్రసన్నుడై జపరూపమున దర్శనమిచ్చెను. భగవానుని తీర్థరూప సందర్శమున తనివిజెందని జలజాతాసనుడు జగన్నాథునెంచి మరల తపమాచరించెను. పరమేష్ఠి తపమునకు ప్రసన్నుండైన పరంధాముడు పృథ్వీరూపముగ నైమిశారణ్యరూపమున గోచరించెను. సర్వమునకు కారణాత్మకుడై సర్వముతానైన సర్వవ్యాపియగు సర్వేశ్వరుడు శ్రీమన్నారాయణుడు నీరై నేలయై నెలకొని గన్పించినను విరించికి తృప్తిగల్గలేదు. శంఖ, చక్ర, గదాపాణియై, దివ్యాభరణాలంకృతుడై మందస్మిత మనోహర వదనార విందముతో గూడిన దేవదేవుని దివ్యమంగళ స్వరూపమును సేవింపగోరి తన కాలాగున స్వరూపదర్శన మొసగి కటాక్షించి కరుణింపవలసినదిగ విరించి విష్ణుమూర్తిని వేడెను. అంత యజ్ఞపురుషుడైన యచ్యుతుడు తన్నర్చావతారమున సాక్షాత్కరించుకొనుటకు నూరశ్వమేధయాగము లొనరింపవలసినదిగా ఆదేశించెను.

అనవుడు బ్రహ్మ దాహమునకు నీరడిగినవానికి నూతి ద్రవ్వించి యింపైన నీరిచ్చెదనన్నరీతి ప్రయోజన పడనట్లు, భగవంతుని దివ్య స్వరూపము నతిశీఘ్రముగ, తాను దర్శించు నాకాంక్షతో, నూరశ్వమేధ యాగముల నిర్వర్తించుటకగు బహుకాలవ్యవధి నెంచిచూచి త్వరితముగ తనకు దర్శనభాగ్యము గల్గునుపాయము నెఱిగింపుమని వేద కోటిగుణిత ఫలప్రదాయకంబును, అధికపుణ్య ప్రదంబునై సత్యవ్రత క్షేత్రమని శ్లాఘింపబడు కాంచీక్షేత్రమున నొకే యొక్క యశ్వమేధ యాగము నొనర్చుటంజేసి శతాశ్వమేధ యాగఫలము ప్రాప్తమై తన సాక్షాత్కార మునకు సాధకమగునవి జగన్నాథుడైన శ్రీ మన్నారాయణుడు సత్య లోకాధీశుడైన హిరణ్యగర్భునకు హితమొనర్చి సులభమార్గమునెఱిగింప

బ్రహ్మ సంతుష్టుడై క్షీరవాహినీపూతమగు సత్యవ్రత క్షేత్రమున హస్తిగిరిపై యాగ మొనరించెను.

సత్యవ్రత క్షేత్రమున బ్రహ్మ యొనర్చిన యజ్ఞమున యాగ కుండమునుండి పరమ కారుణ్యమూర్తియగు యజ్ఞేశుడైన శ్రీహరి శంఖ చక్ర గదాపాణియై వరద ముద్రతో గూడిన దివ్యమంగళ స్వరూపముతో వరదుడై యర్చావతారమున నావిర్భవించి సాక్షాత్కరించెను.

యాగానలసముద్భవుడగుటంజేసి యగ్నిగుండమునుండి యావిర్భ వించుకాలమున నుష్ణముచే నేర్పడిన గాట్లు ఉత్సవమూర్తియగు వరదుని ముఖమండలమున నింకను గాననగును.

పూర్వము సరస్వతి శాపముచే కరి రూపము నొందిన దేవేంద్రు డీసత్యవ్రత క్షేత్రమున తపమాచరించి పాపవిమోచన మొంది నిజ రూపమును బడయుటచే నీదివ్యస్థలము కరిగిరి, హస్తిగిరి, హస్త్యద్రి, హస్తిశైలమను పేర్ల పురాణప్రసిద్ధమై శోభిల్లుచున్నది.

"పుణ్యకోటి విమానాంకం, తత్త్వసోపానభూషితం ।
నృసింహాధిష్ఠితగుహం, హస్తిశైలం నమామ్యహం॥

సత్యవ్రత క్షేత్రము నందలి యీ హస్తిగిరిపై శ్వేతవరాహ కల్పమున వైవస్వత మన్వంతరమందు కృతయుగములో వరసింహ భగవదాత్మకంబగు యువసంవత్సరమున వైశాఖ మాసంబున రవి మేష రాశియందుండ హస్త నక్షత్రయుక్త శుక్లపక్ష చతుర్దశి శుభదినంబున శ్రీ హస్తి శైలంబున యాగానలంబున బ్రహ్మకు సాక్షాత్కరించిన శ్రీహరి యచ్చో వెలసి వాంఛితార్థ ఫలదాయకుడై వరదాన కుశలుడై వెలుగొందు టంజేసి సత్యవ్రత క్షేత్రమును నీదివ్యస్థలమునకు శ్రీహరి క్షేత్రమను

పేరుగల్గినది. బ్రహ్మ యొసర్చిన యాగకుండము సందరవిందాక్షు డావిర్భవించి బ్రహ్మచే నారాధింపబడుటచే నీ క్షేత్రమునకు కంచి యను కారణనామధేయ మేర్పడినది.

"బ్రహ్మయజ్ఞ సముద్భూతం, దివ్యమాణిక్యసున్దరమ్
జగదాది గురుం దేవం, వరదం తమహం భజే॥"

వరదాన కుశలుడగుటచే వరదుడనియు, యాగానల సంభూతు డగుటంజేసి 'యజ్ఞమూర్తి'యనియు, దేవేంద్రాది సురపూజితుండగుటం జేసి 'దేవరాజ'నియు 'దేవాధిరాజ'నియు, ఆపన్నశరణ్యుడై యాశ్రిత జనుల దుఃఖములను బోగొట్టగల మహిమాన్వితుడగుటవలన 'ప్రణతార్తి హరుడ'నియు హస్తిగిరిపై నెలకొని యుండుటచే 'హస్తిగిరినాధుడ' నియు, హస్త్యద్రీశుడనియు, అత్తిగిరి వరదుడనియు, తన కరుణాతి రేకముచే భాగవతోత్తముల యోగక్షేమములను నిర్వహించి కోరిన వరాలిచ్చే నిజ భక్తవరదుడగుటజేసి వరదుడనియు, వరదరాజనియు, ఆళ్వార్ల చేతను, ఆచార్య వరేణ్యులచేతను, భక్తాగ్రేసరులచేతను ప్రశం సింపబడిన శ్రీ వరదరాజుని వైభవము వర్ణనాతీతము.

యాగకుండము నందావిర్భవించిన విష్ణుమూర్తికి హస్తిగిరిపై నొకయాలయము నిర్మాణింపజేసి, హస్తిశైలమునకు జతుర్వింశతి తత్త్వసంఖ్యాయుతంబగు యిరువదినాలుగు సోపానములమర్చి, విశ్వ కర్మను రావించి దేవదారు కొయ్యతో వరదుని మూలవిగ్రహమును జేయించి పుణ్యకోటి విమానమున బ్రహ్మ బ్రతిష్ఠించెను. యాగాన లోద్భవుడగు ఉత్సవ మూర్తిని సర్వాభరణ సంశోభితునిగ నలంకరించి పలువురుకు దర్శనమిచ్చి యనుగ్రహించు నట్లత్యంత సంభ్రమముతో ఉత్సవములజరిపించి బ్రహ్మ ఆనందకందళిత హృదయుండయ్యెను.

బ్రహ్మదేవునిచే తొలుత జరిపింపబడిన ఉత్సవమగుటచే దీనికి బ్రహ్మోత్సవమును పేరుగల్గినది. శ్రీవారు సన్నిధినుండి బయలుదేరి గంగకొండ మంటపమును విడిసి శ్రీ కామాక్షియమ్మ వారి గుడి ప్రదక్షిణముగ ఆలయమునకు మరలుటకు రమారమి యేడు మైళ్లు లేక పన్నెండు కిలోమీటర్ల దూరమగును. బ్రహ్మదేవునిచే బ్రతిష్ఠింప బడినట్టి కొయ్యతోనైనా "ఆది అత్తిగిరి వరదుడు" తర్వాతి కాలమున పుష్కరిణిలో వేంచేపు జేయబడి యాస్థానమున తద్రూపమైన శిలా విగ్రహముప్రతిష్ఠింపబడినది శ్రీవరదరాజస్వామిదేవాలయపుష్కరిణిలో నున్నది యాదియత్తిగిరి వరదుని దేవదారు విగ్రహము. ప్రస్తుతము హస్తిగిరిపై దర్శనీయమైయున్న విగ్రహము పిమ్మట ప్రతిష్ఠితమైన శిలావిగ్రహము. భక్తులు తమ యాయుష్కాలమునకొక పరియైన దర్శించుట కనువుగ తొలుత నలువది సంవత్సరముల కొకసారియు, పిదప నలభై సంవత్సరముల కొకపర్యాయమూ యాదియత్తిగిరి వరదుని దేవదారు విగ్రహమును వెలుపలకు దెచ్చి వసంతమంటపమున సేవార్థులకు దర్శనీయమగునట్లు ఒక మండలకాలము వేంచేపుజేయించి పిదప యధారీతి నానంద పుష్కరిణిలో జలవాస మొనరించుటయు వాడుకలో నున్నది. అత్తి వరదుడన అత్తికొయ్యతో జేయబడిన వరదుడని యెంచదగదు. తొలుత హస్తిగిరిపై నెలకొన్న వరదుని విగ్రహమగుటచే 'ఆదిహస్తిగిరి వరదు'నిచే పుతింపబడిన యీదారు విగ్రహమూర్తి కాలక్రమేణా భాషా పరిణామముచే 'అత్తిగిరివరదుడనియు' పిదప జానపదభాషలో 'అత్తివరదుడనియు' వ్యవహరింపబడ సాగెను.

ఈ యాదిహస్తిగిరి వరదుని దారువిగ్రహము సమీపకాలమున 1979వ సంవత్సరము జూలై నెల రెండవతేదిని ఆనంద పుష్కరిణినుండి వెలుపలకుగొన్చి వసంతమంటపమున వేంచేపుజేసి యొక మండలకాల

మలంకరించి లక్షలకొలది భక్తులు దర్శించుభాగ్యము సంప్రాప్తించినది.

శ్రీ వరదరాజస్వామివారి సన్నిధిని వెలసియున్న అమ్మవారు 'పెరుందేవి' – మహాదేవి యన బరగుచున్నది. వేద వినుతమైన మహాలక్ష్మియే యీ మహాదేవి లేక పెరుందేవి.

"మహాదేవ్యైచ విద్మహే
విష్ణుపత్నైచ ధీమహి
తన్నో లక్ష్మీః ప్రబోదయాత్"

అను లక్ష్మీగాయత్రియందలి మహాదేవియే వరదరాజవల్లభయై వెలసియున్న పెరుందేవిత్తాయారు. ఈమె భృగుమహర్షి యొనరించిన పుత్రకామేష్టి యాగమున స్వర్ణపుష్కరిణి యందుద్భవించెనని యైతిహ్యము. పడి దాటని పత్ని లేక గడపదాటని మగువయని పేరు బడసిన యీ యమ్మవారు ఉత్సవ కాలముననుగుడిదాటి బయల్వెడలుట లేదు. దేవాలయ ప్రాంగణముననే 'తిరుమంజనకేణి'యను పుష్కరణి నిర్మితమై యుండుటచే యందుజరుగు తెప్ప ఉత్సవమున, శ్రీవారితో అమ్మవారినిగూడ తెప్పలోవేంచేపుజేయుటచే యీఉత్సవము "పెరుందేవి త్తాయార్ తెప్ప" అని ప్రసిద్ధి జెందినది.

బ్రహ్మయజ్ఞమున నావిర్భవించిన వరదుడు సత్వగుణసంపన్నుడగుటంజేసి స్వాభావికమైన కరుణాతిరేకముచే భక్తవరేణ్యుల బ్రోచిన వృత్తాంతము లనేకములు. తన యర్చావతారస్థితి నతిక్రమించి తనకు ఆలవట్ట కైంకర్య మొనర్చిన కాంచీ పూర్ణులతో సహృదయుడై సంభాషించిన కరిగిరివరదుని కరుణా విలాసమును "శ్రీ కాంచీ పూర్ణమిశ్రేణ ప్రీత్యా సర్వాభిభాషణే" అని "శ్రీవరదరాజ మంగళాశాసనము"నుస్తోత్రమున శ్రీమన్మనవాళ మహామునులు స్తుతించియున్నారు.

కాంచీపురమునకు సమీపమునను్న 'పూవిరుందవల్లి' లేక పూంద మల్లియనబరుగు పుణ్యస్థలమున వైశ్యకుల సంజాతుడై యవతరించిన శ్రీ కాంచీపూర్ణుడగు భక్తవరేణ్యుడు పూందమల్లియందు పూదోటను బెంచి పూలదండలగూర్చి కాలినడకను కంచికి గొనివచ్చి కంచివరదునికి సమర్పించి పుష్ప కైంకర్య మొనరించుచుండెను. పిదప కాంచీపురముననే వసించి యాగానల సముద్భవుండైన వరదునికి తాపోపశాంతమై హితమగునట్లు విసనకఱ్ఱతో వీచి ఆలవట్ట (విసనకఱ్ఱ) కైంకర్య మొనరించుటంజేసి యీ మహనీయునికి "తిరుఆలవట్టం తిరుకచ్చినంబి" అను ప్రసిద్ధ నామ మేర్పడినది. కంచివరదుడీ కాంచీ పూర్ణునితో నతి ప్రియంబున సంభాషించెడి వాడని ప్రతీతి.

యాదవ ప్రకాశుని యొద్ద వేదాధ్యయన మొనర్చు కాలమ్మున రామానుజులు యాదవప్రకాశులు ఉపదేశించిన యుప నిషద్వాక్యార్థ ములను వేరు విధముగ వివరించుటంజేసి యాదవ ప్రకాశునికి రామాను జుల యెడ నభిప్రాయ భేదము, దానంజేసి వైషమ్యము ఏర్పడి ద్వేషమభి వృద్ధిజెంది కాశియాత్రయను మిషతో మార్గమధ్యమున రామానుజుల వారిని కపటోపాయమున హతమొనరింపవలెనను దురుద్దేశము యాదవ ప్రకాశులకుగల్గెను. సర్వజ్ఞుడైన వరదుడు ప్రయాణమధ్యమున రామా నుజులవారిని యాదవప్రకాశుల గోష్ఠినుండి దప్పింపజేసెను. మఱియు కాననమున జిక్కి దిక్కు దెలియకున్న రామానుజులవారికి కిరాతుని రూపమునగనుపించి కాపాడి కంచికి దోడ్తెచ్చి కటాక్షించిన కంచివరదుని కరుణాతిరేక మసాధారణము.

కంచివరదుని కరుణావిలాసమున కచ్చెరువొందిన రామానుజుల వారికి వరదుని వైభవమును వివరించి వారిని శ్రీవారి తిరుమంజనమునకై తీర్థకైంకర్య మొనర్చునట్లు జేసిన ఘనత శ్రీ కాంచీపూర్ణులకే జేరును.

శ్రీవైష్ణవ పూర్వాచార్య వరేణ్యుడైన శ్రీయామునాచార్లు కంచి వరదుని దేవాలయ ప్రాంగణమున రామానుజులవారిని కటాక్షించు సందర్భము నేర్పఱచి తన యనంతరము శ్రీ వైష్ణవదర్శనమును నిర్వహించి గాపాడగల సామర్థ్యము రామానుజులవారికి గలదను నమ్మిక యాళవందార్లకు గల్గుటకు కారణభూతుడై యుపకార మొనర్చిన మహనీయుడు శ్రీ కాంచీపూర్ణుడు.

శ్రీ యాళవందార్లు శ్రీమద్రామానుజులవారిని దొలుత కటాక్షించిన పుణ్యప్రదేశము శ్రీ కంచివరదుని దేవాలయము.

శ్రీ యాళవందార్ల నాశ్రయించనెంచి శ్రీరంగమున కేతెంచిన శ్రీ మద్రామానుజులు శ్రీయాళవందార్లు పరమపదించుటగని చింతాక్రాంతుడై కాంచీపురమునకు తిరిగివచ్చి జఱిగినదంతయు శ్రీకాంచీపూర్ణుల కెఱిగించి విశిష్టాద్వైతసిద్ధాంత స్థాపనమున తనకేర్పడియున్న యభిప్రాయములు సరియైనవాయని శ్రీవరదునడిగి దెలియజెప్ప వలసినదిగ శ్రీమద్రామానుజులు కాంచీపూర్ణులను ప్రార్థించిరి. శ్రీ కాంచీపూర్ణుల వలన రామానుజులు యభిప్రాయమెఱిగి వైష్ణవము వర్ధిల్లు నిమిత్తము శ్రీవరదరాజస్వామివారు 'ఆరువార్తల' ననుగ్రహించిరి. కంచివరదుని యారువార్తల నుండి తానే పరతత్వమనియు, అంతిమ కాలమున స్మృతి యవశ్యము అనునియమములేదనియు, మరణానంతరము మోక్షము నిశ్చయమనియు శ్రీకాంచీపూర్ణుల ద్వారా శ్రీమద్రామానుజులవారికిని, వారి మూలముగ లోకమున కెఱిగించిన కంచివరదుని కరుణాతిరేకము వర్ణనాతీతము

కంచివరదుని స్వరూప గుణ విభూతులనుభవ పూర్వకముగ సులలితసుందరతర గీతముల నభివర్ణించి లోకోపకారమొనర్చిన మహనీయులలో శ్రీమన్నిగమాంత మహాదేశికులవారు, శ్రీమన్మనవాళ మహామునులవారు ప్రశంసనీయులు. వరదానకుశలుడైనవరదునికళ్యాణగుణ

విశేషములతోబాటు మహాలక్ష్మియగు పెరుందేవితాయార్ల ప్రభావము లోకప్రసిద్ధమగునట్లు అమ్మవారి కరుణాతిరేకమును ప్రశంసించి శ్రీస్తుతి యనబరగు స్తోత్రరాజముచే నుతించినంతనే శ్రీనిగమాంత మహాదేశికుల ప్రార్థనాఫలితముగ మహాదేవి మహిమచే కంచిలోకనకవర్షము గురిసిన యద్భుతము జగద్విఖ్యాతము. ఆశ్రితజనవత్సలుడై కోరిన వరాలిచ్చు కంచివరదుని వైభవమును శ్రీదేవరాజ మంగళాశాసనమను స్తోత్రరాజ మున శ్రీ మనవాళ మహామునులవారతి రమణీయముగ గీర్తించి యున్నారు.

కంచివరదుని బ్రహ్మోత్సవము సుప్రసిద్ధము. వైశాఖ మాస మున జరుగు నీబ్రహ్మోత్సవపు మూడవఉత్సవము విశాఖానక్షత్రయుక్త పౌర్ణమిరోజున నడచు గరుడోత్సవము జగత్ప్రసిద్ధము. పంద్రెండు గురు ఆళ్వార్లలో శఠగోపుడు, వకుళాభరణుడు, పరాంకుశముని యని ప్రశంసింపబడు శ్రీనమ్మాళ్వార్లవతరించిన వైశాఖ పౌర్ణమి దినమున కంచివరదుని గరుడసేవయేర్పడుట యత్యంత విశేషముగ నెంచబడు చున్నది.

కాంచీపురమునకు సమీపముననున్న షోలంగిపురమను ఘటికాచల క్షేత్రమున దొడ్డాచార్యులను వైష్ణవ భక్తవరేణ్యుడు వసించుచుండెను. ప్రతి సంవత్సరము శ్రీ దొడ్డాచార్యులు ఘటికాచలమునుండి కాలినడకను కాంచీపురమువచ్చి శ్రీవరదరాజస్వామి బ్రహ్మోత్సవమును కనులార గాంచి సేవించి సంతుష్టి జెందెడివాడు. కాలక్రమమున నొకయేట వయోధిక్యముచేనైన శరీర దౌర్బల్య కారణమున కంచి కరుదెంచి వరదుని బ్రహ్మోత్సవమును సందర్శింప లేమికి చింతించి గరుడోత్సవ వైభవమును గనజాలని తనశరీరస్థితికివగచి గరుడోత్సవ వైభవాతిశయ మును మదినెంచి గరుడోత్సవ వైభవాతిశయమును తన హృదయ ఫల కమున చిత్రించి మదిజొక్కి తన్మయత్వమునొంది భక్తి పెల్లుబుక గరుడ

వాహన సేవ నభివర్ణించి పరవశుడై 'తక్కాన్‌కొళం' అనఁడు కోనేటి గట్టున స్తుతించి నిల్చెను.

"ప్రత్యూషేవరదః ప్రసన్నవదనః ప్రాప్తాభిముఖ్యాన్ జనాన్
ఆబద్ధాంజలి మస్తకాన్ అవిరళాన్, ఆబాలమానందయన్
మందోద్ధాపరచామరో మణిమయ శ్వేతాతపత్రశ్రైః
అంతర్గోపురమావిరాస భగవాన్ ఆరూఢ పక్షీశ్వరః"

ప్రమోదమగు ప్రత్యూషకాలమున అర్చకులు వింజామరమువీవ, భక్తజనులు 'వరదా, వరదా' యని కేలుమోడ్చి వినుతింప, తెల్లని పెద్ద గొడుగుల నీడను గరుడారూఢుడై విరాజిల్లు భువన మోహనాకారమైన ప్రసన్నంబగు వరదుని సుందరమందస్మిత ముఖారవిందమును సందర్శింప లేమికి దుఃఖించుచున్న దొడ్డాచార్యులను కటాక్షించు సంకల్పముతో కరుణాంతరంగుడైన కంచివరదుడు అర్చకుల మనసున దొచ్చి వారిచే గొడుగులను ముందుకువంచి క్షణకాలము మఱుగగు నట్లొనర్చి షోలంగిపురమున తక్కాంకొళమను కోనేటిగట్టున తన్నెంచి నిల్చియున్న దొడ్డాచార్యులకు గరుడవాహనసేవ గల్గజేసి సాక్షాత్కరించిన సంఘటన సుప్రసిద్ధము. ఈ సంఘటనను జ్ఞాపక మొనర్చు విధమున నీ నాటికిని కాంచీపురమున దేవరాజాలయ గోపుర ద్వారమున గరుడోత్సవ దినమున గోపుర దర్శన సమయమున గొడుగులను కొద్దిగవంచి శ్రీవారి ముఖ మండలము గన్పించకుండునట్లు మరుగుపరచుట సంప్రదాయమై "దొడ్డా చారి సేవయన" ప్రసిద్ధి జెందియున్నది.

సంగీత మున్మూర్తులలో శ్రీ త్యాగరాజస్వామివారు, శ్రీముత్తుస్వామిదీక్షితులవారు కంచివరదుని గరుడోత్సవ వైభవమును తమ కీర్తనలలో వర్ణించి నుతించియున్నారు. బ్రహ్మాది దేవతలు, సనకాది మహామునుల గొలువ, గరుడవాహనుడై వేంచేసిన వరదరాజ

వైభవము "వినతాసుతవాహనుడై వెడలెను" అను త్యాగరాజ కీర్తనమున నత్యంత శ్లాఘనీయముగ వర్ణింపఁబడియున్నది.

పల్లవి॥ వినతాసుత వాహనుడై వెడలెను
కాంచివరదుడు........ ....  ॥వినతా॥

అనుపల్లవి॥ వనజాసనాది సురులు
సనకాది మునులు కొలువ... ..  ॥వినతా॥

చరణము॥ నెల వైశాఖోత్సవమున శతదినకరులు
దయించిరోయన — పశ్చిమ
గోపురద్వారమున చరాచరములకు
వరత్యాగరాజుకు వగచెలుప  ॥వినతా॥

బ్రహ్మాదిదేవతలచే పూజింపబడు వాడును, నీలమేఘ శ్యామల వర్ణుకును, సకలపుణ్యతీర్థప్రభావసమన్విత కాంచీక్షేత్రమున వెలసి భక్తానంద ప్రదాయకుడై కపిల శుకాది మునులచేత సన్నుతింపబడు గరుడారూఢుడైన కంచివరదుని కరుణాతిరేకము శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి "వరదరాజముపాస్మహే"యను కృతియందు వివర్ణితమై ప్రసంసింపబడియున్నది.

పల్లవి॥ వరదరాజముపాస్మహే — వనజాసనాది పూజితం
॥వరద॥

అనుపల్లవి॥ మురళీధర శోభాకరం — మురఖరాది దుష్టహారం
॥వరద॥

చరణము॥ నీలమేఘునిభ శరీరం — నిరతిశయానందకరం
కాంచీనగరవిహారం — వాళీరక్షితహారం
కలిదోషహర తీర్థప్రభావ గురుగుహాదినుతం
కపిలశుకాదిసన్నుత గరుడారోహితం ॥వరద॥

లోక ప్రసిద్ధమైన కంచి గరుడసేవను గాంచి పులకాంకితుడైన క్లైవు ప్రభువు ఆనందించి సంతోషమున తనభార్య కంఠసీమ నలంకరించి యుండిన మణిహారమును శ్రీ వరదరాజస్వామికి సమర్పించెను. క్లైవు మకరకంఠియని ప్రసిద్ధిజెందిన యీ దివ్యాభరణము గరుడోత్సవ కాలముననే శ్రీ స్వామివారి కలంకరించబడుట కంచి గరుడసేవకు మరొక ప్రత్యేకత.

భక్తజనులు సేవించి తరించుట కనువుగ శ్రీ కంచి వరదుని గరుడోత్సవము సంవత్సరమున మూడుసార్లు జరుపబడుచున్నది. మొదటిది వైశాఖ మాసమున జరుగు బ్రహ్మోత్సవమున వచ్చు మూడవ నాటి యుత్సవము. ఈ గరుడసేవ వైశాఖ పౌర్ణమి దినమున జరుగుచున్నది. రెండవది జ్యేష్ఠ మాసమున పెరియాళ్వారని ప్రశంసింపబడు విష్ణుచిత్తులవారి జయంతి దినమగు స్వాతీనక్షత్రయుక్త శుభదినమున పెరియాళ్వార్ శాత్తుమురై సందర్భమున సంభవించు "ఆనిగరుడవ్" అని ప్రసిద్ధిజెందిన జ్యేష్ఠ గరుడోత్సవము. మూడవ గరుడసేవ యాషాఢ మాసమున పౌర్ణమి దినమున నడచు గజేంద్ర గరుడోత్సవము. ఇట్లు కోరినవరాలిచ్చు కంచి వరదుని గరుడసేవను సంవత్సరమున వైశాఖ జ్యేష్ఠ, ఆషాఢ మాసములలో మూడుసార్లు భక్తులు కనులార సేవించి కృతార్థులగుచున్నారు.

కంచివరదుడు బ్రహ్మోత్సవమున ఐదవనాడగు మోహినియుత్సవమున పల్లకిలో నూరేగింపబడి పెద్దకంచిలోని ప్రవాళవర్ణుని గుడిలో

విడిసి మర్యాదలు జేకొనుట వాడుకలో నున్నది. సంక్రాంతి సమయ మున కనుమ పండుగరోజున కంచికి సమీపముననున్న పాతశీవరము గ్రామమున కొండపైనున్న నరసింహస్వామిగుడికికంచివరదుడు వేంచేసి పగలంతయు కొండపై విడిసి, భక్తులు సేవింప సాయంసమయమున కొండదిగి కంచికి మరలు శీవరం పార్వేట ఉత్సవము ప్రసిద్ధము. చైత్రమాసమున చిత్రా పౌర్ణమిదినమున కాంచీపురమునందలి క్షీరనదీతీర మునకు వరదరాజస్వామి వేంచేయుట నడబావి యుత్సవమనబరగి యత్యంత కోలాహలముగ జరుపబడుచున్నది. భక్తజనులు పాలేటి గట్టున గుమిగూడి నిండు చంద్రుని పాలవన్నె వెన్నెల వెలుగులో వరదుని దివ్యమంగళ విగ్రహమును కనులార సేవించి యానందకందళిత హృదయులై శ్రీవరదరాజవైభవమును వేనోళ్ళగొనియాడు నీ నడబావి యుత్సవము సుప్రసిద్ధము.

శ్రీవరదరాజస్వామి దేవస్థానమందు హస్తిగిరిలోన గుహానృసిం హమూర్తి సన్నిధి గలదు. గుహానరసింహమూర్తి నారాధించుటచే దేవేంద్రునికి శాపవిమోచన మేర్పడినట్లును, అందులకు సాక్షిభూతముగ నుండిన రెండుబల్లులు పిదప వరదుని కరుణావిలాసముచే శాపవిముక్తి బొందినట్లును కాంచిపురమున విశేషముగ వివరింపబడి యున్నది. తదుపరి దేవేంద్రుడు రెండుబల్లుల జ్ఞాపక చిహ్నముగా స్వర్ణముచేతను, రజితముచేతను రెండుబల్లుల ప్రతిమలను జేయించి ప్రతిష్ఠింపజేసెను. ఈబంగారు వెండి బల్లుల దాకుటచే బల్లి పతనమువలని దోషము నివృత్తి యగునట్లు దేవేంద్రుడు వరమొసగినట్లు జెప్పబడుచున్నది.

కంచివరదుని సన్నిధి పంచ ప్రాకారములమధ్య కరిగిపైరి నిర్మి తమైయున్నది. రాజగోపుర ద్వారమున ప్రవేశించినంతనే "ఆనంద సరస్సను" పుష్కరిణి గలదు. దాని గట్టున శ్రేష్ఠమైన శిల్పకలా

నై పుణ్యముతో నొప్పారు. 'నూట్రుక్కాల్ మండపము' నునూరు స్తంభాల మంటపము గలదు. కోనేటి గట్టును జుట్టి శ్రీరంగనాథస్వామి సన్నిధి శ్రీరాములవారి సన్నిధి, చక్రత్తాళ్వారనఁబడు శ్రీ సుదర్శనము సన్నిధి విరాజిల్లుచున్నవి.

శ్రీ సుదర్శనమన మంచి మార్గమును జూపునది యని యర్థము. మంగళప్రదమైన భగవంతుని పాదపద్మముల నాశ్రయించి శ్రేయస్సును బొందుటకు త్రోవజూపి దోహదమొనర్చుటచే శ్రీసుదర్శనమని స్తుతింప బడుచున్నది. విష్ణుచక్రమైన శ్రీసుదర్శనము జ్ఞానప్రదాయకమగుటచే నొకవైపున యోగనరసింహరూపమునను, మరొకవైపున సాధు సంరక్షణార్థము దుష్టనిగ్రహమునకు సంసిద్ధమై వివిధాయుధాలంకృతమైన పదునారు హస్తములతోను వెలసి దర్శనీయమైయున్నది. కోరి వచ్చిన వారిని కవచమువలెగాపడి, దావాగ్ని చోర రోగ భయముల బోగొట్టి, రాజసంకటమునుండి గాపాడి, జయమును గల్గించి, భూతప్రేత పిశాచ శాకినీడాకిన్యాది పిశాచముల నొకనీయకసంరక్షించి, చిత్తభ్రమను దొలగించి, సద్బుద్ధి నొసగి, గ్రహపీడను వదిలించి, వంశ వృద్ధిని గల్గించి సుఖముండుటకు సాధనమైన శ్రీ సుదర్శన వైభవము వర్ణనాతీతము. జగద్రక్షణము కర్తవ్యమై జగన్నాథుడగు శ్రీమన్నారాయణుని హస్తాలంకృతమై యొప్పు శ్రీసుదర్శనమునకు కంచివరదుని కోనేటి గట్టున ప్రత్యేక సన్నిధి గల్గుట యొక విశేషము. సకలశక్తి సమన్వితమై, ఐహికాముష్మిక ఫల ప్రదాయకమై, శుభప్రదమై శోభిల్లు నీ సుదర్శన చక్రము నారాధించు భక్తజనులు దుర్నిమిత్తములన్నుండి విడివడి ఆయురారోగ్యైశ్వర్యములతో వర్ధిల్లి సుఖసంతోషముల బొందుచున్నారు.

ఆనంద సరస్తీరమున ప్రతిష్ఠితమైయున్న మహిమాన్వితమగు శ్రీసుదర్శనుని దర్శించి వరదుని యాలయప్రాకార ప్రదక్షిణము జేయు

నపుడు నమ్మాళ్వారనబడు పరాంకుశముసన్నిధి, మధురకవియాళ్వార్ల సన్నిధి, శ్రీమన్నాథమునులు, శ్రీమన్మనవాళమహాముసులు, ఉడయవర్ల నబడు శ్రీమద్రామనుజులవారి సన్నిధులను భక్తులు దర్శించుచున్నారు. అటుపైన యీ దేవాలయ కైంకర్యమున తమ్మర్పించుకొని యుండిన శ్రీతాతాచార్యులవారి మందిరము వాహనమంటపములు గలవు.

శ్రీయాళవందార్ ప్రాకారమనబడు ద్వితీయ ప్రాకారమున శ్రీ ఆదిశేషుడు, శ్రీకరిరాజవరదుని సన్నిధులు దర్శనీయములు. మూడవ ప్రాకారమున ప్రదక్షిణముగ వచ్చునపుడు 'శ్రీఆండాల్' అనబడు గోదాదేవి సన్నిధి, శ్రీరాములవారి సన్నిధి, విష్వక్సేనుని సన్నిధి, మళయాళనాచ్చియార్ మందిరము. పెరుందేవిత్తాయారను అమ్మవారి గుడి, నృసింహస్వామి సన్నిధి, ధన్వంతరిసన్నిధి, వినాయకునిగుడి దర్శనీయమైయున్నవి. పిదప హస్తిగిరిపై నెలకొన్న శ్రీవరదరాజస్వామి వారిని సేవించి లోపలి ప్రాకారమును ప్రదక్షిణము జేయునపుడు శ్రీవారి సన్నిధికి వెనుక భాగమున బంగారు వెండి బల్లులు, సూర్య చంద్రుల బింబములు దర్శింపబడుచున్నవి. ఈ బంగారు వెండి బల్లులను తాకు వారికి బల్లి పతనమువలని దోషము నివృత్తియగునని ప్రతీతి. కాంచీ పురమున నివసించువారికి, కంచివరదుని గుడిలోని బంగారు వెండి బల్లులను తాకువారికి బల్లిపడుటవలని దోషము లేర్పడుట లేదని యెంచబడుట యీ దివ్యస్థలపు ప్రత్యేకత.

శ్రీ వరదరాజ వైభవమును వినుతించిన వకుళాభరణులనబడు నమ్మాళ్వార్ల జయంత్యారాధన శాత్తుమురై వైభవమును, కంచివరదుని గరుడోత్సవ వైభవమును సే వి ం చు ట జన్మ సాఫల్యదాయకమని

శ్రీ వైష్ణవుల తలంపు. సత్యవ్రతనామాంకిత శ్రీకాంచీక్షేత్రమున హస్తిశైలశిఖరంబున విరించికృతయాగానల సముద్భవుండై పుణ్యకోటి విమానంబునవెలసియున్న శంఖచక్రగదాఽభయముద్రాధరుండును, ప్రసన్న వదనారవింద సుందరుడును, కనక రత్న మణిమయాభరణ విరాజితుండును, పద్మ సంకాశ చరణుండును, ఆశ్రితవత్సలుండును, భక్తాభీష్ట వరప్రదాయకుండును నగు శ్రీవరదరాజును తద్వైభవమును వినుతించి సేవించుట సర్వమంగళ ప్రదమగును.

—·o:—



# శ్రీ యథోక్తకారి ప్రభావము

(పొన్నవణ్ణత్తై దప్పెరుమాళ్ దేవాలయము)

శ్రీదేవియు, వాగ్దేవియు నొక సమయమున తమలో నెవ్వరధికులని వివాదించుకొని పరిష్కారమునకై న్యాయాధిపతియగు దేవేంద్రునికడ కరిగి తమలో నెవ్వరు గొప్పవారో తెలుపవలసిందని కోరుకొనిరి. "ధనమూలమిదం జగత్తను" లోకోక్తి కనుగుణముగ సకల భోగ భాగ్యంబుల కాధారమైనది లక్ష్మీ కటాక్షమే యనియు, శ్రీదేవి కటాక్ష వీక్షణ మాత్రమున సర్వైశ్వర్యములు సంప్రాప్తమై తద్వారా సమస్త వైభవములు ఏర్పడుటచే విద్వద్ధనులకు సహితమాశ్రయమియ్యగల బలిమి గల్గించుట చేతను, సిరిగల వానికి తక్కినవన్నియు తమంతటనే చేకూరుటచేత లక్ష్మీసంపన్నులకు లోటేమియులేదను బహుజనాభిప్రాయమున కనుగుణముగ శ్రీదేవియే మిన్నయని మహేంద్రుడు నుడువ వాగ్దేవి కోపించి యింద్రుని యేనుగవగుమని శపించెను. శాపగ్రస్తుడైన యింద్రుని కరుణించి శ్రీదేవి సురలోకాధిపుని భూలోకమందలి సింహాచలమున కరిగి భాగవతోత్తముడైన ప్రహ్లాదునివలన శ్రీనారసింహామహామంత్రోపదేశముబొంది యటనుండి సత్యవ్రత క్షేత్రమునకేగి యచట శ్రీహరినెంచి తపమాచరించి శ్రీనృసింహకటాక్షమున శాపవిమోచనబొంది కృతార్థుడవు గమ్మని యనుగ్రహించెను. ఇభరూపంబుననుండి యిందిరారమణు గొల్చి యింద్రుడు నిజరూపంబును బొందిన పుణ్యస్థలము వరదానకుశలుడైన శ్రీవరదరాజస్వామి వెలసియున్న నగరము కాంచీపురము.

ఇంద్రుని యభిప్రాయము తృప్తి గల్గింపనందున సత్యలోకమున తన నాయకుండగు బ్రహ్మదేవుని తమ వివాదమును దీర్చవలసినదని

సరస్వతి వేద సరసీరుహాసనుడు స్వర్గాధిపతియు, న్యాయాధిపతియునగు నింద్రుని యభిప్రాయ ముచితమేయని తెలుప, పతియనియు నెంచక కోపించిన భారతి యచ్చోటు విడిచి వెడలెను. మగువల వ్యర్థవాద మునకును, సరస్వతి యకారణ కోపంబునకును మిగులవగచి, వాణి తన్ను విడిచి వెళ్లుటచే యావిడ యెడబాటుచే వెతనుజెంది సృష్టికార్యము నిరాఘాటముగ నెరవేరుటకై సరసీరుహాసనుడు సరసిజనాభుని సాక్షాత్కారముచే సృష్టి కార్య నిర్వహణ సామర్థ్యమును బొందుటకై యశ్వమేధ యాగమొనరింపనెంచి సత్యవ్రత క్షేత్రమున హస్తిగిరి శిఖర పశ్చిమ భాగంబున యాగశాలను, హోమకుండములను నిర్మింపజేసి క్షేత్రపాలకు డగు నృసింహస్వామిని బూజించి వేదోక్తముగా యాగముజేయ ప్రారంభించెను.

ధర్మపత్ని యుండనుండగ జేయవలసిన యాగమును తన్ను బిలువకయే బ్రహ్మదేవుడు నిర్వర్తించుచుండెనని యాగ్రహ మధిగమింప కోపానలతప్తయైన శారద విరించి యజ్ఞమును విధ్వంస మొనర్చు నుద్దేశముతో తనమాయాశక్తిని బ్రళయాగ్నింబోలు తీవ్రంబగు ననలంబును సృజించి ప్రయోగించెను. పరమేష్ఠి యాగమును సంరక్షించు సంకల్ప ముతో దయామయుడగు దామోదరుడు సరస్వతి ప్రయోగించిన మాయానలంబును తన కరంబులఁబట్టి బంధించి యత్యద్భుతముగ దాని నరికట్టి దీపంబుపోలె తన కరమున ధరించెను. విరించి యజ్ఞసంరక్షణ కారణముగ వెలసిన యీ విష్ణుమూర్తి దీపప్రకాశకుడు, దీపాధారజనార్ద నుడు, విళక్కొళిప్పెరుమాళ్ళను పేర్ల బ్రసిద్ధుడై భక్తులచే గొలువబడు చున్నాడు. తిరుమంగై యాళ్వార్లనుగ్రహించిన తిరువెడుందాండకమను దివ్యప్రబంధ భాగమునను, నమ్మాళ్వార్ల తిరువిరుత్తమునందును దీపప్ర కాశుని సన్నిధి 'తిరుత్తణ్కా' యని కీర్తింపబడియున్నది. ఇచ్చట విష్ణుమూర్తి శ్రీకరవిమానమున పశ్చిమాభిముఖుడై నిల్చి భక్తానుగ్రహ

కారకుడై వెలుఁగొందుచున్నాడు. విష్ణుకంచిలోని యథోక్తకారి సన్నిధికి పశ్చిమమున నరకిలోమీటరు దూరముననున్న యీ దీపప్రకాశకుని సన్నిధిలోని యమ్మవారు మరకతవల్లియను పేర జరగుచున్నది.

దీపప్రకాశుని సన్నిధి నంటినట్లున్నది శ్రీవైష్ణవాచార్యులలో ప్రసిద్ధుడగు శ్రీనిగమాంత మహాదేశికులవారి సన్నిధి. పూర్వమీ ప్రాంతమున గటిక దట్టముగఁబెఱిగియుండినందున, ఈ స్థలమునకు గటికమిట్ట లేక 'తూప్పుల్' యను పేరుగల్గినది ఈ తూప్పుల్ పుణ్య స్థలమే స్వామి నిగమాంత మహాదేశికులవారి యవతార స్థలము.

దీపప్రకాశుని సన్నిధికి సమీపమున ముకుంద నాయకుడను పేర విష్ణుమూర్తి వెలసిన వేళుక్కైయను దివ్యస్థలము ఆళ్వార్లచే కీర్తింపఁబడినది. కనకవిమానమున తూర్పున ముఖమండలముతో నిల్చియున్న యీ ముకుందనాయకుని సన్నిధిలోని యమ్మవారి నామధేయము వేళుక్కైవల్లి యను ముకుందనాయిక. కాలప్రవాహమున నీ స్థలము, ఖిలమైనందున దానికి సమీపముననే నొక దేవాలయమునేర్పఱచి యందు ప్రహ్లాదవరదుడగు నలసింహమూర్తి ప్రతిష్ఠింపఁబడెను. విద్యాకుండ హారికి దక్షిణమున వెలసియున్న సింహరూపుడగు నీ శ్రీహరి తొల్లి సరస్వతి ప్రయోగించిన కాపాలికాస్త్రమును హరించి భక్తానుగ్రహ కారకుడై యిచ్చో వెలసెనని ప్రతీతి. తనచే ప్రయోగింపబడిన మాయానలము, కాపాలికాస్త్రము వ్యర్థముకాగా వాగ్దేవి వెతనొంది విష్ణుమూర్తి నెదుర్కొనుటకై దైత్యులనేకుల నియోగించ దైత్యారి యాదానవుల నెల్ల దునిమెను.

భగ్నప్రయత్నయగు భారతి కోపోద్దీపితయై తానే స్వయముగ యజ్ఞ విధ్వంసమున కుద్యమింప దృఢనిశ్చితయై నదీ ప్రవాహరూపము నొంది మహాప్రళయ కాలంబునంబోలె భీకరమై యతి వేగమున

నేతెంచెను. కోపోద్ధీపుతులైన వారికి ఉచితానుచితములను చింతించు విచక్షణాజ్ఞానము నశించును. కుపితులకు జేయరాని కార్యమేదియు లేదని పూర్వుల యనుభవమునుండి తెలియనగుచున్నది.

"వాచ్యావాచ్యం ప్రకుపితో నహి జానాతి కర్హిచిత్
నాకార్యమస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతేక్వచిత్"
—వాల్మీకిరామాయణము, సుందరకాండము

సర్వజ్ఞుండైన సరసిజనాభు డల్లతి వేగమునవచ్చు ప్రవాహము విరించి యజ్ఞవిధ్వంసమునకై వేగవతి నదీరూపమున నేతెంచిన వాగ్దేవి యని యెఱింగి యుక్తియుక్తముగ నామెనా యనుచిత కార్యమునుండి మరల్చనెంచి పొంగివచ్చు ప్రవాహమున కడ్డముగ నతి చాతుర్యముతో శయనించెను. తన దక్షిణ హస్తము తలగడ గాగ నిద్రాముద్రాభి రాముడై శేషతల్పమున తన ప్రవాహవేగమున కభిముఖముగ శయనించియున్న భుజగశయనునిగాంచి స్త్రీ సహజమైన సిగ్గుచే యాదారి జెల్లక బిలమార్గంబున భూమిం జొచ్చి యంతర్వాహిని యయ్యెను. భుజగశయనుని బుద్ధిబలమున బ్రహ్మ యజ్ఞము రక్షింపబడెను.

అంతర్వాహినియైన వేగవతి యజ్ఞకుండమునకావల బహిర్గతమై తన ప్రయత్నములన్నియు నిరర్ధకములగుటనెంచి వగచి పతిపరిచర్యయే వరమోత్కృష్టమని గ్రహించి యథారీతి తనపతి సాన్నిధ్యమునొందెను. వాణి వేగవతీ నదీరూపమున వచ్చినపుడు ప్రవాహ మార్గమునకు నడ్డముగా శేషశాయియై శయనించిన విష్ణుమూర్తియే యథోక్తకారి యను పేర బరగు భుజగశయనుడు, బ్రహ్మ యొక్క యాగ సంరక్షణార్ధ మేర్పడిన యీ భుజగశయనుని సన్నిధి పుష్కరిణిలో పద్మమున నవతరించిన మహనీయుడే పొయ్‌గై యాళ్వార్. పుష్కరణి తమిళమున "పొయ్‌గై" యనబడుచున్నది. కంచిలోని యీ పన్నగశయనుని

దేవాలయపుష్కరిణిలో అవతరించిన పొయ్‌గై యాళ్వారు పన్రెండుగురు ఆళ్వార్లలో ప్రథముడు. మరియు భక్తిసారుడని పరమేశ్వరునిచే ప్రశం సింపబడిన తిరుమహిశై యాళ్వార్ల ప్రభావమును ప్రకటితము గావించి జగద్విఖ్యాతి పొందునట్లు కరుణించిన యథోక్తకారి వైభవ మత్యద్భుతము.

పూర్వము మహీసార క్షేత్రమని ప్రసిద్ధి జెందిన తిరుమహిశై యను దివ్యస్థలమున తపమాచరించు చుండిన భార్గవమునికిని కనకాంగి యను నప్సరస్త్రీకిని అవయవ పూర్తిలేని శిశువు జన్మించెను. తనకు గల్గిన శిశువు సహజమైన యవయవ నిర్మాణము బొందక యుండుటచే కనకాంగి దానినొక పేముపొదలో బడవైచి తనంత జనెను. అచ్చోట జనార్ధనుడను పేర వెలసియున్న విష్ణుమూర్తి జననీ జనకులచే తమ దిర స్కృతుడై పారవేయబడిన శిశువునుగాంచి యబ్బాలకుండు శ్రీసుదర్శన చక్రాంశ సంభూతుడగుట యెఱింగి కటాక్షించి యతనికి సుందరతర దేహ మునను గ్రహించి యదృశ్యుడయ్యెను. సకలభూత విగ్రహాను గ్రహ కరుండైన జగన్నాథుండగు జనార్ధనుడంతర్ధాన మొందినంతనే సకలలోక శరణ్యుని యెడబాటు కోర్వజాలని బాలకుడు కెవ్వున నేడ్వసాగెను. శిశురోదనము నాకర్ణించిన పద్మసాలె యొకడా బాలకు నెత్తుకొనివచ్చి తన పత్నికిచ్చెను.

బహుకాలము సంతానముగల్గక తపించు తమకు భగవంతుడిచ్చిన వరప్రసాదముగ నెంచి యా దంపతులు బాలకు నత్యంతము గారాబము ముతో పెంచుకొనసాగిరి. ఆబాలకుడు తక్కుంగల శిశువులవలె లోక సహజముగ స్తన్యముగ్రోలక యాకలిదప్పులు లేకుండిన వింత పలువుర నాకర్షింపసాగెను. ఆ ప్రాంతముననేవసించి చాలాకాలము సంతానము లేక విచారించుచుండిన సాలె దంపతులీ వింతను విని యద్భుత శిశువును జూడవచ్చిరి. గురువు, దైవము, శిశువులను జూడ బోవునపుడు రిక్త

హస్తులై జనకూడదనుట యూచారమగుటచే తమయింటి యూవుపాలను దీసికొని వచ్చిన దంపతులు బాలకుని గాంచి ప్రేమాతిరేకమున తాము దెచ్చిన పాలను ద్రావింప ప్రయత్నించినపుడు, అద్భుత శిశువా పాలలో కొంత సేవించిన యద్భుతము అచటి వారికి సంభ్ర మాశ్చర్యముల గల్గించినది. భార్గవ కుమారుడారగించిన క్షీరశేషమును మహాప్రసాదముగ నెంచి భక్తితత్పరతతో పానమొనర్చుటచే నా సాలె స్త్రీ గర్భము ధరించి సత్పుత్రుని గనెను. వారాకుమారునికి "కణికణ్ణన్" — నళినాక్షుడను నామధేయ మొనర్చి యతి గారాబంబుతో బెంచసాగిరి.

తిరుమహిశై క్షేత్రమున బహుకాలము తపమాచరించి యనేక మతములను పరిశోధించి పట్టుదొఱుకని భార్గవకుమారుడు శివభక్తి తత్పరుడై శివవాక్యుడను పేర బరగసాగెను. దైవవశమున శివవాక్యుడను నీ భార్గవకుమారునికి శ్రీ వైష్ణవ భక్తాగ్రేసరుడై విలసిల్లిన పేయాళ్వార్లకును మతసంబంధమైన వాదము సంభవించెను. వివాదమున పేయాళ్వారు విజయము నొందుటచే వారిని తమ యాచార్యునిగ నంగీకరించి యాశ్రయించిన భార్గవకుమారుడు శ్రీవైష్ణవుడై తిరుమహిశై యాళ్వారను పేర పరమభాగవతోత్తముడై ప్రఖ్యాతిగాంచెను. భార్గవకుమారుని విష్ణుభక్తి కచ్చెరువొందిన కైలాసనాధుడగు శివుడు భువికి దిగివచ్చి భార్గవకుమారుని భక్తితత్పరతను బరీక్షించి సంతసించి పార్వతీసహితుడై సాక్షాత్కరించి భార్గవకుమారుని విష్ణుభక్తికిమెచ్చి భక్తిసారుడను బిరుదొసగి ప్రశంసించిన యద్భుతము తిరుమహిశైయాళ్వార్ల ఘనత కొక గీటురాయి.

భక్తిసారులవారు తమ యాచార్యులైన పెరియాళ్వారవతరించిన ప్రస్తుతపు మద్రాసు నగరమందలి మైలాపూరను మయూరిపురియందు కొంతకాలము వసించి యోగమున నుండి పిదప తన జన్మభూమియగు మహీసారక్షేత్రమునకు మరలివచ్చి ఊర్ధ్వపుండ్రములను ధరించుటకై

తాము వాడుకగ నుంచుచోట తిరుమణ్ తిరుచూర్ణములను వెదకి గనపడ కుండుటచే మిగుల వగచి యాప్రొద్దు నెట్లో సర్దుకొని శయనించిన యాళ్వార్ల స్వప్నమున శ్రీ వెంకటాచలపతి సాక్షాత్కరించి నామపేటిక యునికి నెఱింగించెను. శ్రీనివాసుని సూచన నాధారముగా గొని సత్య వ్రతక్షేత్రమగు కాంచీపురమందలి తిరువెహ్కాయను దివ్యస్థలమున పద్మ పుష్కరిణియందు తమ పుండ్రాక్షపేటికను కనుగొనిన తిరుమహిశై యాళ్వారు పులకాంకితుడై యచ్చోవెలసియున్న పరమకారుణ్యమూర్తి యగు పన్నగశయనుని సేవించి యచటనేవసించి భుజగశయనుని కైంకర్యమున కాలము గడుపుచుండెను.

భక్తిసారుల కీర్తిచంద్రికలు నలుదిక్కుల వ్యాపించెను. భక్తి సారుల వైభవమును వినిన నళినాక్షుడు కాంచీపురమునకు వచ్చి వారిని ఆచార్యునిగ స్వీకరించి యాశ్రయించి వారియండనుండి భుజగశయనుని భక్తితో సేవింపసాగెను. ఇట్లుండ భక్తిసారుని మహిమచే వృద్ధస్త్రీ యొకతె ముసలితనము దొలగి నవయౌవనాంగి యయ్యెను. ఆమె సౌందర్యముచే సమ్మోహితుడైన పల్లవరాయడను కాంచీపురాధీశుడా కాంతను వివాహమాడెను. తనపత్ని యౌవన సౌందర్యములు ఆళ్వార్ల యనుగ్రహముచే గల్గినవని యెఱిగి తానును వారివలన నిత్యయౌవనమును బడయుట కాశపడెను.

నిత్యము రాజభవనమునకు భిక్షకై యరుదెంచు నళినాక్షుని బిలి పించి యాళ్వార్లను అంతఃపురమునకు బిల్చుకొని రావలసినదిగా పల్లవ రాయడు కోరెను. తన యాచార్యుడైన యాళ్వారు పన్నగశయనుని యాలయము విడిచి వేరొక చోటికి రానొల్లరని నళినాక్షు డెఱింగించెను. తదుపరి నళినాక్షుడు వరకవియని వినబడి యుండుటచే కాంచిభూపతి యతనిని తనపైనొక కవితాగీతము పాడుమనెను.

అనవుడు నళినాక్షుడు తాను సర్వేశ్వరుడైన పన్నగశయనుని దక్క యన్యుల కీర్తింపజాలనని తెలియజేసి కాంచీక్షేత్రములోని శ్రీవైష్ణవదివ్యదేశములందు వెలసియున్న విష్ణుమూర్తి యాలయములను వరుస పఱచి వినుతించి పాడెను. తన కోర్కెను నిరాకరించినందుల కాగ్రహించిన కాంచిభూపతి నళినాక్షుని తనరాజ్యమునుండి బహిష్కరించి మరునాటి సూర్యోదయమునకు ముందు కంచిని విడిచి వెళ్ళిపోవలసినదని యాజ్ఞాపించెను.

నళినాక్షుడు నాటి సంఘటన దైవసంకల్పమేయని దలపోసి సన్నిధికితిరిగివచ్చి జరిగినవిషయమును ఆళ్వార్లకు పూసగ్రుచ్చినట్లు వివరించి రాజాజ్ఞప్రకారము తాను కంచిని విడిచి వెళ్ళుట కనుమతించ వలసినదిగ ప్రార్థించెను. మధాంధుడైన మహీపతి మాన్యుడైన నళినాక్షునెడ నకారణంబుగ నాగ్రహించి యాతనిని దేశబహిష్కార మొనర్చి యాజ్ఞాపించి జేసిన యకార్యమునకు మిగుల వగచిన యాళ్వారు తన్నాశ్రయించిన నళినాక్షుడు నిలువరానిచోట తానుండ నవసరములేదని యెంచి యతనితో తానును కంచిని విడిచి వెళ్లుటకు నిశ్చయించెను. భాగవతాపచారము జరుగుచోట భగవంతుడుండుట ధర్మముగాదని శేషతల్పమున శయనించి వెలసియున్న విష్ణుమూర్తి నుద్దేశించి

" కమలాక్ష ! కంచివిడిచి నళినాక్షుడు వెడలె
అమరేంద్రపూజిత ! యతనితో నేనుంబోయెద
కమనీయగాత్ర ! పనియేమి యికమీద నిచట నీకు
విమలచరిత్ర ! వెడలిరావయ్యా మావెంట నీపాన్పుతోడ "

అని యాళ్వార్లు ప్రార్థింప శ్లాఘనీయంబైన భక్తిసారుని శిష్య వాత్సల్యమునకు సంతసించిన భక్తపరాధీనుడగు భుజగశయనుడు భక్తవాత్సల్యముచే తన యోగనిద్రనుండిలేచి యాళ్వార్ల చిత్తముచొప్పున కంచినివిడిచి వారిననుసరించి వెనువెంట వెడలెను. అంత సత్యసంకల్పుడైన సర్వే

శ్వరుడగు భుజగశయను సంకల్పముచే కాంచీపురము కార్చీకటిచే గప్ప బడెను.

కాంచీనగరము అంధకార బంధురమగుటచే భయకంపితుడైన కాంచీపురాధీశుడు కలతచెంది తన తప్పిదమునకు పరితపించి పరమ పూజ్యులైన యాళ్వార్లను వెదికి కనుగొని వారి పాదకమలంబుల[ప్రాలి] ప్రణామంబులాచరించి తన యపరాధమును క్షమించి దయాదృష్టివీక్షించి కాంచీక్షేత్రమునకు మరల విచ్చేసి తన్ననుగ్రహింప వలసినదని బద్ధాంజలియై పరిపరివిధముల ప్రార్థించెను. పశ్చాత్తప్తచిత్తుడైన పల్లవరాజు ప్రార్థనను మన్నించిన యాళ్వార్లు నళినాక్షునితో కాంచీపురమునకు తిరిగి రాదలచి భక్తవాత్సల్యముచే తమ్మనుసరించి వెడలివచ్చిన పరమకరుణామూర్తియగు పన్నగశయనుని యథారీతి కంచిలో శేషతల్పమున శయనించి యనుగ్రహించి కటాక్షింప వలసినదిగ ప్రార్థించిరి.

"కమలాక్ష! ప్రయాణంబమాయె నళినాక్షుడిపుడు
అమరేంద్రపూజిత! మరలుచున్నాడనేను కాంచిపురికి
కమనీయగాత్ర! జాలమేల యికమీద దయనుబ్రోవ
విమలచరిత్ర! పవళింపవయ్య పన్నగుని పాన్పుమీద!"

ఆళ్వార్ల ప్రార్థన వినిన భక్తవత్సలుడగు భుజగశయనుడు తన భక్తపరాధీనతను నెలకొల్పి, తిరుమహిశై యాళ్వార్ల ప్రభావము ప్రకటితమై లోకప్రసిద్ధి జెందునట్లను గ్రహింప నెంచి యాళ్వార్ల కోరికను మన్నించి కాంచీపురమందలి తిరువెహ్కా దివ్యస్థలమున యథారీతి శేషశాయియై వేంచేసిన సంఘటన యత్యద్భుతము. ఆళ్వార్ల యందలి యనురాగముచేతనే వారిమాట చొప్పున తాను నడచుకొనునది లోకవిదితమగుటకై పూర్వమువలె దక్షిణహస్తమునకు బదులుగ వామహస్తమును తలగడ జేసికొని శయనించినట్లు ప్రతీతి. భక్తుని ప్రార్థనానుసారము భక్తుడు చెప్పినట్లు నడచుకొనుటంజేసి యీ భుజగశయను డప్పటినుండి

"శొన్న వణ్ణం శైద ప్పెరుమాళ్" "చెప్పిన చొప్పున జేసిన దేవుడు"— యథోక్తకారి యనబరగెను. ఈ యథోక్తకారి యాళ్వార్ల ననుసరించి వెళ్ళి వారితో నొకరాత్రి గడపిన పుణ్యస్థలము కాంచీపురమునకు సమీప మున "ఓరిరుక్కై" యను పేర ప్రసిద్ధమైయున్నది.

పొయ్‌గై యాళ్వారు, పేయాళ్వారు, తిరుమహిశై యాళ్వారు, నమ్మాళ్వారు, తిరుమంగై యాళ్వారు కీర్తించి నుతించిన యీయథోక్తకారి దేవాలయము విష్ణుకంచియనబడు చిన్నకంచిలో శ్రీవరదరాజస్వామిదేవ స్థానమునకు పశ్చిమమున నొక కిలోమీటరు దూరమున నమరియున్నది. యథోక్తకారి సన్నిధికి నుత్తరభాగముననున్న పద్మపుష్కరిణి యనబడు తామరకొలనులోన వికసించిన కమలమునందు ఆశ్వయుజ మాసము శ్రవణ నక్షత్రమున పొయ్‌గై యాళ్వారవతరించిరి. వేదసార విమాన మని విఖ్యాతి జెందిన విమానమున పశ్చిమాభిముఖుడై యథోక్తకారి యనంత శయనుడై వెలసియున్నాడు. ఈ సన్నిధినున్న యమ్మవారు కోమలవల్లిత్తాయారను పేర వరప్రసాదినియై విరాజిల్లుచున్నది.

యథోక్తకారి సన్నిధిని ఫాల్గుణ మాసమున రేవతీ నక్షత్రమున పూర్తియగునట్లు బ్రహ్మోత్సవము, ఆశ్వయుజ మాసమున శ్రవణ నక్ష త్రమున పొయ్‌గై యాళ్వార్ల జయంతి దినమున శాత్తుమురై యుత్సవము యతి వైభవముగ జరుపబడుచున్నవి.

భగవంతుని యాశ్రితవాత్సల్యతకు ప్రమాణముగ కాంచీపురమున వెలసియున్న యనంతశయనుడు తన్నాశ్రయించిన తిరుమహిశై యాళ్వార్ల మాటచొప్పున నడచి వారి ప్రభావమును ప్రకటిత మొనర్చి ప్రకాశింప జేసినట్లు నమ్మివచ్చు భక్తుల ప్రార్థనలను విని వారివారికి దగినట్లు పాత్రత కనుగుణముగ వారివారి కోర్కెల నీడేర్చి శరణాగత జనరక్షకుడై శోభిల్లుచున్నాడు. యథోక్తకారి చరణాబ్జముల సేవ శుభముల బొందుటకు త్రోవ.

—:0:—

# అష్టభుజాని యశౌన్నత్యము

(అష్టభుజ విష్ణుమూర్తి యాలయము)

శ్రీకరుండగు శ్రీహరి సుందరతర మంగళస్వరూపమును దివ్యాభరణములతో శంఖ చక్ర గదా ద్యాయుధములతో సర్వావతారమూర్తియై సాక్షాత్కరింప సేవింపవలయునను అభిలాషచేత శ్రీమన్నారాయణ దివ్య విగ్రహ సందర్శనార్థము సత్యవ్రత క్షేత్రమగు శ్రీ కాంచీక్షేత్రమున బ్రహ్మ యశ్వమేధ యాగమొనరింప నుపక్రమించెను. పత్నీ సహితముగ చేయవలసిన దైవకార్యమును తన్ను బిలువకయే కొనసాగించుచున్నందులకు కినుక జెందిన వాగ్దేవి విరించి యాగమున కంతరాయము గల్గింపనెంచి పరిపరి విధముల ప్రయత్నించ దొడగెను. సత్య సంకల్పుడును, ధర్మసంస్థాపకుడును, ఆశ్రితవత్సలుడును, అఘటనఘటనా సమర్థుడును, అనన్యసాధారణ శక్తి సంపన్నుడను, ఆపద్బాంధవుడను, శరణాగత రక్షకుడును, భక్తపరాధీనుడునునగు భగవన్నారాయణుడు నిజదర్శనాపేక్షతో చతురాననుండొనర్చు యాగము సరస్వతీకృతములగు అనుచితాంతరాయముల పాలుగాకుండునట్లు కాపాడుటకై పలురూపంబులు దాల్చి యాగసంరక్షణ మొనర్చెను.

యాగశాలను దహింపనెంచి సరస్వతి సృజించిన మాయానలమును విష్ణువతి లాఘవమున నరికట్టి దీపంబువోలె దక్షకరంబునబట్టి ధరించి దీపప్రకాశుడను పేర బరెగెను. ప్రళయకాలాగ్నివలె నతితీవ్రమైన మాయానలమరికట్ట బడుటచే నినుమడించిన కోపముతో సరస్వతి యసురుల ననేకుల వియోగింప నారాయణుడు వారినెల్ల నిగ్రహించెను. భగ్నప్రయత్నయైన భారతి యతి భయంకరమైన శరభమును సృజించి

విష్ణుమూర్తిపై ప్రయోగించెను. అత్యంత భీకరాకృతిని విజృంభించి తన్నెదుర్కొన వచ్చిన శరభమును నారాయణు డష్టభుజములతో సంహరించెను.

శరభ సంహారముచే వ్యర్థ ప్రయత్నుయగుటంజేసి యాక్రోశించి క్రోధతామ్రాక్షియైన కమల సంభవురాణి కమలాసనుని యాగభంజన మొనర్ప కరాళవదనయగు కాళింబంపెను. అత్యంత భీకరాకృతితో విజృంభించిన కాళిని అచ్యుతుండత్యంత నైపుణ్యముతో తన యష్టభుజం బులనడంచెను. ఎనిమిది కరములతో వివిధాయుధములను ధరించినిల్చి దుష్ట విగ్రహ మొనర్చి తనయాగమును సంరక్షించినట్లు కంచిలో వెలసి భక్తుల కష్టములను బోగొట్టి కాపాడుమని బ్రహ్మదేవుడువేడ విరించి ప్రార్థనా ఫలితముగ మహావిష్ణు వష్టభుజుడై కంచిలో వెలసి పిదప గజేంద్రుని గటాక్షించెనని పురాణ ప్రసిద్ధి.

విష్ణుకంచి యనబడు చిన్నకంచిలో శ్రీ వరదరాజస్వామి దేవస్థానమునకు రమారమి రెండు కిలోమీటర్ల దూరమున, అడిసన్‌పేటకు సమీపముననున్న రంగస్వామి కొళమను కోనేటిదాపున ఎనిమిదిభుజములతో విరాజిల్లి వెలసియున్న యష్టభుజుని రూప లావణ్యము బహుజనాకర్షణమై యొప్పారు చున్నదని తిరుమంగై యాళ్వారు కీర్తించి యున్నారు. తిరుమంగైయాళ్వారీ యష్టభుజునియెడ నాయికాభావముతో భక్తియుతశృంగార రసభరితములగు గీతములబాడి నుతించియున్నారు.

అష్టభుజుని యెనిమిది కరములందు యెనిమిది విధములైన యాయుధములు శోభిల్లుచున్నవి. కుడివైపుననున్న నాలుగుకరములలో చక్రము, ఖడ్గము, కమలము, బాణము మున్నగు ఆయుధములు, వామ

భాగమునకున్న నాలుగుహస్తములలో శంఖము, ధనుస్సు, డాలు, గద మొదలగు నాయుధములు ఇమిడి ప్రకాశించుచున్నవి. మూల విగ్రహమునకు ముందు శ్రీదేవి భూదేవి సహితుడైన యుత్సవమూర్తి విరాజిల్లుచున్నాడు. ఈ ఉత్సవమూర్తికి ప్రక్కన గజేంద్రవరదుని యుత్సవ మూర్తి గలదు. గుడికి ముందు ఎడమ ప్రక్కన గజేంద్ర పుష్కరిణి గలదు.

కాంచీపురములోని విష్ణ్వాలయములలో శ్రీయష్టభుజుని సన్నిధిని మాత్రమే స్వర్గద్వారమమఱియుండుట యీయాలయమందలి ప్రత్యేకత. శుక్రవార మంటపమనబడు నాల్గుకాళ్ళ మంటపమునకు ప్రదక్షిణమున పుష్పకవల్లి త్తాయారనబడు నమ్మవారి గుడి యమరియున్నది. అమ్మ వారిగుడి యిచ్చట ప్రత్యేకముగఁ గట్టబడియున్నది. ప్రధానాలయము ననే యీ సన్నిధియు నమరియున్నది. తొలుత అమ్మవారిని దర్శించి పిదప పెరుమాళ్ళను సేవించుట సంప్రదాయముగ వాడుకలో నుండుటచే భక్తులు తొలి ప్రదక్షణమున పుష్పకవల్లి త్తాయార్లను సేవించి మరు ప్రదక్షణమున శ్రీవారిని దర్శించుట యిచటి సంప్రదాయము.

గుడిలోపల మొదట ఉత్తరాభిముఖుడైన వరాహమూర్తి సన్నిధిని సేవించి కుడివైపున యాళ్వారాచార్యాదులతో శ్రీరాములను దర్శింపనగును. అష్టభుజునియాలయమందు వరాహమూర్తి యత్యద్భుతమైన రూపమున వెలసియున్నాడు. కుడిపాదమును భూమిపై మోపి యెడమ పాదమును రెండుపడగల పాముపైనుండి భూదేవిని తన వామాంకమున నమర్చి విరాజిల్లు భూ వరహమూర్తి సౌందర్యము నయనానందకరము. అష్టభుజుని సన్నిధినెదుట తూర్పు ముఖమండలముతో గోదాదేవి

శ్రీ యాండాళ్ సన్నిధియు, దక్షిణాభిముఖముగ మారులి మందిరమును గలవు.

చక్రఘోష విమానమున నెనిమిది హస్తములతో పశ్చిమాభిముఖుడై వెలసియున్న యష్టభుజుని దేవాలయము పల్లవరాజుల కాలమున నభివృద్ధిజెంది తదుపరి సంపన్నుల యాదరముచే ననేక కైంకర్యముచే శోభాయమానమై విరాజిల్లుచున్నది. అష్టభుజునికి చైత్రమాసమున బ్రహ్మోత్సవము, ఆషాఢ మాసమునందు హస్తా నక్షత్రమున గజేంద్ర మోక్షోత్సవము విశేషముగ జరుపబడుచున్నవి. భక్తుల భయమును బోగొట్టి వాంఛితార్థ ఫల ప్రదాయకుడై కాంచీపురమున వెలసియున్న యష్టభుజుని సేవించుటచే యద్దేవుని యనుగ్రహమున సర్వమంగళములు సిద్ధించును.

—/—

# ప్రహ్లాదవరదుని ప్రభావము

(తిరువేళుక్కై నరసింగప్పెరుమాళ్ ఆలయము)

శ్రీకరుండును, ఆశ్రితజన వత్సలుండును, సర్వేశ్వరుండును నగు శ్రీమన్నారాయణుడు సర్వవ్యాపియనియు, సర్వమయుండనియు, సర్వశక్తుడనియు, నిరూపించుటకై యేర్పడిన యవతారములలో నరసింహావతారము విశిష్టమైయున్నది. భగవాన్ భక్త భక్తిమాన్"— భగవంతుడు భక్తులయందు భక్తిగలవాడనుటకు నిదర్శనముగను,

"నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం, సమదర్శనం
అనువ్రజామ్యహం నిత్యం పూయే యేత్యంఘ్రిరేణుభిః"

సమదృష్టిగల్గిన మహాభక్తుని పాదరేణువులఁగోరి భగవంతుడు భక్తుని వెన్నంటి యుండుననుటకు సాదృశ్యముగాను, "భయకృద్భయ నాశనః"— భక్తులకు క్లేశము గల్గించనెంచు దుర్జనులకు తనప్రతాపముచే భయమును గల్గించి, భక్తుల కేర్పడిన భయమును బోగొట్టువాడు భగవంతుడను శ్రుతివాక్యము సత్యమని నిరూపించు విధమునను ఏర్పడినది శ్రీ నృసింహావతారము.

తపోబలముచే సముపార్జితమైన వరగరిమచే గర్వితుఁడైన కనకకశిపుడు తన్నుమించినవాడు లేడను నహంకారమున విచక్షణ జ్ఞానమును గోల్పోయి సకల ప్రాణి హృదయాంతరాళముల భాస్వజ్జ్యోతియై వెలుగొందు సర్వవ్యాపియగు విష్ణుని ధిక్కరించి విరోధభావమున విష్ణువైరియై యుండెను. అహంకార మతిశయించుటచే గర్వాంధుడై పరమాత్మయైన పరంధాముని ప్రతిభను గ్రహింపలేక తానే యగ్రగణ్యు

డనని విజృంభించుచుండెను. భోగాలము దాపురించుటచే "వినాశకాలే విపరీత బుద్ధిః" అను లోకోక్తి కొప్ప జనులెల్ల భగవన్నామ స్మరణకు బదులుగ తన నామమునే స్మరింపవలెనని కనకకశిపుడు శాసించెను. ధర్మవిరుద్ధముగ హిరణ్యకశిపు నామమును స్మరింప మనస్కరింపకయు రాజశాసనమునుల్లంఘిలేకయు తల్లడిల్లుచున్న సజ్జనుల గాపాడి సాధు పుంగవుల సంరక్షించి దుష్టుడైన కనకకశిపుని నిగ్రహించి ధర్మసంస్థాపన మొనర్చి ప్రజల యందాస్తికత్వము నిలబడి భక్తిభావ మభివృద్ధి జెందుటకై శ్రీమన్నారాయణుని దివ్యసంకల్పమున కనక కశిపునకు కుమారుడై ప్రహ్లాదు డవతరించెను.

ప్రహ్లాదుడు బాల్యమునుండియు విష్ణుభక్తి తత్పరుడై విరాజిల్లుచుండెను. మాతృ గర్భమునుండి గలిగిన హరిభక్తి తత్పరతచే సర్వలోక క్షేమంకరమును, దివ్యధామమునైన హరినామ స్మరణమే నిత్య నియమముగా గల్గియుండెను. హరి పాదసేవ దొరుకుట జన్మాంతర సుకృత విశేషమనియు, హరినామస్మరణచే హరిపాదసేవయు, దానిచే భగవత్కృపయు ప్రాప్తమై దైవ సాక్షాత్కారము సిద్ధించుట నిక్కమనియు, మానవజన్మమునకు దైవసాక్షాత్కారమే ప్రధానలక్ష్యమనియు నెఱనమ్మిన భాగవతోత్తముడు ప్రహ్లాదుడు.

భగవదనుగ్రహముచే నిత్తమ విలక్షణమైన సుఖానుభవమును బొందువరకు భగవంతుని పరిపరివిధముల వేడుకొనుట భక్తిలక్షణము. పరమాత్మని స్వరూప వైభవమున లీనమై విశ్వమునంతయు విష్ణుమయముగ దర్శించుచు, సర్వేంద్రియ ప్రవృత్తులలో హరిభక్తియుక్త ప్రేమభావమున నిత్యతృప్తుడై యుండుట భక్తిసంప్రదాయకమున పరమ భాగవతసిద్ధి. అట్టి పరమ భాగవతులలో ప్రహ్లాదు డగ్రగణ్యుడు. విశ్వమంతయు మాయా మాత్రమనియు, విషయభోగములు ఎండ మావులవంటి వనియు గ్రహించి నిత్యసుఖదాయకుడు శ్రీమన్నారాయణు

చేయని నమ్మి హరిచరణారవింద సమర్పిత చిత్తముచే సంప్రాప్తించు హరితాదాత్మ్యమే బ్రహ్మానందకరమని నిశ్చయించుటయే ప్రహ్లాదభక్తి వైశిష్ట్యము.

నిజబలగర్వితుడై నిజము నెఱుగలేక తానే సర్వశ్రేష్ఠుడను నహో హాతో నహంకారమున విష్ణు విరోధియైయున్న తన తండ్రి యధోగతి పాలుగాకుండ గాపాడుట పుత్ర ధర్మమగుటచే ప్రహ్లాదుడు కనకకశిపునికి హరి సర్వవ్యాపియనియు, సర్వశ్రేష్ఠుడనియు, పురుషోత్తముడనియు, దెలియజెప్పెను. "పురిశేత ఇతిపురుషః" పురి—హృదయాకాశమందు, శేతు శయనించియున్నవాడు కదలకయుండువాడు గాన పురుషుడని సంకేతము పరమాత్మయగు హరి సర్వజీవుల దేహరాకాశమునందు వెలుగొందుటచే పరమపురుషుడు లేక పురుషోత్తముడగుచున్నాడని ప్రహ్లాదుడు తెలియజేసెను. విశ్వమయుండును, విశ్వవ్యాపియునగుటచే హరి విష్ణువనబరగుచున్నాడని యెఱిగించి ప్రహ్లాదుడు కనక కశిపునికి హరిగరిమను గురుతుచేసెను.

"హరిమయము విశ్వమంతయు,
హరి విశ్వమయుండు సంశయము పనిలేదా
హరిమయముగాని ద్రవ్యము
పరమాణువులేదు వంశపావన! వింటే"

(శ్రీమహాభాగవతము, ద్వితీయ స్కందము)

దేవ, మనుష్య, రాక్షసులచేతను, తదితర ప్రాణివర్గముచేతను, పగటివేళను, రాత్రియందును, గృహము లోపలను, వెలుపలను, తనకు మరణము సంభవింపకుండునట్లు వరముల బడసి మరణ భయము లేదను విశ్వాసముతో నసమాన శూరత్వమున జెలగుచున్న కనక కశిపుడు తన కుమారుడే తన్ను సరకుచేయక హరియే సర్వమని యుండుటకు మిగుల

వగచి ప్రహ్లాదు నెట్లైన తన దారికి దెచ్చుటకై పరిపరి విధముల ప్రయత్నించి నిష్ఫలుడై ప్రహ్లాదునసేక బాధలబెట్టి హరి యెచ్చటనున్నాడు జూపుమని దండించెను.

"సత్యం విధాతుం నిజభృత్య భాషితం।
వ్యాప్తించ భూతేష్వఖిలేషు చాత్మనః॥"

తన భృత్యుడగు ప్రహ్లాదుని మాట – చక్రిసర్వోపగతుండను మాట సత్యమై భగవంతుడు సకల భూతములందు వ్యాపించియున్నాడని రుజువు చేయుటకై కనక కశిపుడు జూపించిన స్తంభమున శ్రీ మన్నారాయణుడు నరసింహమూర్తియై యావిర్భవించి దైత్యునిద్రుంచి భక్తుడగు ప్రహ్లాదునిగాంచి ప్రహ్లాదవరదుడయ్యెను.

కనక కశిపుడు తన్ను ధిక్కరించినను భగవంతుడు సహించి యుండెను. కాని తన భక్తుడగు ప్రహ్లాదుని హింసించి నందుల కోర్వజాలక

"ఇందుకల డందులేడని
సందేహము వలదు చక్రిసర్వోపగతుండు
ఎందెందు వెదకిజూచిన
నందందే గలడు.......... " అని తన సర్వ వ్యాపకత్వమును నిస్సందేహముగా నెఱింగించిన భక్తునిమాట నిజమని నిరూపించుటకై హరి 'నరహరి'యై స్తంభమునుండి వెలువడి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని సంరంక్షించెను.

"అలవాడు కనకకశిపు నిండారు
చలముచేసి సుతుని సకల బా

ధ(ంలబెట్టగా మదిని లౌకక ని
శ్చలుదైన ప్రహ్లాదు కొఱకు కంబము లో
పల నుండగ లేదా......... ..." యని నృసింహావతార
వైభవమును త్యాగరాజస్వామి "ఎందు దాగినాడో" యను కీర్తనమున
ప్రస్తుతించి యున్నారు.

"సటలిటలాడ కోరి హరి సర్వమయుండెయటంచు పట్టితో
చిటచిటలాడి నిండుగనజేయుము నీవని దైత్యుడాడిన౯
పటపటరాతి కంబమిరువాయలుగా నరసింహమూర్తివై
కుటిలనఖాగ్రవీచికల గ్రువ్వవెవాని యురః కవాటము౯"

నారాయణుడేడి చూపుమని హిరణ్యకశిపుడు భక్తుడగు ప్రహ్లాదుని
ధిక్కరింపగనే నిరంతర భక్తరక్షణయందలి జాగరూకుడై నిజభక్త
సంరక్షణము కర్తవ్యముగా గల్గిన భక్తజన భయాపహారి యగు హరి
నరహరియై దుర్జనుడైన హిరణ్యకశిపుని సంహరించి సజ్జనుడైన ప్రహ్లా
దుని సంరక్షించెను.

దేవదానవ రాక్షసులచేతను, మృగములచేతను, మరణము సంభ
వింపకుండునట్లు కనకకశిపుడు వరములబొంది యుండుటచే నరరూపము
మృగరాజగు హరిరూపము సమ్మిశ్రితమై నరహరియై నరసింహరూపమున
నావిర్భవించెను. భూమ్యాకాశములందును గృహములోపలను, వెలుప
లను చావులేకుండునట్లు వరముండుటచే నతని గృహాంగణమున తన
తొడపై నుంచుకొని రాత్రి పగలుగాని సంధ్యాసమయమున యాయుధ
మేమియు జేకొనక వాడియగు తన చేతి గోళ్ళచే హిరణకశిపుని హృద
యమునుజీల్చి యతనివరములు పొల్లుగాకుండునట్లు విష్ణువనన్య సంధారణ
సామర్థ్యంబున దైత్యునిద్రుంచి దుష్టనిగ్రహముతోబాటు భక్తుడైన
ప్రహ్లాదుని సత్యవాక్యమును నిరూపించి రక్షించి యనుగ్రహించెను.

భక్తవత్సలుండును, నివృత్తధర్మార్థకామ విషయుండును, రాగాది రహితుండును, కైవల్యదానసమర్థుండును, సర్వసముండును, సర్వసమర్థుండును, సకలభూత నిగ్రహానుగ్రహకరుండును, సర్వేశ్వరుండును నగు హరి దుష్టనిగ్రహమునకై యత్యంత భయంకరరూపమున నృసింహమూర్తియై సాక్షాత్కరించినప్పుడు సోఽహం భావము సిద్ధించిన వాడగుటచే ప్రహ్లాదుడు చలింపనివాడై నిశ్చలచిత్తముతో భగవంతుని స్తుతించి తన్నుగాపాడిన తీరున భక్తులను భీతినుండి గాపాడుటకై భువిపై వెలసి యనుగ్రహింప వలసినదని ప్రహ్లాదుడు ప్రార్థించుటచే శ్రీనృసింహమూర్తి భువిలో భక్తానుగ్రహ కారకుడై యర్చావతారరూపమున ప్రహ్లాదవరదుడై వెలసెను. ప్రహ్లాదుని ప్రార్థనచే కనకకశిపు సంహార సమయమునందుండిన భీకరరూపమును విడిచి శాంతస్వరూపియై యోగనరసింహుడై యర్చావతారరూపమున వెలసెనని ప్రతీతి. తదుపరి యోగనరసింహస్వామి యర్చావతారమున చాలచోట్ల వేంచేసి భక్తులకు సాక్షాత్కరించి వారిని ఆపదులనుండి గాపాడిన సందర్భము లనేకములు.

శ్రీ యోగనరసింహుని యాలయములు సాధారణముగా పర్వతాగ్రములందును, కొండగుహలలోను, వనములందును గానసగును. సింహాచలము, నరసింహులకొండ, చోళంగిపురమనబరగు, ఘటికాచలము పర్వతాగ్రమున నున్న యాలయమునకు, అహోబిలము, కంచిలోని హస్తిగిరియందు వేంచేసియుండు గుహానరసింహుని యాలయములు బిలములందలి యాలయమునకు పెంచలుకోన, కంచిలోని తూప్పులన బరగు తుంబవన ప్రాంతము అటవీ నరసింహాలయములకు ఉదాహరణములు. సత్యవ్రతక్షేత్ర మనబడు కాంచీపురమున తూప్పులను తుంబవనమున వెలసియున్న నరసింహమూర్తి యాలయము తిరువేళుక్కై యను దివ్యదేశముగ ప్రసిద్ధిజెంది యాళ్వార్లచే గీర్తింప బడియున్నది.

పూర్వము బ్రహ్మపై గోపించి వెడలిన సరస్వతి యా విరించి సత్యవ్రత క్షేత్రమున తన్ను బిలువకయే నెరవేర్పనెంచిన యాగమును

విధ్వంస మొనరించుటకై యనేకవిధముల యవరోధముల గల్పింప యత్నించినపుడు దయామయుడగు నారాయణుఁడు వానినన్నింటిని నివారించెను. సరస్వతి ప్రయోగించిన మాయానలమును తన కరమున బట్టిబంధించి యరికట్టి దీపంబుపోలె తన కరంబున ధరించుటచేత మాధవుడు దీపప్రకాశుడనబరగెను. భగ్న ప్రయత్నమైన భారతి కోపోద్దీపితయై కాపాలికాస్త్రమును ప్రయోగింప హరి నరహరిరూపమున నా కాపాలికాస్త్రమును హరించి బ్రహ్మయజ్ఞ నిర్వహణకైన భయమును బోగొట్టి యాగసంరక్షణమున సహాయపడి పిదప బ్రహ్మదేవుని కోరికపై భక్తజనభయాపహారియై యర్చావతారమున కంచిలోని తుంబవనమందు వెలసినట్లు ప్రతీతి. తదనంతరము భృగుమహర్షికి ప్రత్యక్షమైన యా విష్ణుమూర్తి దీపప్రకాశుని సన్నిధికి సమీపమున ముకుందనాయకుడను పేర వెలసినట్లును, వేళుక్కై యనబడు నీదివ్యదేశము నాళ్వార్లు మంగళాశాసనము జేసినట్లును చెప్పబడుచున్నది కనక విమానమున తూర్పు ముఖముతో నిల్చినచందమున వెలసిన ముకుందనాయకుని. సన్నిధిలోని యమ్మవారిపేరు వేళుక్కైపల్లి లేక ముకుందనాయకి, కాలప్రవాహమున నీదివ్యస్థలము ఖిలమగుటచే తత్సమీపంబుననే తదుపరి యొకయాలయ మమర్చి యందు ప్రహ్లాదవరదుడైన నరసింహమూర్తిని ప్రతిష్ఠించినట్లు ప్రతీతి. "అళ్-అరి" నరహరియని యాళ్వార్లచే మంగళాశాసనము జేయబడిన యీ యోగ నరసింహస్వామి యాలయము వేళుక్కై యన బరగు దివ్యక్షేత్రము శ్రీ కాంచీక్షేత్రమునందలి ప్రసిద్ధ దేవాలయము లోనిది యొకటి.

తమిళమున అళ్-నరుడు; అరి-హరి-సింహము అళరి-నరసింహుడు వేళ్-ప్రియముతో; యిరుక్కై ఉండు స్థలము నరసింహస్వామి ప్రియముతోవేంచేసియుండు దివ్యస్థలమని యర్థము. "క్షేత్రేసత్యవ్రతాఖ్యే కరిగిరి శిఖరాత్పశ్చిమే పుణ్యదేశే కామస్థానాభిధానే శ్రితదురితహరే హేమ

కోటీవిమానే కాంచ్యాం ప్రహ్లాద తీర్థే హారిదమృతలతా సేవ్యమానోఽస్మ దీశః శ్రీమాన్ యోగే నృసింహ స్స్వజయతు భగవాన్ వేగవత్యాస్తు తీరే" శ్రీ సత్యవ్రతక్షేత్రమను దివ్యస్థలమున శ్రీ హస్తిగిరి శిఖరము నకు పశ్చిమమున నుండు "తిరువేళుక్కై" యనబడు దివ్యదేశమున ఆశ్రితుల పాపములను బోగొట్టగల హేమకోటి విమానమందు ప్రహ్లాద తీరమున శ్రీ యమృతవల్లీ సమేతులైన "అళగియశింగర్" అనబరగు శ్రీయోగ నరసింహస్వామి శ్రీకాంచీనగరమున వేగవతీ తీరమున సర్వో త్కృష్టుడై వేంచేసియున్నాడని యీ నరసింహస్వామి పురాణపురుషుల చేత ప్రశంసింపబడియున్నాడు. తిరుమంగై యాళ్వారు, పేయాళ్వారు మంగళాశాసనము జేసియున్న యీ 'తిరువేళుక్కై' దివ్యదేశమున శ్రీ యోగనరసింహమూర్తి పశ్చిమాభిముఖుడై యోగముద్రతో వెలసి యున్నారు.

కాంచీపురమున నీదేవుడు వెలసియున్న తుంబవనపుగు తూప్పుల్ దివ్యదేశమున నవతరించిన శ్రీవైష్ణవాచార్యవరేణ్యుడగు శ్రీ నిగమాంతమహాదేశికులే నరసింగప్పెరుమాళ్ళను "కచ్చియదృుత కేసరి" యని తమ కామాసికాష్టకమున గీర్తించియున్నారు.

చిన్నకంచి యనబడు విష్ణుకంచిలో రంగస్వామి కొలనుకు సమీ పమున దీపప్రకాశుని గుడికి దాపున నెలకొనియున్న వేళుక్కై నరసింహ స్వామి యాలయమునకుముందు ప్రహ్లాద తీర్థమనబడు పుణ్య పుష్క రిణి గలదు. ఈ సన్నిధిలో వెలసియున్న యమ్మవారు "అమృతవల్లి తాయార్" అను పేర వరప్రసాదినియై విరాజిల్లుచున్నది. శ్రీవారి సన్నిధి కెదురుగా గరుడుని సన్నిధిగలదు. శ్రీవారి మూలవిగ్రహము నకు దిగువ నుభయమాతృకలతో వేంచేసియుండు ఉత్సవమూర్తి సుందర విగ్రహము శ్రీవారి సన్నిధినే వేంచేయబడియుండు నమ్మాళ్వారు,

పేయాళ్వారు, తిరుమంగైయాళ్వారు, ఉడయవర్లు, మణవాళమహామునుల విగ్రహములు వస్కోరియముపై యున్నవి.

కామితసౌభాగ్య ధనకనకవస్తు వాహనాద్యష్టైశ్వర్య దాయకుడై దయామయుడై కంచిలోని వేళుక్కైయను దివ్యదేశమున వెలసియున్న ప్రహ్లాదవరదుడగు శ్రీ నరసింహస్వామి ప్రభావము వర్ణనాతీతము. పూర్వజన్మములందు చేసిన పాపము అరణ్యమువలె పెరిగి భయంకరముగా నున్నను, తన యతులిత కరుణావిలాస ఖడ్గముచే దానిని ఛేదించి యనుగ్రహించినట్టి దయగల స్వామియై కంచిలోని వేళుక్కైయను దివ్యస్థలమున వెలసి భక్తజనుల భయమును బోగొట్టి యభయమొసగి రక్షించు మంగళప్రదుడైన శ్రీ నరసింహమూర్తిని సేవించి శరణుజొచ్చి స్తుతించుట శుభములుగల్గి సుఖముండుటకు సులభమైన **రాజమార్గము.**

—/—

# శ్రీ ముక్తీశ్వరుని మహిమాగరిమం

శరణాగతులకు శుభములఁగల్గ జేయుటచే శివుడు శంకరుడని స్తుతింపబడుచున్నాడు. శం - శుభమును కర - కల్గించువాడని శంకర శబ్దము సూచించుచున్నది. భక్తవరేణ్యుల ఘనత ప్రకటితమై ప్రఖ్యాతి జెంది శుభముగల్గునట్లు శంకరుడైన పరమేశ్వరునిచే ప్రదర్శితమైన లీలావినోదములు పురాణ ప్రసిద్ధములు. పరమశివుని లీలావినోదములను వివరించు సంకలనము తమిళమున తిరువిళైయాడల్ పురాణమను పేర ప్రసిద్ధమై యున్నది. పరమశివుని లీలలను వర్ణించుటతోబాటు శివభక్తుల భక్తి వైశిష్ట్యమును వెలువరించు విధమున రచింపబడి యున్న తిరువిళైయాడల్ పురాణమందలి నాయన్మార్లనబరగు శివభక్త వరేణ్యుల చరిత్రము, వారి భక్తి తత్పరత, వారి భక్తిని బరీక్షించు చందమున పరమేశ్వరుడు ప్రదర్శించిన లీలావినోదముల వివరణము పరిశోధితులై ప్రకటిత ప్రతిభావంతులై పొగడ్తనుబొందిన శివభక్త శిఖామణులగు నరువది మువ్వురు నాయన్మార్ల దివ్యచరిత్రము ప్రశంసింపబడి ప్రజలలో పరమేశ్వరభక్తి పెంపొందుటకు ప్రయోజనమై ప్రఖ్యాతిగాంచి యున్నది.

అట్టివానిలో కాంచీపురమున వసించి తిరుక్కురిప్పు తొండరన బరగిన శివభక్తుడైన చాకలివాని పరోపకారతాత్పర్య వివేక గరిష్టతను జగమెఱుగజేసిన పరమశివుని లీలావినోదము సుప్రసిద్ధము.

సత్యవ్రత క్షేత్రమగు కాంచీపురమున శివభక్తవరేణ్యుడగు చాకలి యొకడు వసించుచుండెను. శివదీక్షాపరులెవరైన గనుపించిన వారి యభిమతము నరసి తదనుగుణముగా సేవజేయుటను వ్రతముగా గల్గి

యుండినందున నతడు తిరుక్కురిప్పుతొండర్ సాధుజన దాసుడని; దాస దాసుడని సార్థకనామధేయములతో నొప్పారుచుండెను. సద్గుణసంపన్నుడును, శివభక్తి తత్పరుడును, శివభక్తకైంకర్య పరుడునునైన సాధుజనదాసుడు శివభక్తుల వస్త్రములు సుచితముగ నుదికి మైలదీసి శుభ్రపఱచి యిచ్చి వారికి సేవజేయుట యందాత్మతృప్తి నొందెడివాడు.

ఇట్లుండ నొకనాడు చలికాలమున శరీరమంతయు విభూతి నలంకరించుకొని ధవళకాంతితోఁ బ్రకాశించు శివదీక్షాపరుడగు ముదుసలియొకడు కంచికరుగెంచెను. ఆ పండుముసలి కంతలుగల్గిన పాత మలిన వస్త్రమును ధరించి యుండుటగాంచిన తిరుక్కురిప్పుతొండర్ ఆతనిని సమీపించి నమస్కరించి యుపచరించి యతని మలిన వస్త్రమును శుభ్రపఱచియిచ్చు భాగ్యమును తనకు కల్గజేయుమని ప్రార్థించెను. చలికి గప్పుకొనుటకు వేరు వస్త్రము లేకుండుటెటిగించి సాయం సమయమునకు ముందుగా నుతికి యివ్వగల పక్షమున తన వస్త్రము నుతుకుటకు నియ్యనంగీకరించి దానిని దాసదాసున కొప్పగించి జనెను.

సాధుపుంగవుని మలిన వస్త్రము మిగుల జీర్ణించి యుండుటచే నత్యంత జాగరూకుడై హెచ్చరికతో చవుటమన్నున మురికిదీసి వెళ్ళాయి వేసి నిదానముగా నుతికి శుభ్రపఱచి తడియారబెట్టు నంతలో యాకసమున కారుమబ్బులునిండి కుండపోతగ వర్షింపసాగెను. అకాలమున నున్నట్లుండి కుంభవర్షము గురియుటచే భ్రమించి కంపించి గత్యంతరము లేక వాననిల్చు తరుణమునకై వేచి గగనమునే గమనించి చింతాక్రాంతుడై నిల్చియుండెను. సంధ్యాకాలమైనంతనే మబ్బుల గప్పబడిన సూర్యుడస్తమించెను. వర్షముబలిసి యెడదెరపిలేక గురియుచుండెను. ఆరబెట్టిన వస్త్రము వానకు తడియుచుండెను. సాధుపుంగవు డరుదెంచు సమయమాసన్న మగుటచే చెప్పినమాట చొప్పున నతనికి తడియారిన

వస్త్రము నివ్వలేమికి జాలచింతించి తన వ్రతభంగమునకు మిగుల వగచి మాటజెల్లింపలేని మనుగడ మర్యాదగాదని తలపోసి వయోధికుడైన సాధుపుంగవుడు మరలి వచ్చులోపల ప్రాణత్యాగ మొనరింప నిశ్చయించు కొని గట్టున నున్న గుడ్డలుతుకు రాతిబండపై తన తలను బద్దలు గొట్టుకొన నియుక్తుడైన తిరుక్కురిప్పుతొండర్లవారి నడ్డగించి వారించి సాక్షాత్కరించిన చంద్రకళాధరుడాచాకలిభక్తుని సాహసచర్యను విరమింప జేసి రక్షించి యనుగ్రహించెను. చాకలికి ప్రత్యక్షమైన దయామయుడగు శంకరుడు వస్త్రమును శుభ్రపఱచుటకు ఇచ్చివెళ్ళిన సాధువుతానే యని తెలియజెప్పి, తానతనిని పరీక్షించుటకై చేసిన పన్నుగడను వివరించి కృపజూపి యనుగ్రహించిన యద్భుతసంభవము పరమశివుని భక్తసౌల భ్యమును నిరూపించుటతోబాటు శివభక్తుడైన తిరుక్కురిప్పుతొండర్లవారి సాధుజన కైంకర్య తత్పరత ప్రకటితమై యతని ఘనత జగత్ప్రసిద్ధి జెందెను.

పరమేశ్వరానుగ్రహముచే శివభక్త కైంకర్య వ్రతానురక్తుడైన సాధుజనదాసుడు తిరుక్కురిప్పుతొండనాయరని ప్రసిద్ధిజెంది పరమ శివభక్తుడై బహుకాలము వర్ధిల్లి పిదప ఈశ్వరసాయుజ్యమునొంది ముక్తి జెందిన పుణ్యస్థలము కంచిలోని ముక్తీశ్వరాలయము. ఈపవిత్ర దేవాల యమున ప్రధానమగు ముక్తీశ్వరుని సన్నిధిగాక యందు వెలసియున్న గరుడేశ్వరుని సన్నిధి పురాణ ప్రసిద్ధిజెందినది.

ముక్తీశ్వరాలయమునకు తూర్పున ప్రభుత్వ వైద్యశాలకు ఎదురు గానున్న తిరుక్కాలిమిట్టయను పుణ్యస్థలమున "కచ్చితిరునెరిక్కారై క్కాడము" ప్రసిద్ధ శివాలయముగలదు. ఈ శివుని బూజించి యింద్రుడు

బహుదు ఘనత జెందిరని పురాణములందు ప్రశంసింపబడియున్నది. సత్యనాథేశుడనబరగు నీ యీశ్వరుని జ్ఞానసంబంధులవారు స్తుతించి కీర్తించిపాడి యుండుట యీ స్థలపు మహాత్మ్యమును దెలుపుచున్నది.

కాంచీపురమున యడిసన్‌పేట యందలి గాంధివీథిలో నున్న "జవళిక్కడై సత్రము" అనబడు పట్టు వ్యాపారస్థుల సంఘపు సత్రమునకు సమీపమున వెలసియున్న ముక్తీశ్వరుని దర్శించి తిరుక్కురిప్పు తొండనాయనార్ల కైంకర్య విశేషమును జింతించుటచే సాధుజన సేవాభిలాషపెంపొంది తద్వారా దుస్సంగతి నశించి సత్సంగతి సంప్రాప్తమై సంతోషానందములు సిద్ధించి సుఖముండుట సత్యము.

——:o:——

# కలికల్మషహరుడుం కచ్ఛపేశ్వరుడుం

అణకువ అమరపూజ్యతను గల్గించునట్లు, అహంకారముపతనము నకు హేతువగుననుటకు దేవేంద్రుడు తన గర్వకారణమున నైశ్వర్యము నంతయు గోల్పోయి తిరుగ బొందుటకై బడిన క్షీరసాగరమథన ప్రయత్న ప్రయాసము నిదర్శనము. పూర్వము దేవేంద్రుడు జంభాసురుడను రాక్షసుని నిగ్రహించి విజయోత్సాహమున నైరావతము నెక్కి యమరావతి కేతెంచు మార్గమున దుర్వాసమహాముని యెదురై యాశీర్వదించి గంధర్వకన్య యొకతె తనకు భక్తితో సమర్పించిన సుగంధపుష్పమాలికను అమరేంద్రునకు బహూకరించెను. సాధారణముగ ఇంద్రుడసురులకోడి రక్షణార్థము త్రిమూర్తులనాశ్రయించుట యలవాటు. ఎన్నడులేని విధమున నపురూపముగ నొక యసురుని జంపుటంజేసి పరమదరిద్రునకైశ్వర్యము గల్గినపుడర్ధరాత్రమున గొడుగును బట్టుమని నట్లు విజయగర్వమున ఇంద్రుడు మదాంధుడై మునిశ్రేష్ఠుడగు దుర్వాసునికినమస్కరింపక యుదాసీనపఱచి మునిపుంగడవుడాశీర్వదించి ఇచ్చిన పుష్పమాలికను తానధిరోహించిన యైరావతయను ఏనుగు కుంభస్థలము పై నిర్లక్ష్యముగ బడవైచెను. ఆ మాలికయందలి సుగంధ పుష్పమకరంద మాధుర్యమున దేలుచుండిన మధుపములు కరి కుంభస్థల తాడవమున జెదిరి ఝుంకార మొనరించి కుట్టసాగెను. భ్రమర పరివారసందష్టమై సంకటంబును సయిరింపలేక గజమా పుష్పమాలికను తన తొండముతో నెత్తి నేలపైగొట్టి పాదంబున సలిపి ఛిన్నాభిన్న మొనరించి భంగ పఱచెను. ఇట్లవమానితుడైన దుర్వాసుడు కోపించి విజయగర్వమున కన్నుగానక తన్నవమానించిన యమరేంద్రునివీడి యష్టైశ్వర్యములు అంబుధినిబడునట్లు శపించెను.

దుర్వాసుని శాపమువలన దేవేంద్రుని యైశ్వర్యమంతయు కరి భ్రమింగిన వెలగపండువలె మాయమయ్యెను. కల్పవృక్షము, కామధేనువు, ఉచ్చైశ్శ్రవమను తురగరాజము, ఐరావతము, రంభాద్యప్సరసలు, కౌస్తుభాది మణిరాసులు ధనకనకవస్తు వాహనాద్యైశ్వర్యము లన్నియు పాలసముద్రమున బడెను. ఐశ్వర్యము లేమిచే దేవేంద్రుని ప్రతిభ క్షీణింపసాగెను. "మనుపీనుగు నిర్ధనుండు మదిబరికింపన్", డబ్బు లేనివాని బ్రతుకు దండుగయును లోకోక్తులు సత్యము. అమ రాధిపుడు దర్పము దరిగి దుఃఖితుండయ్యెను. ఐశ్వర్యమునంతయు గోల్పోయినయింద్రుడు తన్నుగాపాడుమని సర్వశక్తుడును సర్వేశ్వరుడు నగు శ్రీమన్నారాయణు నాశ్రయించెను.

జీవరాసులు తప్పిద మొనరించినను పిదప తమ తప్పిదమును గుర్తించి పశ్చాత్తాపమునొంది పరిశుద్ధతజెంది పరిపక్వమునొంది తన్నా శ్రయించునపుడు పరమాత్మ స్వాభావికమైన వాత్సల్యముచే వాని నాద రించి మన్నించి యాశ్రయమిచ్చి కరుణించి ప్రేమించి వాని స్థితినిబెంచి యుజ్జీవింపజేయుననుట కనుగుణముగా పశ్చాత్తప్తుడై యహంకారమును వీడి దీనుడై తన్నాశ్రయించిన దేవేంద్రుని దయజూచి, యతడు గోల్పోయిన ఐశ్వర్యములను మరల బొందుటకు క్షీరాబ్ధిని మధింప వలసినదిగ భగవన్నారాయణు డాదేశించెను.

క్షీరసాగరము పాలకడవగా, మందరపర్వతము చిలుకుడుకొయ్యగా వాసుకి యను సర్పరాజము త్రాడుగా, దేవాసురులిరు ప్రక్కల నిల్చి పాలసముద్రమును జిలుకసాగిరి. మందరపర్వతము భారముచే సము ద్రమున మునుగకుండునట్లు గాపాడుటకై క్షీరసాగరమధన కాలంబున కమఠాకృతిని మందరాచలంబును దనకర్పరంబున నేర్పరియైనిల్చి నారాయణుడు సహాయపడెను. అట్లగుటంజేసి క్షీరసాగర మధన కార్యము సులభమయ్యెను. అయినను వెలగపండులోని పురుగువలె మేరుపర్వతమునకు కవ్వపుత్రాటివలె జుట్టబడియుండిన వాసుకి శరీరము

పర్వతముతో రుద్దుడువడి తపించి బాధకోర్వలేకుండగా, భయంకరమైన హాలాహల విషము వెలువడెను. తీక్షణమైన హాలాహలవిషజ్వాలలచే పీడితమైన యాదికమఠము నల్లబడి తాపోపశమనమునకై యిటునటు కదలుటచే సముద్రము కల్లోలితమై యందు జీవించియుండిన ప్రాణులకు సంకటంబగుట గుర్తించి వాసింగాచుటతోబాటు హాలాహల జ్వాలలచే లోకంబులు దహింపబడకుండ రక్షించుటకై శుభంకరుడగు శంకరుడా హాలాహల విషమును తన హస్తకమలమున గ్రహించి గుళికవలె మ్రింగినంత సర్వలోకాత్మకుడైన పశుపతి విశ్వగర్భడగుటంజేసి ఈశ్వరుని కుక్షిలోనున్న ప్రాణులు విషగ్రస్తము గాకుండ గాపాడు నిమిత్తము శంకరి శంకరుని కంఠసీమను తన కరంబుల నొక్కిపట్టుటచే విషము శివుని కంఠమునందే నిల్చి యాభరణమువలె నొప్పారెను. కాలకూట విషము శివుని కంఠమునందు నిల్చి యింద్రనీలచ్ఛాయ ప్రకాశించుటచే పరమశివుడు నీలకంఠుడయ్యెను. అంత హాలాహలము బుట్టుటచే నయిన బీభత్సముడిగి ప్రశాంతత నెలకొని పాలసముద్రము నుండి దేవేంద్రుడు బోగొట్టుకొనిన యైశ్వర్యములన్నియు మరల సంప్రాప్తించెను. ఆ సమయమున క్షీరాబ్ధినుండి శీతలకిరణుడైన చంద్రుడు, చంద్రసహోదరియగు లక్ష్మియు నుదయించిరి.

దేవకార్యార్థము కచ్ఛపరూపమున సముద్రపుటడుగున నుండి మందరపర్వతమును తన కర్పరంబున భరించి శ్రమకునహించి పరమోపకార మొనర్చిన పూజ్యుడగు నారాయణునికి క్షీరసాగర తనయయగు లక్ష్మిని పత్నిగజేసి తత్సందర్భమునకుచితమౌరీతి లాంఛనముగా కౌస్తుభమణిని కానుకగ సమర్పించి గౌరవించి ధన్యులైరి. కూర్మావతారముననుండి తానొసరించిన యుపకారమునకు తగినరీతిని దేవతలు సత్కరించినందులకు సంతసించిన శ్రీమన్నారాయణుడు తాను సముద్ర పుటడుగున నున్నప్పుడు విషజ్వాలల తాకిడికి తట్టుకొను ప్రయత్నమున

సముద్రమును గలంచుటచే సందలి ప్రాణులకు క్లేశము గల్గినతీరును, వానినపుడు దయామయుడగు శంకరుడు సంరక్షించిన విధమును జింతించి తనచే ప్రాణులకు కష్టము గల్గినందులకు మిగులవగచి ప్రాయశ్చిత్త మొనరించుకొను సంకల్పముతో పరిహారము నెఱిగించి యనుగ్రహింపు మని ప్రార్థించిన పరంధాముని సత్యవ్రతక్షేత్రమగు కాంచీపురమున తన్నారాధించి తరింపుమని పరమేశ్వరుడాదేశించెను. కాంచీక్షేత్రమున విష్ణుమూర్తిచే నారాధింపబడిన మహేశ్వరుడే కచ్ఛపేశ్వరుడు. కచ్ఛపము — కూర్మము; ఈశ్వరుడు — రక్షకుడగుటంజేసి నాయకుడు— కచ్ఛపరూపుడైన నారాయణుని కరుణించిన యీశ్వరుడని సంకేతము. విష్ణ్వంశముతో నొప్పు కచ్ఛపము శివలింగము నారాధించు చందమున రాగిరేకుపై జెక్కింపబడిన శిల్పము కచ్ఛపేశ్వరుని యాలయమున నొప్పారుట జూడనగును. ఈ కచ్ఛపేశుని బూజించి మాధవుడు మన్మథుని తనయునిగబడయు భాగ్యమును బొందినట్లు ప్రతీతి.

మూడు ప్రాకారములతో ఉత్తరాభిముఖమైన గోపురముతో నొప్పు కచ్ఛపేశుని యాలయమును బ్రవేశించినంతనే మహిమాన్వితమైన యిష్టసిద్ధి తీర్థము గలదు. ఈ పుష్కరిణిలో నాల్గువైపుల తీర్థమాడిన నాల్గువిధములైన ఫలితములు గల్గునని ప్రతీతి. చతుర్విధ పురుషార్థ ములను గల్గజేయు నీ యిష్టసిద్ధితీర్థమున భానువారమున స్నానమొనర్చు వారికి కచ్ఛపేశ్వరుని యనుగ్రహ బలమువలన రోగనివారణ మేర్పడి దీర్ఘాయువు గల్గునని యైతిహ్యము.

శ్రేష్ఠమైన శిల్పకళా నైపుణ్యముతో నలరారు కచ్ఛపేశ్వరుని యాలయమున జంబుకేశ్వరుడు, అరుణాచలేశ్వరుడు, కాళహస్తీశ్వరుడు

చిదంబరేశ్వరుడు, పొల్లాపిళ్ళయారనబడు వినాయకుడు, కుమారస్వామి, బ్రహ్మదేవుడు, అష్టభుజ సరస్వతి, చతుర్ముఖేశ్వరుడు, సత్యగణపతి విష్ణుమూర్తి, దుర్గ మున్నగు దైవముల సన్నిధులమరి యున్నవి. శివకంచియనబడు పెద్దకంచిలో నున్న కచ్ఛపేశ్వరుని దేవాలయమును పల్లవరాజులు, విజయనగరరాజులు అభివృద్ధిపఱచి, యనేక కైంకర్యము లొనరించిననుట కాధారముగా ననేక శిలాశాసనములీ యాలయమున గన్పడుచున్నవి. కార్తీక మాసపు టాదివారములలో భక్తులు కచ్ఛపేశుని దర్శించి కృతార్థులగుచున్నారు. కంచిలోని కచ్ఛపేశుని గొలుచుటచే కష్టములు దీరి కోరిక లీడేరి భక్తులకు శుభము గలుగును.

—/—

# ధరణీశుడాశ్రయించిన దాసవరేణ్యుడు

## (శ్రీ కైలాసనాధుని దేవాలయము)

శ్రీవర్ధిల్లు తుండీరమండలమున నేలిన "కాడవర్‌కోన్" అనబడు కాటమ భూపతి పరమశివభక్తుడై నిరంతర శివపూజానురక్తుడై కాంచీపురమును రాజధానిగా జేసికొని ధర్మమార్గమున రాజ్యపాలనమొనరించుచుండెను. శంకరుని యనుగ్రహమున దేశము సుభిక్షితమై ధనధాన్య సమృద్ధితో తులతూగుచుండెను. గంగాధరుని కరుణయే తన ఘనతకు కారణమని విశ్వసించిన ధరణీనాధుడు కైలాసనాధునికి కంచిలో నొక యాలయమును నిర్మింపనెంచి నిపుణులైన శిల్పులను రప్పించి కళానైపుణ్య సంశోభితమగు రమణీయమైన యాలయమును గట్టించెను. శోభాయమానమైన కైలాసనాధుని యాలయమునకు కుంభాభిషేకము జరిపించుటకై దైవజ్ఞులచే ముహూర్తమును నిశ్చయింపజేసి కుంభాభిషేకమతివైభవముగ జరుగుటకై ప్రత్యేకములైన యేర్పాట్లు కొనసాగించెను.

ఆదే సమయమున తుండీర మండల మందలి మరొక పుణ్యస్థలమగు తిన్ననూరనబడు తిరువింద్రవూరిలో 'పూసలార్' అను పరమశివభక్తుడు పరమశివున కచ్చోటనొక యాలయమును నిర్మింప సంకల్పించి దానికైన ద్రవ్యమును సమకూర్చుటకై యనేక ప్రయాసములబడియు ప్రయోజనము లేక తిరిగి తిరిగి వేసారి వ్యర్థప్రయత్నుడై తుదకు ఆత్మభవుడైన భవునకు తన మనఃఫలకముననే దేవాలయ నిర్మాణకార్యమును జింతించి గోపురప్రాకారాదులచేనొప్పు నాలయమును నిర్మించి నట్లూహించి తన యూహాకల్పితమైన యాలయమునకు కుంభాభిషేకము జేయ

నెంచుకొని దానికై న శుభముహూర్తమును తన మనమున నిశ్చయించు కొనెను. పూసలారు నిర్ణయించుకొనిన ముహూర్తము, కాంచిభూపతి కైలాసనాధుని యాలయకుంభాభిషేకమునకై నిర్ణయింపజేసిన ముహూర్తము ఒకేదినముగ సంభవించునట్లయ్యెను.

పరమభక్తుడగు పూసలార్ల ప్రతిభ ప్రపంచమెఱుగునట్లొనరింప నెంచిన పరమేశ్వరుడు కాంచిభూపతి కలలో గన్పడి తాను పూసలారు జరిపింపనెంచియున్న కుంభాభిషేకమును గటాక్షింప సంకల్పించి యుండుటచే కంచిలోని యాలయ కుంభాభిషేక ముహూర్తమును మరొక దినమునకు మార్చవలసినదిగ ఆదేశించెను. దానుకు గట్టిన గుడికి దేవుడొసగిన ముఖ్యత్వమున కాశ్చర్యపడిన భూపతి భ్రమించి తాను నిర్మించిన కైలాసనాధుని యాలయ కుంభాభిషేక ముహూర్తమును మార్పించుట కాజ్ఞాపించి తాను పూసలార్లు చేయు కుంభాభిషేకమును సందర్శింపవలెనను నాకాంక్షచే సపరివారముగా తిరునిండ్రవూరునకే తెంచెను. కాని యా స్థలమున ఉత్సవకోలాహలమేమియు గానరాకుండుటచే నాశ్చర్యపడి మహేశునిమాట బొల్లుబోదను అచంచలవిశ్వాసము గలవాడగుటచే విచారించిజూతుమని చుట్టుప్రక్కల విచారించినపుడచ్చో వసించువారు పూసలార్ల గృహమును చూపించి యతడు చిత్తస్వాధీనములేని వాడనియు, చిత్తభ్రమచే తానొక యాలయమును నిర్మించి నట్లూహించి దానికి కుంభాభిషేకము జేయనున్నట్లు పిచ్చివానివలె వదరుచున్నాడనియు తెలిపి యతని దీనస్థితికి పరితాపమునొందియు, పరిహాసమొనర్చి బలికిన జనవాక్యమున కచ్చెరువొందిన కాంచిభూపతి ప్రాజ్ఞుడగుటచే పూసలారు భక్తితత్పరచే బొందిన సోఽహం భావసిద్ధిని గ్రహించి యతిశయించి వారిని దర్శించి సదాశివుడు తనకు స్వప్నమున సాక్షాత్కరించిన వృత్తాంతము నెఱిగించి పూసలార్ల ఘనతను గొనియాడెను.

దాసానుదాసుడై యకించనుడైన తనయందపార దయతో కరుణించిన మహేశుని యాశ్రితవాత్సల్యమున కచ్చెరువొంది, సంభ్రమించి

సంతసంబున పులకాంకితుడై మైమఱచి బాష్పపూరితనేత్రుడై భూమిపై బడి దండప్రణామంబులాచరించి యానందకందళిత హృదయుడై దాసిసి మహేశుని మహిమాగరిమను గుర్తించుటతోబాటు తన్నొనొకమసిషిగ నెంచి జాడవచ్చిన ఘనుడగు ధరణీశుని దయార్ద్ర హృదయమునకు చకితుడయ్యెను.

పూసలార్లను విషయమడిగి వారొక శివాలయమును నిర్మింప నెంచినదియు, దానికైన ధనము సేకరింపలేక, బీదవాడగుటంజేసి తన యూహనెఱవేఱు నుపాయము గానక తన మనఃఫలకముననే యాలయ మును నిర్మించి నట్లూహించి తన హృదయాంతర్గత భావనాకల్పితమైన యాలయమునకు కుంభాభిషేకమును కల్పించి తన్మయత్వముచే నానం దించుచుండిన పూసలార్ల యతీతభక్తికి భ్రమించిన కాంచీపురాధీశుడు పూసలార్ల భావనాకల్పనమునకు స్వరూపమునొందించి వారియభీష్టమును నెరవేర్చుటయే భక్తవశంకరుడు తనకాదేశించ కర్తవ్యమని విశ్వసించి యారీతి నచట నొక యాలయమును నిర్మించియిచ్చు కైంకర్యభాగ్య మును తన కనుగ్రహించి కరుణించునట్లు ధరణీశుడు దాసవరేణ్యు నాశ్ర యించి ప్రార్థించెను. ధర్మచింతనతో ధరణీశుడాడిన చెవులకింపైన మాటలకు దాసవరేణ్యుడగు పూసలారు సంతసించెను. కైంకర్యపరు డైన కాంచిభూపతి పరమ భక్తుడైన పూసలారు వసించిన తిన్ననూరిలో శిల్పకళానైపుణ్యముతో నొప్పు శివాలయమును నిర్మింపజేసి కుంభాభిషేక మును ముందుండి జఱిపించి పిదప కంచిలో తనచే నంతకుముందుగా నిర్మింపఁబడిన కైలాసనాధునియాలయ కుంభాభిషేకము జేయించినట్లు ప్రతీతి.

కాంచీనగర పశ్చిమభాగమున పల్లవరాజులచే నిర్మితమైయున్న కైలాసనాధుని యాలయము మిగుల ప్రాచీనమైనది. ఇసుక రాతితో గట్టబడిన యీ యాలయమందలి మూలస్థానముననున్న ప్రధాన శివలిం

గము పదహారు పట్టలు గలిగిన లింగరూపమున విరాజిల్లుచుండుట ఇచటి ప్రత్యేకత. ఈ కైలాసనాధుని యాలయమున నారదునిచే బూజింప బడిన లింగముగూడా గలదు. కైలాసనాధాలయ గర్భగృహమందును, అర్ధమంటపము దానిని జుట్టియున్న ప్రదక్షిణ ప్రాకారమందును, వెలుపలి ప్రాకారమున నున్నగదులలోను భిక్షాటనుడు, గంగాధరుడు, త్రిపురాంతకుడు, సోమస్కందమూర్తి, నారాయణుడు, దుర్గ మొదలగు దైవ బింబములత్యంత రమణీయముగ జెక్కింపబడి దర్శనీయమైయున్నవి. క్షీరసాగరమధనమును జిత్రించు శిల్పము, కాలసంహారమూర్తి, దక్షిణామూర్తి శిల్పములు, పరాశక్తి చిత్తరవులనేకములు శిల్పకళా నైపుణ్యముట్టిపడునట్లుండి యాకర్షనీయములై కన్నుల పండుగ'జేయుచున్నవి. ఈ యాలయ గర్భ గృహము నంటియున్న గదిగోడలపై శివతాండవ దృశ్యమతిసుందరముగా జిత్రింపబడియున్నది.

కైలాసనాధుని యాలయ గర్భగృహ ప్రదక్షిణ మార్గము బిల మార్గములవలెనుండి ప్రవేశ, నిష్క్రమణ ద్వారములు చాలయిరుకై యుండి నేలపై బ్రాకుచు లోనికిజని, తిరుగ'బ్రాకుచు వెలువడవలసి యుండుటచే యీ యిరుకైన వాకిళ్ళ ద్వారా ప్రదక్షిణముగా వచ్చుట పునర్జన్మ మెత్తినట్లు తోచును స్వర్గప్రదక్షిణమనబడు నీ గర్భగృహ ప్రదక్షిణముచే జననమరణ వలయములనుండి విడివడి జన్మరాహిత్యము గల్గునని యైతిహ్యము. ఈ యాలమున మహాశివరాత్ర్యుత్సవమత్యంత వైభవముగ జఱుపబడుచున్నది.

కైలాసనాధుని యాలయమునకు వెళ్ళు మార్గమున యెడమ వైపున వినాయకునిచే బూజించబడిన "అనేకదంకావతం" అను దివ్య స్థలము గలదు. ఈ ప్రసిద్ధ శివాలయము వెలసియున్న "అనేకపేశ్వరు"ని నుతప్రచారకులన ప్రశస్తినొందిన నల్వురిలో నొకరగు శ్రీ సుందరమూర్తిస్వాముల వారొక దశకమును పాడి పొగడి నుతించి

యున్నారు. ఈ "అనేకపేశ్వరుని" యనుగ్రహమున నింద్రుడు వృత్రాసురుని సంహరించు శక్తిని బొందెనని ప్రతీతి.

కైలాసనాథాలయమునకు దక్షిణముననున్న పిళ్ళయార్‌పాలెమను ప్రదేశమున తిరుమేత్రళియను పుణ్యస్థలము గలదు. ఈ పుణ్య స్థలమున తిరుమేత్రళినాథుడను పేర పరమశివుడు వెలసియున్నాడు. విష్ణు వినుతుడై వెలసియున్న తిరుమేత్రళినాదుని సమయాచార్యులు నలుగురిలో ముువ్వురు కీర్తించి పాడియున్నారు.

కైలాసనాథుని యాలయము రమణీయమైన శిల్పములతోను, సుందర చిత్రములతోను నిండి శిల్పశాస్త్రపారంగతులై యుండిన మన పూర్వుల ప్రతిభను ప్రదర్శించు శిల్ప కళామందిరమువలె శోభిల్లుచు ప్రపంచమందలి పలుప్రాంతములనుండి యాత్రికుల నాకర్షించుచున్నది. ఈ యాలయము కేంద్రప్రభుత్వ పురాతనవస్తు సంరక్షణ శాఖవారి రక్షణలో నుండి తమిళ దేశపు హిందూ ఆలయ ధర్మ సంస్థాపన శాఖవారిచే నిర్వహింపబడుచున్నది

తుండీరమండలాధీశుడైన కాంచీపురాధీశునిచే పరమభక్తుడైన పూసలార్ల భక్తి తత్పరతను గుర్తించు నట్లొనర్చి, భక్తిని ఘనతను భువిలోఁబ్రఖ్యాతి జెందునట్లనుగ్రహించిన పరమశివుని ప్రతిభను ప్రకటించునట్లు కంచిలో వెలసియున్న కరుణామూర్తియగు కైలాసనాథుని గొల్చుట కోరికలీడేరి కడతేరుట కతినులువైన ఖచ్చితమైన మార్గము.

——:o:——

# పురాణము పుట్టిన పుణ్యస్థలము

(కుమరకోష్ఠమునందు శ్రీ కుమారస్వామి ఆలయము)

జగత్తునందలి జీవరాసులు, అవి పరమాత్మ ప్రతిబింబములని గ్రహించునపుడు నిజమైన జ్ఞానమేర్పడుచున్నది. ఈ సత్యమును దెలిసికొనుట జన్మమెత్తినందులకు ప్రయోజనమని చింతించుట జ్ఞాన సముపార్జన ప్రయత్నమునకైన ప్రారంభము, నిత్యసత్యము నెఱుగుటయే బ్రహ్మజ్ఞానము సంప్రాప్తించుట లేక జీవన్ముక్తుల స్థితిని బొందుటయనియు, నిత్యసుఖమును బొందుటయనియు, బ్రహ్మానందము నందుటయనియు నెంచబడుచున్నది.

ప్రకృతిలోని ప్రాణులెల్ల సుఖమునే గోరుట సహజము. కాని వానివాని పుణ్యపరిపాకము ననుసరించి సుఖదుఃఖములు సంప్రాప్తించుచున్నవి. ఆహార నిద్రాభయములు, సుఖదుఃఖములు ప్రాణులన్నిటికి సమానము. వానిలో మానవుడు మాత్రము బుద్ధిని భగవదనుగ్రహమున బొందియుండుటచే సుఖదుఃఖములను బొంది తన బుద్ధ్యనుసారము ప్రయత్నించి తదుచితమైన ఫలాఫలమును బొందుచున్నాడు. సత్వగుణాధికమైన బుద్ధిసద్బుద్ధియనియు, సత్వగుణము తఱిగియున్న బుద్ధి దుర్బుద్ధియనియు పరిగణింపబడుచున్నవి. బుద్ధి బలము సాధనము లేక ప్రయత్నము వలన నభివృద్ధిజెంది యందుచే నధిక ఫలమును బొందుటకు లేక యపేక్షితమైన ఫలమును శీఘ్రముగా బొందుటకు యుపాయమగుచున్నది. సమృద్ధిని వృద్ధి జేసినపుడు మోక్షసాధనముగను, ఉపేక్షించినపుడు దుఃఖభాజనముగను నగుచున్నది.

సుఖమునే గోరి దానికై యన్ని విధములఁ బ్రయత్నించుట మనుష్య స్వభావము. సుఖాభిలాష చిత్తమునకు సైజము. "సుఖంమే భూయత్; దుఃఖంమేమాభూత్" — "నాకుసుఖమే గల్గుగాక; దుఃఖము గల్గకుండుగాక" యనునది ప్రతివారి యభిలాష. ఈ సుఖము నిత్యము అనిత్యమని రెండు తెఱగులుగ మనపెద్దలు విభజించియున్నారు. సాధారణముగాఁ గోరబడునట్టి శరీరోపయోగమైన ధన ద్రవ్య ప్రాప్తి యనిత్య సుఖము. ఉత్తరక్షణమందు దుఃఖప్రదమగుటచే నది యనిత్యము. ధన ద్రవ్య వ్యయము వలన కాయక్లేశము, దానిచే మనఃక్లేశము సిద్ధమగుటచే దుఃఖప్రదమగుచున్నదని భావము. రెండవది నిత్య సుఖము. అది జీవన్ముక్తియనియు, బ్రహ్మజ్ఞానమనియు, స్వస్వరూప జ్ఞానమనియు, మోక్షమనియు సంజ్ఞలు గలిగియున్నది. స్వస్వరూప జ్ఞానమును బొందుటకు ముముక్షుత్వమును బొందుటయనియు. మోక్షము గల్గుట యనియు పెద్దలందురు.

శరీర సౌఖ్యాపేక్షయు, బ్రహ్మానందాపేక్షయు బుద్ధ్యనుసారమే సంప్రాప్తించుచున్నదని పెద్దల యభిప్రాయము. బుద్ధిబలము ననుసరించి మానవులు పామరులు, పండితులు, బ్రహ్మవేత్తలని మూడు తెఱగుల బరిగణింపబడుచున్నారు. ప్రపంచ జ్ఞానము మాత్రము— అనగా శరీరమే తానను నభిప్రాయముతో శరీరోపయోగమునకు ప్రకృతి నెట్లు ప్రయోజన పరచుకొన వచ్చునన ప్రయత్నమున నిమగ్నులై యుండువారు పామరులు. జీవత్వము నంగీకరించి పూర్వోత్తరజన్మలు; స్వర్గనరకములందు నమ్మకముంచి విధినిషేధముల ననుసరించి ధర్మాచింతాపరులైనవారు పండితులు. ప్రాపంచిక శరీరాదులు మాయాకల్పితములని యెఱిగి నామరూపముల నుపేక్షించి వాని యందున్న సత్తును చిన్మయముగా భావించి, సర్వమును చిన్మయముగ నెంచగల స్వభావముతో జ్ఞానపరులై సోఽహం భావముతో చిదానంద స్వరూపులై, స్వేచ్ఛాపరులై, సకలముఁ దెలిసినవారై సర్వమును బ్రహ్మమయముగా

స్వేచ్ఛాపరులై, సకలముఁ దెలిసినవారై సర్వమును బ్రహ్మమయముగా గుర్తింపగల పరిపక్వదశను బొందినవారు బ్రహ్మజ్ఞానులనియు, జీవన్ముక్తులనియు పరిగణింపబడు చున్నాడు.

బ్రహ్మజ్ఞానులు రాగరహితులు. సుఖఃదుఖములను సమముగా నెంచగల స్వభావము గలిగినవారు. ఈ సమబావమును బొందుట పరిపక్వదశను బొందుట యనబడుచున్నది. ఈ పరిపక్వదశను బొందుటకు కర్మ, యుపాసనలు మార్గములు. ఇందు 'కర్మ' యనునది యోగము. భగవద్భక్తితో భగవంతుని యనుగ్రహము నపేక్షించి జేయు నాత్మ సమర్పణము ఉపాసనము. భక్తిమార్గములనేకవిధములై యున్నను యవి యన్నియు భగవదనుగ్రహములభించి బ్రహ్మానందము నందుటకు దోహద మొనరించుచున్నవి.

తన సామాన్యత నంగీకరించి, భగవంతుని యౌన్నత్యమును గుర్తించి గత్యంతరములేక తరణోపాయము భగవదాశ్రయమే యని విశ్వసంచి శరణువేడి కరుణించి కావుమని భగవంతుని వేడుకొనుటయే భక్తియనబడుచున్నది. భక్తివలన, ఈశ్వరానుగ్రహము, దాని వలన చిత్తశుద్ధి, చిత్తశుద్ధిచే నాత్మవిచారణ యందాశక్తి, దానిచే జ్ఞాన సముపార్జనాన్వేషణ, ప్రయత్నఫలితముగా గురు సందర్శనము, గురు కటాక్షమున పరమాత్మస్వరూపము నరయుదాగ్యము గల్గుటయే బ్రహ్మ జ్ఞానమును బొందుట" యని జెప్పబడుచున్నది. బ్రహ్మజ్ఞానలబ్ధి కందరును నధికారులైనప్పటికిని, ఆత్మ పరిపాకము బొందునపుడే బ్రహ్మజ్ఞానము సిద్ధించుట సాధ్యమగుచున్నది. అందుకు ప్రథమమున పామరులు కర్మనిష్ఠులు కావలెను; కర్మనిష్ఠులు బ్రహనిష్ఠకధికారులగు చున్నారు; బ్రహ్మనిష్ఠయే జీవన్ముక్తి.

తన్ను తానెఱుగుట — తాను బ్రహ్మ స్వరూపము; సర్వము బ్రహ్మమయమని యెఱుగుటయే జీవన్ముక్తి. జీవన్ముక్తికి గురుకటాక్షమే గుఱుతైన మార్గము. పతియగుపరమాత్మ పశువగు కవాత్మను పాశమను మాయనుండి విడిపించి, కరుణాతిరేకముచే గురురూపమున గన్పించి తన్ను తానెఱిగించు కొనుచున్నాడనునది శివజ్ఞానబోధసారము. గురుకటాక్షమున నాత్మ తాను నదియే యను సోఽహం భావమును బొందుట పరిపక్వదశను బొందుట యనబడుచున్నది. తత్త్వజ్ఞానము గల్గుటకు గురుకటాక్ష మవశ్యమని గుర్తుజేయునది యాదిగురువగు దక్షిణామూర్తి స్వరూపము.

" ఆచార్యవాన్ పురుషోవేద "— గురువుమూలముగనే తత్వమును తెలియనగును; అపరోక్షసాక్షాత్కారమగు గురువే యజ్ఞానాంధకారమును దొలగించి, భ్రాంతిని బోగొట్టి, చిత్తశుద్ధిని గల్గజేసి, తత్వబోధనజేసి యరుదైన యాత్మజ్ఞానమును బడయుటకు మార్గదర్శియై యుండుటచే జ్ఞాన సముపార్జనకు ఆచార్యానుగ్రహము వశ్యమగుచున్నది. " గురువు లేని విద్య గురుతుగా దొఱకద " నుట పెద్దల యనుభవ వాక్యము — గురువులేక తెలివి గల్గుట సాధ్యము గాదని భావము.

" సద్గురు సందర్శనమే—తెలివి
సద్గురు నామస్మరణమే—తెలివి
సద్గురూపదేశమువినుట—తెలివి
తెలివికి తెరువు సద్గురు పాదసేవయే ! "

యని గురుచరణాశ్రయ వైభవము గొప్పగఁ జెప్పబడి యున్నది. సద్గురుని యాశ్రయవైభవము " గురులేక యెటువంటి గుణికి తెలియకపోదు " — యను త్యాగరాజకీర్తమున ప్రశంసింపబడి యున్నది. ' గురుసాక్షాత్ పరబ్రహ్మ ' మని మన పెద్దలు గురుమహి

మను గొనియాడియున్నారు. ఆదిగురువగు పరమశివుడు శూరసంహార నిమిత్తము తన యాత్మశక్తి స్వరూపముగ నవతరించిన కుమారస్వామిని గురుభావముననెంచి యాతని స్థితిని బెంచిన వృత్తాంతము శ్రీ స్వామినాథ వైభవము.

పూర్వమొక సమయమున కైలాసమందు కొలువై యుండిన గిరిజారమణుని సేవింప నింద్రాది దేవతలతో గూడి బ్రహ్మదేవుడేతెంచెను. దేవదేవుని దర్శించుటకై జనిన దేవతలు దారిలోనుండిన దేవసేనాధిపతిని నమస్కరించి గౌరవించి ముందుకువెళ్ళిరి బ్రహ్మదేవుడు మాత్రము వయసున చిన్నవాడని యెంచి కుమారస్వామి యునికిని గుర్తించని వానివలె అతనిని దాటి వెళ్ళు సమయమున సరసీరుహాసనుడు తన్ను సరకుజేయకుండుటను గమనించిన శివకుమారుడు బ్రహ్మదేవునిబిలిపించి తనకు ప్రణవార్థమును వివరించి తదుపరి పరమశివుని సన్నిధికి బోవలసినదని బల్కెను. బ్రహ్మదేవుని బదులు తృప్తి గల్గింపనందున శివకుమారుడు బ్రహ్మదేవునిజెఱబెట్టి తానే సృష్టి కార్యమును నిర్వహింప బూనుకొనెను.

కుమారుడు బ్రహ్మదేవుని జెఱబెట్టిన సంగతి దెలిసిన పరమశివుడు విరించిని విడిపింపగోరి నందిదేవుని బంపి ప్రయోజనము లేకుండుటచే తానే స్వయముగా కార్తికేయుని సముఖమునకు విచ్చేసెను. తనకడ కరుదెంచిన తండ్రిని భక్తితో గౌరవించి వారిరాకకు కారణమడిగి వినయ విధేయతలుట్టిపడ జఱిగిన దంతయు సవిస్తరముగా దెలియజేసి బ్రహ్మదేవుని చెరబెట్టుటకైన కారణమును వివరించెను. ముందొక సమయమున శూరుని తపమునకు మెచ్చి తన్నుమించిన తన శక్తిచేత నతనియంతము సంభవించినట్లు వరమిచ్చుయుండుటచే తన యుని తండ్రికి మించినవాడని సమ్మతించుట సాధ్యము గాదను టెఱిగి గురుభావమున నతనిస్థితిని బెంచుటకై తనకు ప్రణవార్థమును దెలియజెప్పుమని పరమశివుడు కుమారుని గోరెను.

పరమశివుని చెవిలో ప్రణవ రహస్యము నుపదేశించుటచే శివ కుమారుడు 'శివగురునాథుడని', 'గురునాథుడ'ని 'స్వామినాథుడ' నియు, సుబ్రహ్మణ్యుడనియు సార్థక నామధేయుడయ్యెను. ఉప దేశము బొందగోరువారు గురువును వెదకి వెళ్ళుట సత్సంప్రదాయ మగుటచే సదాశివుడు సుబ్రహ్మణ్యస్వామి వద్దకు వెళ్ళి ప్రణవార్థమును దెలియ జెప్పుకొనిన యున్నతికి కారణమైన పరమేశ్వరుని లీలా వినో దము పురాణ ప్రసిద్ధము.

మహేశుని మహిమచే శివకుమారుడు శివగురునాథుడై ఘనత జెందినను, పూజ్యుడైన బ్రహ్మదేవుని చెరబట్టిన యపచారమునకు ప్రాయశ్చిత్త మొనర్చుకొనుటకై తపమాచరించిన భువికేతించి ప్రళయ కాలమునను నశింపక నిల్చియుండు ప్రళయజిత్ క్షేత్రమగు కాంచీపుర మున వెలసిన యేకామ్రేశుని నుతించి కందమూలస్కందుడని బ్రఖ్యాతి బడసి పిదప కాంచీపురమున నొక లింగమును బ్రతిష్ఠించి పూజించి ధన్యుడయ్యెను. కంచిలో కుమారస్వామిచేఁ బూజింపబడిన శివలింగము దేవసేనాపతీశుడనియు కుమారస్వామి పూజించిన పుణ్యస్థలము కుమర కోష్ఠమనియు ప్రసిద్ధి జెందెను.

అలనాడు శివునకు ప్రణవార్థమును దెలియ జెప్పిన శివగురునా థుఁడు పిదప భక్తుల నాదరించి జ్ఞానమొసగి యనుగ్రహించిన సన్నివేశ ములనేకములు. శివకుమారుని కరణావిలాసమున కవులై ప్రసిద్ధి జెం దిన మహనీయులలో తమిళదేశమున మూగవాడైయుండి కుమారస్వామి మహిమచే మాటాడు శక్తినిబొంది, కవియై ముత్తుకుమారస్వామి బాల శతకమును బాడిన కుమరగురువరుడను భక్తవరేణ్యుడు. స్కందషష్ఠి కవచమను స్తోత్రమును గ్రహించిన శ్రీ దేవరాయ స్వాములవారు, షణ్ముఖకవచస్తోత్రమును ప్రపంచమునకు బ్రసాదించిన పాంబన్‌స్వాముల వారు సుప్రసిద్ధులు. అరుణగిరినాథుల వారిని నాదుకొని కవితాశక్తిని

ప్రసాదించి పల్లవి ప్రథమపాదమును తానే యందించి తన ఘనతను గీర్తించునట్లనుగ్రహించినట్లు స్కందమూర్తి తన మహిమ పురాణ రూపమున వెలువడుటకై మొదటి పద్యపాదమునందించి కచ్చియప్ప శివాచార్యులవారిచే కందపురాణమను కావ్యమును రచింపజేసి కార్యసమర్పణ సమయమున సభామంటపమునకు తానరుదెంచి తానందించిన కావ్యమందలి తొలిపద్యమునకు తాత్పర్యమును వివరించిన జ్ఞానపండితుని యొక్క పురాణము పుట్టిన పుణ్యస్థలము కంచిలోని కుమరకోష్ఠము.

కంచిలో వసించి కుమరకోష్ఠమున వెలసిన కుమారస్వామి నారాధించి వచ్చిన కాళత్తియప్ప శివాచార్యులు గొప్పపండితులు. వారికి చాలకాలము వఱకు సంతానము గల్గకుండుటచే వగచి పుత్రాపేక్షతో కుమారస్వామి నుద్దేశించి వ్రతము లాచరించిరి. కంచి కుమరకోష్ఠవు కుమరుని కరుణాకటాక్షమున కాళత్తియప్ప శివాచార్యుల కవతరించిన కుమారుడే కచ్చియప్ప శివాచార్యులు. బాల్యముననే కచ్చియప్ప వేదాగమశాస్త్రములందు పాండిత్యమును బొంది సద్గురుసంపన్నుడై యుచిత కాలమున దీక్షనుబొంది కచ్చియప్ప శివాచార్యులై తండ్రివలె భక్తిశ్రద్ధలతో కుమారస్వామి నారాధించు చుండెను.

పరమ భక్తుడైన కచ్చియప్ప శివాచార్యుల కరుణింప నెంచిన కుమారస్వామి కచ్చియప్ప శివాచార్యుల కలలో గనుపించి తనగాథను తమిళమున కావ్యరూపమున రచింపుమని యాదేశించెను కవిత్వ మొనరించుట యందనుభవము లేకుండుటచే భగవదాజ్ఞను నెరవేర్చు మార్గము దెలియక భ్రమించియుండిన కచియప్పశివాచార్యులకు కుమారస్వామి "త్రిగటచక్ర" మని మొదలగు పద్యపాదము నందించి కవితాశక్తిని బ్రసాదించి యనుగ్రహించెను. స్కందపురాణ కావ్యము తమిళమున రచింపబడెను.

కచ్చియప్ప శివాచార్య విరచితమైన స్కాందపురాణ కావ్యమును వెలువరింప నొక శుభముహూర్తమును నిశ్చయించి కుమరకోష్ఠము నందలి మంటపమున ప్రబల పండితులు సమావేశమైయుండి సదస్యుల సమక్షమున నుంచబడెను. కావ్యపఠనము ప్రారంభమైనంతనే మొదటి పద్యముయొక్క తొలిపలుకును లక్షణరీతి నిరూపింపుమని పండితులు గోరిరి. తన కావ్యములోని యా ప్రథమపద్యపు తొలిపలుకు కుమార స్వామి యనుగ్రహించినట్లు కచ్చియప్ప శివాచార్యులు విన్నవించినను వినక శివకుమార ప్రయోగితమైనను వివాదమునకు వచ్చినప్పుడు దానిని నిరూపించుటయే న్యాయమని నిశ్చయముగా బల్కుటచే గత్యంతరము లేక యొక దిన మవకాశము వేడి కావ్యావిష్కార విఘ్నమునకు వగచి నిజ నివాసంబునకు జని శరణమన్యంబులేక యారాత్రియంతము కుమార స్వామిని కరుణించి కాపాడుమని ప్రార్థించి తన్ను రక్షించు భారము శివ కుమారునిదైనప్పుడు తానుచలింప నవసరములేదను విశ్వాసముతో మరు దినము కుమరకోష్ఠమునకువచ్చి కుమారస్వామిని సేవించి సదస్సునకు విచ్చేసెను.

సదస్సు ప్రారంభమైనంతనే జ్ఞానపండితుడైన శివకుమారుడొక పండితుని రూపమున సభాంగణమును ప్రవేశించి తాననుగ్రహించిన పద్య వాక్యమును శాస్త్రరీతిని వివరించి ప్రమాణములతో నిరూపించి పదప్రయోగము శాస్త్రసమ్మతమని పండితులచే నంగీకరింపజేసి యదృ శ్యుడైన యద్భుతమును గాంచిన సదస్యులు సంభ్రమాశ్చర్యములతో చకితులై కుమారస్వామి కరుణను గ్రహించి కచ్చియప్ప శివాచార్యుల భక్తితత్పరతను బ్రశంసించి స్కాందపురాణ కావ్యము నంగీకరించి కచ్చి యప్ప శివాచార్యులను గౌరవించి ధన్యులైరి. కంచిలోని కుమరకోష్ఠ మున కచ్చియప్ప శివాచార్య విరచితమైన కందపురాణ తమిళకావ్యము వెలువరింపబడిన మంటపము "స్కాందపురాణావిష్కరణ మంటప" మని ప్రసిద్ధమై యున్నది.

కచ్ఛియప్ప శివాచార్య విరచితమైన శివకుమారుని వృత్తాంతమగు కందపురాణ తమిళకావ్యము నవరసభరితమై సర్వలక్షణ లక్షితంబై రమణీయమైన స్కాందపురాణ కావ్యమున కవితాశిల్పము పరాకాష్ఠము బొందియున్నది. దక్షయజ్ఞవిధ్వంస వర్ణనమున భీభత్సము, హాస్యము మన్మధ దహనానంతరము రతిరోదన శోకము, కైలాసాధిపునియోగ సమాధి వర్ణనమునను, జ్ఞానోపదేశసందర్భమునను శాంతము, పార్వతీ పరమేశ్వరుల ప్రణయ కలాపమున శృంగారము, బానుగోపుని యుద్ధ నైపుణ్య వర్ణనమున వీరము, తారకాసురుని రౌద్రాకారమును జూపుటతో రౌద్రము, రణరంగ వర్ణనమున భీభత్సము, తారకుని మాయా యుద్ధవర్ణనమున భయానకము, రక్తబీజుని యుద్ధ కౌశలమున నద్భుతము, వీరబాహుడు కుమారస్వామి యెడగల్గిన భక్తివిశేషము. కావ్య విశేషము, కావ్యనాయకుడగు కుమారస్వామి శూరునితో బోరాడు సమయమున జూపించిన వీరము, కారుణ్యము వివర్ణితములై నవరసభరితమై యొప్పు స్కాందపురాణము సర్వలక్షణ లక్షితంబైన మహాకావ్యముగా బరిగణింప బడుచున్నది. శివకుమారుని వైభవమును వర్ణించు కందపురాణమను తమిళ కావ్యము రచింపబడిన దివ్యస్థలమగుటచే కాంచీపురమందలి కుమరకోష్ఠము పురాణము పుట్టిన పుణ్యస్థలము.

పాంబన్‌స్వాములొక సమయమున క్షేత్రాటన మొనరింపుచు కాంచీపురమునకు వచ్చియందున్న యాలయములను దర్శించి మరలునపుడు యాకాలమున తోటకూరపాదులచే గప్పబడి మరుగుపడిన స్థితిలో నుండిన కుమరకోష్ఠమును దర్శింపకయే బయలుదేరు సమయమున నొక బాలకుని రూపమున గనుపించి కుమరకోష్ఠమును జూపించి పాంబన్ స్వాములు తన్ను దర్శించు నట్లొనరించిన యద్భుత సంఘటనము శివకుమారుని లీలావినోదమునకు మరొక మచ్చుతునక.

కంచిలోని కుమరకోష్ఠము సోమస్కందుని యాకారమున నేర్పడి యుండుట యొక ప్రత్యేకత. పరమేశ్వరుని వామభాగమున పార్వతీ దేవి యాసీనురాలై యుండ వుభయులకు మధ్య కుమారస్వామి గూర్చుండి యుంకుట సోమస్కంద రూపమున బడును. ఆ భంగిని యేకామ్రేశుని యాలయమునకు యెడమవైపున శ్రీ కామాక్షి యమ్మ వారి యాలయముండి రెండింటికి మధ్యలో కుమారస్వామి యాలయ మగు కుమరకోష్ఠముండుట యీసోమాస్కంద రూపభావమున నిర్మితమై యున్నట్లు గన్పట్టుచున్నది. ఈ ఆలయమునకు చక్కని రాజగోపు రము నిర్మాణించబడి 1989 సంవత్సరము కుంభాభిషేకము జరిగినది.

కుమరకోష్ఠమును ప్రవేశించి లోప్రాకారమును ప్రదక్షిణముగా వచ్చునపుడు తూర్పు జూచినట్లమరియున్న సంతాన గణపతిని గొలిచి, ఉత్తరమమున కృత్రిమమైనగట్టుపై నెలకొనియున్న దండాయుధపాణిని దర్శింపనగును. పిదప కుమారస్వామి సన్నిధి యర్ధ మంటపమున కుమరకోష్ఠపు కుమారునిచే గొలువబడిన "దేవసేనాపతీశు" డన బరగు శివలింగమును దర్శించి యాగుడిజుట్టి వచ్చునపుడు దక్షిణమందున్న వినాయకుని, పశ్చిమాభిముఖుడై యున్న కచ్చియప్ప శివాచార్యుల విగ్ర హమును. దానికెదురుగా షణ్ముఖుని యుత్సవ విగ్రహమును దర్శింప నగును. షణ్ముఖుని సన్నిధికి ప్రక్కన భైరవునిసన్నిధి, ఉరుక్కా ముళ్ళముడైయ పెరుమాళను విష్ణుమూర్తి సన్నిధి గలవు.

చెఱబెట్టబడిన బ్రహ్మదేవుని స్థితికి జాలినిబొంది బ్రహ్మదేవుని విడిపింపుమని యుమాదవుని గోరుటచే నీ మాధవునికి వురుక్కాం వుళ్ళ ముడైయప్పెరుమాళ్; వురుక్కాముళ్ళపెరుమాళ్, జాలిగలజనార్థనుడను పేరు గల్గెనని ప్రతీతి.

జాలిగల జనార్ధముని సన్నిధి నంటినట్లున్న సన్నిధిలో సోమా స్కంధుని యుత్సవ విగ్రహము, నవవీరులు, ముత్తుకుమారస్వామి,

గజవల్లి యుత్సవ విగ్రహములు గలవు. ప్రదక్షిణ ప్రాకారపు దిగువ భాగమున యిరుప్రక్కల వల్లీదేవసేనల సన్నిధులు గలవు.

కుమరకోష్ఠమున స్వామివారి సన్నిధి వెనుక భాగమున ప్రతిష్ఠింపబడియున్న నవగ్రహములకు భక్తులు ప్రదక్షిణ నమస్కారము లాచరించి గ్రహదోషనివారణముఁ బొందుచున్నారు. నవగ్రహముల నంటినట్లున్నది శ్రీ దేవసేనసన్నిధి. దానికి ప్రక్కన యరుణగిరినాదు డను భక్తవరేణ్యుని విగ్రహముగలదు. మూలస్థానమున కుమరకోష్ఠ ప్రధాన దైవమగు కుమారస్వామి వెలసి యున్నాడు. అలనాడు బ్రహ్మదేవుని చెఱబట్టి సృష్టికార్యమును తానే నిర్వహించియుండిన తీరున నొక్కముఖముతో చతుర్భుజుడై నిల్చి వెలసియున్న కుమారస్వామి నాలుగుహస్తములలో పైనున్న కుడిచేతిలో రుద్రాక్షమాలను, యెడమ చేతిలో కమండలమును ధరించి క్రిందనున్న కుడిచేత నభయముద్రతో నొప్పుచు వామహస్తమును నడుమున నుంచుకొని యత్యంత సుందర రూపముతో విరాజిల్లుచున్నాడు. కుమారస్వామికి తేనె ప్రియమగుటచే నిచట తేనెతోనే యభిషేకము చేయింపబడుచున్నది. దీపావళి పండుగ దినమున మాత్రమీ కుమారస్వామికి తైలాభిషేకము జరుగుచున్నది.

మూలస్థానమున కుమారస్వామిని దర్శించి యర్ధమంటపమును దాటి వెలుపలకు వచ్చునపుడు ప్రదక్షిణమున ఉత్సవమూర్తులను దర్శింపనగును. ఆలయమునుండి వెలుపలకు వచ్చునపుడు ద్వారము వద్ద లోవైపున నద్దాలగదిలో సమరస శుద్ధసన్మార్గ స్థాపకులైన వడలూరు రామలింగస్వామియను మహాత్ముని చలువరాతి విగ్రహమును దర్శింపనగును. ఆలయమునుండి వెలువడినంతనే ద్వారమునకు యెడమవైపున వరసిద్ధి వినాయకుని యున్నత విగ్రహము గంభీరమైయుండి గొలువబడుచున్నది. ఆలయ ప్రాంగణముననున్న పదునారు కాళ్ళ మంటప

మున స్తంభమున వెలసియున్న హనుమంతుడు వరప్రసాదియై భక్తులచే గొలవబడుచున్నాడు.

కుమరకోష్ఠమున నడచు వైశాఖ విశాఖోత్సవము ఈ యాలయ బ్రహ్మోత్సవము. ఆషాఢ మాసమున యాడికృత్తిక ఉత్సవము. దీపావళి సమయమునవచ్చు నాశ్వియుజ బహుళ షష్ఠియగు స్కందషష్ఠి మహోత్సవము అత్యంత వైభవముతో జఱుగుచున్నవి. మాసాంతర కృత్తిక దినములందును, ప్రతి మంగళవారము, విశేషమైన యభిషేకారాధనలు జఱిపించపడి దివ్యాలంకార భూషితుడగు కుమరకోష్ఠపు కుమారస్వామిని భక్తజనులు కనులార సేవించి స్తుతించి కృతార్థులగుచున్నారు.

——:o:——

# పాండవదూతయైన పురుషోత్తముడు

(శ్రీ పాండవదూతప్పెరుమాళ్)

శ్రియఃపతియైన శ్రీమన్నారాయణుడు సర్వేశ్వరుడగుటచే స్వాభావికమైన కారుణ్యముచేత చేతనులు తన్నాశ్రయించు నట్లొనర్చి భక్తితో తన పాదారవిందములందు శరణొసగి శరణాగతికైన మంగళములననుగ్రహించుటచే సర్వలోక శరణ్యుడగుచున్నాడు ఆశ్రితుల యభిలాషనెఱిగి వారి యోగ్యతానుసారము భోగభాగ్యంబులను తన సంకల్ప మాత్రమున గల్గజేయుటచే సత్యసంకల్పుడనియు, సర్వశక్తుడనియు నుతింపబడుచున్నాడు. సత్య సంకల్పుడగుటచే పురుషోత్తముడైన సత్యవ్రతతత్వము తనయందు నెలకొనియుండ స్వాభావికమైన సౌలభ్య, సౌజన్య, వాత్సల్యాది గుణోజ్జ్వలుండైన నారాయణుడు భక్త సులభుడై తన పాదారవిందములే గతియని నమ్మి శరణుజొచ్చిన భక్తులు పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తి సంపన్నులై యలరారునట్లను గ్రహించుచున్నాడనుట పెద్దలమాట శరీరమునకు, వస్త్రమునకునున్న సంబంధమే దేహి దేహ సంబంధమును సత్యమును చేతనులు గ్రహించునట్లనుగ్రహించుటచే సత్య కాముడనియు, సత్య సంకల్పుడనియు, సమస్తకళ్యాణ గుణ సంపన్నుడగుటచేతను, సమస్తజీవ హృదయాంతరాళమున భాస్వజ్జ్యోతియై వెలుగొందుట చేతను పురుషోత్తముడనియు గుర్తింప బడుచున్నాడు.

శరణాగత శ్రేయోభిలాషియగు శేషశయనుడు తన దొడ్డతనమునిసుమంతయు సరకుజేయక లోకోపకారము కొఱకాశ్రిత వాత్సల్యమున దిగివచ్చుట కవతారమని యందురు. సాధుసంరక్షణము, ధర్మ

సంస్థాపనము భగవంతుని యవతార కారణములు కాగా యాయా యవతార వైభవముల నెంచిచూచి యనుభవించిన భాగవతోత్తముల హృదయాంతరాళములనుండి యానందాతి రేకమున వెలువడిన సుందరగీతములచే వినుతుడైన భగవంతుడు భక్తజన పరిపాలనార్థము యందందు వెలసి వెలుగొందు పుణ్యస్థలములు దివ్యదేశములనియు, దివ్యక్షేత్రములనియు, దివ్యస్థలములనియు ప్రఖ్యాతిగాంచి యున్నవి. ఆట్టి దివ్య స్థలములలో పురుషోత్తముడగు శ్రీకృష్ణుడు పాండవదూతయై రాయబారమునకు జనిన సందర్భమున ప్రకటించిన విశ్వరూప సదృశ్యమైన రూపముతో నర్చావతారమున వెలసియున్న శ్రీవైష్ణవ దివ్యదేశము కాంచీపురమునన్న "పాడగ" మన బరగు పాండవదూత ప్పెరుమాళ్ దేవస్థానము.

యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత !
అభ్యుత్థానమ ధర్మస్యతదాత్మానం సృజామ్యహం ॥

ధర్మములకు సంకటము గల్గునపుడెల్ల ధర్మ సంస్థాపన మొనర్చి సాధువులను సంరక్షించుటకై తానవతరించునట్లు తానే ప్రకటించిన రీతిని ద్వాపరయుగమున దుర్యోధనాదుల దుర్మార్గమునుండి ధర్మాత్ములైన పాండవులను రక్షించుటకై పురుషోత్తముడైన పరంధాముడు శ్రీ కృష్ణావతారమున ననేక లీలలను ప్రదర్శించి ధర్మాధర్మ నిరూపణముతో బాటు అధర్మమునకు నాశనము, ధర్మమునకు జయము తథ్యమని నెలకొల్పుట కనేక సంఘటన లేర్పడు నట్లొనర్చి తన భక్తపరాధీనతను వెల్లడించెను.

విమలచరిత్రుడగు వాసుదేవుడు విదురుని గృహామునకు విజయము చేసినపుడతడు భక్తిపూర్వకముగ కదళీఫలముల నారగింపజేయు సంకల్పముతో శ్రీకృష్ణనుచితాసనమున నమరంజేసి, చందన కస్తూరీ

చర్చల నర్చించి పుష్పమాలికల కలంకరించి గౌరవించి భువన మోహ నుండగు పుండరీకాక్షునియొక్క పద్మసంకాశ చరణంబులను ధ్యానంబున నిల్పి తన్మయత్వంబున మైమఱచి యరటి పండ్లనొలిచి యిచ్చునపుడు ఫలములకు బదులు తొక్కల నందింప నచ్యుతుడతి తృప్తితో తొక్కల నారగించిన యద్భుతము శ్రీకృష్ణుని కరుణావిలాసమున కొక యుదాహర ణము. సర్వేశ్వరుడగు గోపాలుడు సహదేవుని సహజభక్తికి కట్టు బడిన సందర్భము శ్రీకృష్ణుని సౌలభ్యత కొక మచ్చుతునక. పురుషో త్తముడైన పరంధాముడు పరమకారుణ్యమున పాండవులకు దూతయై కౌరవ సభకు రాయబారము వెళ్ళిన సన్నివేశము సర్వలోక శరణ్యుడైన జనార్ధనుని యౌదార్యమునకు, భక్తపరాధీనతకు, ఆశ్రిత వాత్సల్యము నకు నిరూపమాణము.

దౌత్యమునకు, దూతకునైన లక్షణములు శాస్త్ర విహితములు. దూత తానుగొనిపోవు దౌత్య సందేశము నతిలాఘవముగను సరళముగను ఆమోదంబగురీతి నత్యంత సామర్ధ్యముతో వెలిబుచ్చవలెనను యవశ్య కతకొప్ప, రాయబారము బంపువారి మనోధర్మమున కనుగుణముగా సమంజసమగురీతిని కార్యసాధన మొనర్చుకొనిరావలయుననునది దూత కైన లక్షణము. ఈ లక్షణములకొక నిదర్శనమై యొప్పునది పాండవ దూతయై జనిన శ్రీకృష్ణునిరాయబారము.

సమాధానమునకై వెళ్ళిన శ్రీకృష్ణుని రాయబారము సమరముతో ముగియుటచే దౌత్యమునకైన లక్షణము పూర్తి యేర్పడినదా యను సంశ యము గల్గుట సహజము కాని, పాండవ నియుక్తుడై దౌత్యమునకు జనిన శ్రీకృష్ణుని యుద్ధనిర్ణయము పాండవ సమ్మతమేయని వారు జూదమాడి యోడినపుడు దురోధనుని దర్పము నణచెదనిమ చేసిన ప్రతిజ్ఞయు, కౌరవసభలో ద్రౌపది మానభంగ ప్రయత్నము జరిగినపుడు దుర్మార్గుడగు దుర్యోధనుని రుధిరముచే శిరోజలేపన మొనర్చి కొప్పు

ముడిచెదనన్న పాంచాలి శపథము పాండవుల యుద్ధాపేక్షను వ్యక్త పఱచుచున్నవి కౌరవులతోడి యుద్ధము ధర్మనందనుఁడు దక్క మిగిలిన వారికి సమ్మతముగ నుండినది. తనవారి యభిప్రాయమునకు తల యొగ్గుటదక్క ధర్మనందనునకు గత్యంతరములేదు. కావున పాండవులకు సమంజసమగురీతిని తనరాయభారమును శ్రీకృష్ణుడు సక్రమముగ నెఱ వేర్చినట్లు పరిగణింప ననువగుటచే శ్రీ కృష్ణరాయబారమున దౌత్య లక్ష ణము పూర్తియైనట్లు నిర్ణయింపవలసియున్నది.

దూత యేలాగున నడచుకొనవలెనని నిర్ణయింపబడియున్నట్లు దూతయెడనెట్లు నడచుకొనవలెనుటకు శాస్త్రనిర్ణయముగలదు. అందు దూతను చంపనెంచుట పాపమని చెప్పబడియున్నది. హనుమంతు డశోకవనమును ధ్వంసమొనర్చి రాక్షస సైన్యమును నాశన మొనర్చి నందులకై లంకేశునెదుట నిల్వబెట్టబడినపుడు రావణు డాగ్రహించి వాయునందనుని వధింపుడని యాజ్ఞాపింప, ధర్మజ్ఞుడగు విభీషణుడు వారించి దూతను వధించుట న్యాయముగాదని వివరించుటనుండి దూతను జంపుట నిషిద్ధమని దుజువగుచున్నది.

"సాధుర్వాయదివాఽసాధుః పరైరేషసమర్పితః
బ్రువన్పరార్థం పరవాన్ నదూతోవధమర్హతి"
—వాల్మీకి రామాయణము, సుందరకాండము.

" బుద్ధిః కర్మానుసారిణీ ", " వినాశకాలేవిపరీతబుద్ధిః " యనునట్లు పతనమగు కాలము దాపురించుటచే కౌరవులు పాండవ దూతయై వచ్చిన శ్రీకృష్ణుని జంపుట కెత్తుగడఁబన్నిరి. పరంధామునికై నిర్దేశింపబడిన యాసనమునకు దిగువ మర్మమందిరమమర్చి యచట బలశాలులగు మల్లులనియమించి యచ్యుతుడాసనము నలంకరింపఁగనే యాసనము బ్రద్దలై శ్రీకృష్ణు డడుగుననున్న మర్మమందిరమున బడునట్లును,

యపుడతని నక్కడ నియమితులైన మల్లులు తుదముట్టించునట్లును దుష్టులగు దుర్యోధనాదులు పన్నుగడబన్నిరి. కంస, చాణూర, జరాసంధ, శిశుపాల దంతవక్త్రులవంటి వక్రబుద్ధిగల దురాత్ముల నెందరినో యనాయాసముగా ద్రుంచిన శ్రీకృష్ణుని తుదముట్టించినగాని పాండవులను నిర్మూలించుట సాధ్యముగాదని యెంచి దుర్యోధనాదులట్టి దుష్ప్రియత్నమున నుండిరి.

సర్వజ్ఞుడగు కృష్ణుడు దురితాత్ములైన దుర్యోధనాదుల దుర్బుద్ధిని, పాపకార్యమును దెలిసికొని తాను సర్వజ్ఞుడగుటయు, దుర్జయుడగుటయు రారాజు కెఱుకపఱచి తన్ను బంధించుట వారికి శక్యముగాదని నిరూపించునిమిత్తము మహనీయమైన తన విశ్వరూపమును ప్రదర్శించెను. సర్వశక్తుని సర్వేశ్వరుని విశ్వరూప ప్రదర్శనమున సభాసదులెల్ల భయకంపితులై భగవంతుడగు శ్రీకృష్ణుని బద్ధాంజలి ఘటించి భక్తితో స్తుతించి కోపముపీడి కరుణజూచి గావుమని ప్రార్థించిరి. సభలోని కోలాహలమునకు కారణమరసి భ్రమించి కోటికందర్ప సంకాశమగు శ్రీకృష్ణుని విశ్వరూపమును సందర్శించుటకు తనకుదృష్టిని ప్రసాదింపుమని వేడిన ధృతరాష్ట్రునకు దామోధరుడు దివ్యదృష్టిని దయతో ననుగ్రహించి తన విశ్వరూప సందర్శన భాగ్యమును గల్గజేసినయుద్భుత మహిమలు వర్ణనాతీతము.

మీటనొక్కినంతనే విద్యుద్దీపము ప్రకాశించునట్లు తననేత్రములు ప్రకాశమును జూడగల శక్తిని బొందుటచే నవ్యక్తమైన యానందాతిరేకముచే పులకాంకితుడైన ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని కరుణావిలాసమును వేనోళ్ళ గొనియాడెను. తన్ను నుతించిన ధృతరాష్ట్రుని వరదుడగుమని శ్రీకృష్ణుడు చెప్ప నతడు చకితుడై జగన్నాదుండగు జనార్దనుని దర్శనమున తనజన్మ సాఫల్యము నొందినదనియు, దుర్లభమైన దామోదరుని విశ్వరూప సందర్శన భాగ్యము నొందిన నేత్రములతో

వేరొంటిని జూచుట నిరర్ధకమనియు నెంచి శ్రీకృష్ణభగవాన డనుగ్రహిం చిన చూపును తీసివేసి తనకు ప్రాప్తమైన పుణ్యము స్థిరముగా నిలబడి యుండునట్లు కరుణింపుమని గోరుకొనుటతోబాటు తన తనయుల తప్పి దమును మన్నించి రక్షింపుమని వేడెను. దుష్ట దానవ నాశకుండగు దామోదరుండు దుర్జనులగు దుర్యోధనాదుల సునాయాసముగ ధ్వంస మొనర్పగలిగియుండియు శత్రుసంహారము యజమానుని కార్యమగుట చేతను, దూతయైనవాడు శత్రునిగ్రహము చేసినచో తన యజమానుడు చేయవలసిన కార్యమును తానే నిర్వర్తించినట్లగుటచేత శాస్త్రసమ్మతము గాదని యెంచి దుర్యోధనాదుల యపరాధమును సహించి, తన విశ్వరూ పము నుపహరించుకొనిన శ్రీకృష్ణుని గొప్పదనము లోకప్రసిద్ధము.

పాండవదూతయై చనిన జనార్దనుడు కౌరవసభలోఁ బ్రదర్శించిన విశ్వరూపవైభవమును విని విష్ణుని యలనాటి విశ్వాకారమును సందర్శించి తరించు నాకాంక్షతో పాండవ వంశజుడైన జనమేజయుఁడును, హారీత మహామునియు దుస్తరమైన తపంబాచరింపవారి భక్తితత్పరతకు మెచ్చి సత్యసంకల్పుడగు సర్వేశ్వరుడు సత్యవ్రత క్షేత్రమనబరగు కాంచీపుర మున సాక్షాత్కరించి వారి ప్రార్థనచే దయానుయుఁడగు శ్రీకృష్ణుడు పాండవదూతయైన రూపమున కాంచీక్షేత్రమందర్చావతారమున వెలసిన శ్రీ వైష్ణవ దివ్యదేశము "పాడగ" మనుపేర ప్రసిద్ధమైన కంచిలోని శ్రీ పాండవదూప్పెరుమాళ్ దేవాలయము.

పాడగమని పొగడబడిన కంచిలోని యీ పాండవ దూతుని దేవాలయమాళ్వార్లచే గీర్తింపబడిన నూటఎనిమిది శ్రీ వైష్ణవ దివ్యదేశ ములలో ప్రసిద్ధిజెందినది బూదత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమహిషై యాళ్వారు, తిరుమంగైయాళ్వారు మంగళాశాసనముజేసిన ఘనతను గలిగినది. పాడనమను పాండవదూత దేవాలయము ఆళ్వార్లమంగళా శాసనముతోబాటు శ్రీ వైష్ణవాచార్యులనేకులు సేవించి స్తుతించిన ఖ్యాతి

గల్గినది. పాండవదూత దేవాలయము కంచివరదునికి తొలుత తీర్థ కైంకర్య మొనర్చి పిదప శ్రీరంగమునకు వచ్చి వసించి విశిష్టాద్వైత సిద్ధాంతమును విశదపఱచి శ్రీ వైష్ణమతమును క్రమపఱచి విస్తరింపజేసి యందఱిచే యెంబెరుమారని ప్రశంసింపబడిన యతిరాజగు శ్రీమద్రామా నుజుల వైభవమును వినిన యజ్ఞమూర్తియను నేకదండి సన్యాసి శ్రీమద్రామానుజుల వారివి యతిరాజుగ నంగీకరింప మనస్కరింపక అసూయచే రామానుజులవారితో వాదమొనరించుటకై యాంధ్రదేశము నుండి తమిళదేశమున కేతెంచెను.

ఆంధ్రప్రదేశపు నెల్లూరు జిల్లాలోని బుచ్చిరెడ్డిపాళెం గ్రామ మునకు సమీపముననున్న వింజమూరను యూరిలో నవతరంచి వేదశాస్త్ర పారంగతుడై న్యాయవేదాంత తర్కమీమాంసాశాస్త్ర కోవిదుడైన యజ్ఞ మూర్తికిని తమిళదేశపు చెంగల్పట్టు జిల్లాలోని శ్రీపెరుంబూదూరు క్షేత్ర మున నవతరించిన శ్రీమద్రామానుజులవారికిని సత్యవ్రత క్షేత్రమగు కాంచేపురమున వాదము జఱిగెను; వాదమున శ్రీరామానుజులోడుట సంభవించినచో వారు శ్రీ బాష్యప్రచారమును విరమించునట్లును, శ్రీ యజ్ఞమూర్తి యోడినచో వారు శ్రీ మాద్రామానుజులవారిని గురువుగా నంగీకరించి యాశ్రయించునట్లును తీర్మానింపబడినది. శ్రీ మద్రమాను జులవారికిని, శ్రీయజ్ఞమూర్తికిని వాదము జఱిగిన దివ్యస్థలము కంచి లోని శ్రీపాండవదూత దేవాలయము.

భారతయుద్ధము జరిగినట్లు పదునెనిమిది దినములు శ్రీ యజ్ఞ మూర్తి శ్రీమద్రామానుజుల మధ్య వాగ్యుద్ధము నడచెను. పదు నేడవ దినమున శ్రీయజ్ఞమూర్తి వాదమునకు బదులు చెప్పలేని స్థితిలో శ్రీరామానుజులవారొక దిన మవకాశము గోరునంతటి కఠినముగ వాగ్వాదము జరిగినది. శ్రీమద్రామానుజులు వ్యాకులతనొంది వర దానకుశలుడౌ వరదునాశ్రయించి తన కండగనుండి వాదమున జయము

గల్గజేసి విశిష్టాద్వైతము నిలబడునట్లు అనుగ్రహింపుమని వేడెను. దయాపరుడగు వరదరాజు తన్నాశ్రయించిన యతిరాజును గరుణించి యజ్ఞమూర్తి వాదమునకైన బదులు శ్రీ యాళవాందార్లనుగ్రహించి యున్న మాయావాద ఖండనము నందుట దెలియజేసి పరమోపకార మొనర్చెను. తన్ను పాలించిన ప్రణతార్థిహరుని పరమకారుణ్యమును గొనియాడిన రామానుజులు మరునాడు పదునెనిమిదవనాటి వాదమున యజ్ఞమూర్తి వాదమును ఖండించి వాదమున జయించి, విశిష్టాద్వైత సిద్ధాంతమును నెలకొల్పిరి. శ్రీమద్రామానుజులు ప్రతివాదము నంగీకరించి తలయొగ్గి, శ్రీభాష్యకార్ల ప్రతిభానిశేషమున కాశ్చర్యపడి వారి పాదపద్మములం బ్రణమిల్లి తమ్ము శిష్యునిగ స్వీకరించి కటాక్షింప వలసినదిగ యతిరాజులవారిని యజ్ఞమూర్తి ప్రార్థించిరి.

వాదమున జయముగాంచిన శ్రీమద్రామానుజులవారు శ్రీ యజ్ఞమూర్తి నత్యంత కారుణ్యమున గటాక్షించి, యజ్ఞమూర్తి పాండిత్యమును ప్రశంసించుటతోబాటు దయామయుడగు కంచివరదుని యాశ్రిత వాత్సల్యమును వివరించి వాదమున తనకు జయములభించిన దనుటకంటే శ్రీ వరదరాజుని భక్తసౌలభ్యత ప్రకటిత మగుటకు తమవాదము హేతుభూతమయినదని నుడువుట న్యాయమని వక్కాణించిరి. యతిరాజుల వారి సౌజన్యత కచ్చెరువొందిన యజ్ఞమూర్తి శ్రీమద్రామానుజులవారిని తామాచార్యునిగ బొందగల భాగ్యమును గల్గజేసిన వరదరాజును వినుతించి అరుళాళప్పెరుమాళను నాదేవదేవుని పేరుతోగూడ గురువుగా తన కాశ్రయమిచ్చి సమాశ్రయణము జేయించిన యెంబెరుమానారను రామానుజులవారిపేరుతో జతపఱచి 'అరుళాళప్పెరుమానెంబెరుమానార్' లను కారణనామ ధేయమును దీక్షానామముగా బొందిన శ్రీ యజ్ఞమూర్తి కంచిలోననే వసించి శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమును బ్రచారము చేయసాగిరి.

భారతయుద్ధమున నర్జునుడు విషాదమునొందియున్న తరుణమున పార్థసారథియైన భగవంతుడు స్వాభావికమైన యాశ్రిత వాత్సల్యముచే గీతాచార్యుడై స్వయముగా పార్థునికి భగవద్విషయము నుపదేశించి విశదపఱచినట్లు కంచిలో పాండవదూతయై వెలసియున్న శ్రీకృష్ణుని సన్నిధిని శ్రీమద్రామానుజుల వారితో తనకు జరిగిన వాగ్యుద్ధమున భగవంతుడు భగవద్రామానుజుల మూలముగ భగవద్విషయమును నిర్ధారణముగ నరయజేసి యతిరాజుల నాచార్యునిగ బడయు భాగ్యమును గల్గించుటచే తమ జీవిత శేషము నా పాండవదూత సన్నిధిని గడుప నిశ్చయించి శ్రీయరుళాళప్పెరుమా నెంబరుమార్లను పేరుతో కంచిలో వసించి శ్రీయజ్ఞమూర్తి విశిష్టాద్వైత ప్రచారమునకై తమ్మర్పించు కొనిరి. వింజమూరులో నవతరించిన కారణమున నీపేరరుళాళప్పెరుమా నెంబెరుమానార్ వింజమూరు స్వాములనియు ప్రసిద్ధి జెందిరి. ఈ వింజమూరు స్వాములవారి వంశస్థులే యానాటి నుండి యీనాటి వరకు శ్రీపాండవదూతప్పెరుమాళ్ సన్నిధిని ధర్మకర్తలై యారాధనకైంకర్య మొనరించుచున్నారు.

పెద్దకంచిలో గంగైకొండ మంటపమునకు సమీపముననున్న పాండవదూతప్పెరుమాళ్ళ దేవాలయ విమానమునకు ఉత్తర దక్షిణ భాగములందు గన్పించు శిలాశాసనములనుండి కులోత్తుంగ చోళుని కాలమున నీదేవాలయ జీర్ణోద్ధారణము జఱిపింపబడినట్లు తెలియనగు చున్నది. మూల విగ్రహపు మణిమకుటపతి యున్నతమై యుండుటచే విమానదళముపైకి బోవ బోవ గుహవలె కురుచనై మకుటాగ్రమును దాకునట్లుమర్చబడియున్నది. పాడగమనబడు నీ దివ్యదేశమందు భద్రవిమానమున నత్యున్నతరూపుడై తూర్పుముఖముతోను, అభయ హస్తముతోను, శరణాగతి తత్త్వమును స్ఫురించు విధముగను నతి గాంభీర్యముగ నమరినట్లు వెలసియున్న పాండవదూతయగు శ్రీకృష్ణుని

వైభవము నత్యంత ప్రశస్తముగా నాళ్వార్లు మంగళాశాసనము జేసి యున్నారు. ఈ యాలయమున వెలసియున్న శ్రీ రుక్మిణీదేవియమ్మ వారత్యంత వరప్రసాదినియై భక్తులచే గొలువబడుచున్నది.

కంచిలోని పాండవదూత దేవాలయమున బాద్రపద మాసమున శ్రీకృష్ణజయంతి ప్రారంభమున పది దినములు బ్రహ్మోత్సవము, కార్తీక మాసమందు భరణి నక్షత్రమున శ్రీయరుళాళప్పెరుమాళెంబెరుమానారన బరగు శ్రీ వింజమూరిస్వాములవారి జయంతి శాత్తుముఱై యుత్సవము. దీపావళి పండుగ దినమునను, ముక్కోటి ఏకాదశి రోజునను నడచు గరుడోత్సవము శోభాయమానముగ జరిపింపబడుచున్నవి.

ఆశ్రిత రక్షణయే కర్తవ్యమై శరణుజొచ్చినవారి యోగక్షేమ ములను నిర్వర్తించుట తన బాధ్యతయని ప్రకటించిన భగవంతుడగు శ్రీ కృష్ణుని గీతయందలి చరమశ్లోకానుసారము శరణాగత రక్షకుడై కంచిలో వెలసియున్న శ్రీ పాండవదూతుని పాదారవిందములే శరణని నమ్మి యాశ్రయించి సేవించువారికి సకల సౌభాగ్యములు సంప్రాప్తమై క్షేమము గల్గును.

—/—

# మామిండి నీడను మాదేవుడు

(ఏకామ్రనాధుని యాలయము)

పంచభూతలింగ క్షేత్రములతో పృథ్వీలింగ క్షేత్రముగ( బ్రసిద్ధి జెందిన పుణ్యస్థలము, తుండీర మండలమందలి దివ్యక్షేత్రమై, తమిళ దేశమున విరాజిల్లు పవిత్ర యాత్రాస్థలమగు కాంచీపురము, సర్వవ్యాపియై, సర్వమునకు కారణమై, సర్వమును తన సంకల్ప మాత్రమున సృజించి, కరుణచే రక్షించి సర్వము తానేయైయుండు సర్వేశ్వరుని సర్వజ్ఞత, సర్వవ్యాపకత, సర్వశక్తత, సర్వసౌలభ్యత, సర్వరక్షకతలు ప్రకృతియొక్క యంశము లన్నిటియందును ఇమిడియున్న సత్యమును నిరూపించు విధమున, ప్రకృతి స్వాభావికములైన పంచభూతములందు ఈశ్వరశక్తి నిబిడీకృతమైయున్నదనుటకు సంకేతముగ నేర్పడిన దివ్యస్థలములు, పంచభూత క్షేత్రములనియు, పంచలింగ క్షేత్రములనియు, పంచలింగేశ్వర క్షేత్రములనియు పురాణ ప్రసిద్ధి జెందియున్నవి.

పృథివ్యప్తేజోవాయ్వాకాశములు—(పృథ్వి, అప్, తేజః, వాయు ఆకాశములు)—"పంచభూతము"లనబడును. నేల, నీరు, నిప్పు, గాలి; గగనములు అను పంచభూతముల స్వరూపము తానే అయిన పరమేశ్వరు(డై దు శివక్షేత్రములందు భక్తుల( గాచుటకై వెలసియున్నట్లు పురాణవిదితము ఇవి పంచభూతక్షేత్రములని ప్రసిద్ధి(జెందియున్నవి. తమిళదేశమున తొండైనాడనబడు తుండీరమండలమున సత్యవ్రతక్షేత్రమనియు, ప్రళయజిత్తనియు, తిరుకచ్చియేకంబనియు ప్రసిద్ధమై, చెంగల్పట్టుజిల్లా ప్రధాననగరమైదనరు కాంచీపురము పద్వక్షేత్రముగను, తిరుచ్చిరాపల్లి యందలి తిరుయానైక్కోవిలనబడు 'జంబుకేశ్వరము'

అంబులింగక్షేత్రముగను, జలక్షేత్రముగను, ఉత్తర ఆర్కాడుజిల్లా యందలి తిరువణ్ణామలై యనబడు 'అరుణాచలేశ్వరము' జ్యోతిర్లింగ క్షేత్రముగను, అగ్నిక్షేత్రముగను, ఆంధ్రప్రదేశమందలి, చిత్తూరుజిల్లా, లోని 'శ్రీకాళహస్తి' వాయుర్లింగ క్షేత్రముగను. వాయుక్షేత్రముగను తమిళదేశమందలి దక్షిణ ఆర్కాడుజిల్లాలోని తిల్లైయంబలమను సుప్రసిద్ధ శివక్షేత్రమైన చిదంబరమునందు చిత్సభయందు చిదాకాశరూపమున సదాశివుడు ఆనందతాండవ మొనర్చునట్లు భావింపబడుటచే నాకాశ క్షేత్రముగను పరిగణింపబడుచున్నవి. ఇందు పృథ్వీక్షేత్రమగు కాంచీపురమున పరమేశ్వరు డేకామ్రేశ నామకుడై సైకతలింగరూపమున వెలసియున్నాడు రుద్రశాలయనియు, రుద్రకోటియనియు, మహా శ్మశానమనియు, భూకైలాసమనియు, ఏకామ్రమనియుఁ బిలువబడు ఏకామ్రేశ్వరుని యాలయము కాంచీపురమునందలి వాయువ్య భాగమున నున్న పవిత్ర స్థలము.

పూర్వము కైలాసమున నొకప్పుడు శివుడు భోగమూర్తియై యంబికతో నర్థాసనమున నమరియున్న సమయమున లీలావినోదముగా నీశ్వరుని నేత్రముల నీశ్వరి దన రెండుచేతులతో మూసివేసెను. అంత ఈశ్వరుని నేత్రములై యొప్పుచుండిన సూర్యచంద్రుల ప్రకాశము మరుగువడ లోకములందు జీగటిగప్పి ప్రాణులకు సంకటముగల్గునట్లయ్యెను. ఆ ఆపదను గుర్తించిన ముక్కంటియగు మహేశుడు ప్రాణులయందలి పరమకారుణ్యముచేత నగ్నినేత్రమగు తన మూడవ కన్నును దెఱచి లోకములకు ప్రకాశమును గల్గజేసి కాపాడెను. అంబిక యొక్క యనాలోచిత చర్యచే జగంబెల్ల నష్టంబడు నాపద వాటిల్లుటం జేసి పాపము సంభవించెను. జఱిగినదెఱింగి పశ్చాత్తాప్తయైన, మహాదేవి తన యపరాధమును మన్నించి కరుణింపుమని మహాదేవుని వేడెను. వేడుకకై చేసినను, క్షణకాలము జీవరాసులకు శ్రమ గల్గించినందులకై

జగదంబికను ప్రాయశ్చిత్తార్థము భువిలో తపమాచరింపుమని మహే శుడు నిర్దేశించెను. జగన్నాయకి తన నాయకుని ధర్మచింతనకు తల యొగ్గి భూమికి నాభిస్థానమై యొప్పు సత్యవ్రత క్షేత్రమగు కాంచీపుర మున తపమాచరింపనెంచి కైలసమునుండి వెడలి బదరి కాశ్రమమున కరుదెంచి యందొక శిశురూపమున నుండెను.

పుత్రాపేక్షతో బదరికాశ్రమమునందు తపమాచరించుచున్న బ్రహ్మ వేత్తయగు కాత్యాయన మహాముని శిశురూపధారిణియగు జగదంబికను గాంచి పరమానందభరితుడై తన యాశ్రమమునకుదెచ్చి యతిప్రేమతో బెంచసాగెను. అందుచే నంబికకు కాత్యాయని యనుకారణ నామ ధేయముగల్గెను. కాత్యాయని బాల్యమునందినంతనే జగదంబికయొక్క యవతార కారణము నెరిగిన వాడగుటచే కాత్యాయనముని యా బాలికకు యోగదండము, జపమాల, దీపస్తంభము, దీపాధారంబగుఘటద్వయము, పులిచర్మము, పుస్తకము, వేయించినపెసలు, గంగాతీర్థము, గంగాతీరపు టిసుక, గొడుగు, విసనకఱ్ఱ, చామరద్వయము మొదలగువాని నొసంగి దక్షిణదిశకుజని సత్యవ్రతక్షేత్రమున నీశ్వరునిగూర్చి తపంబొనరింపు మని యాదేశించి సత్యవ్రతక్షేత్రమగు కాంచీపురమును గనుకొనుటకై కొన్నిగుర్తులనుజెప్పి మంగళనాయకికి మంగళంబగునట్లు దీవించి సాగ నంపెను.

బదరికాశ్రమమునుండి బయలుదేరిన కాత్యాయిని తన కామితార్థ మీడేరుటకై కంచికరుదెంచెను. అంత కాత్యాయనముని యెఱిగించిన గుర్తుల ప్రకారము వ్యాఘ్రాసనము సోమవృత్తముగను, కుంభము ఆధారపీఠముగను, రుద్రాక్షమాలిక బిల్వపుమాలగాను, ఛత్రము నాగా భరణముగాను, యోగదండము త్రిశూలముగను, పుస్తకము కామధేను వుగను, విద్యాధరము సూదిగాను, వేయించినపెసలు మొలకలతో గూడినవయ్యెను. రూపాంతరమును బొందుటచే మహిమాన్వితమైన

యా దివ్యస్థలము సత్యవ్రతక్షేత్రమగు కాంచీపురమనియెఱింగి యచట నాల్గువేదములు నాల్గుశాఖలై వెలసియున్న మామిడిచెట్టునీడను గంగా తీరపుటిసుకలో నొకలింగమునుజేసి దనకండయైయుండిన స్త్రీల నిర్వురిని కావలియుంచి పంచాగ్ని రగిల్చి దాని నడుమ సూదిమొనపై నిల్చి పర మేశ్వరుని ధ్యానించి తపమాచరింపసాగెను.

కంచిలో తపమాచరించు చుండిన యీశ్వరియొక్క భక్తివిశిష్టత వెల్లడియగునట్లనుగ్రహించు సంకల్పముతో, తపోనిష్ఠను పరీక్షించు నెపమున సదాశివుడు తన జటనుండి గంగనువదలి యీశ్వరి తపః ప్రదే శమునకుబోయి యత్యంత భీకరమై భీతిని గల్గించునట్లొనర్చెను. తప తపస్సున కంతరాయము గల్గించు విధమున నతిభీకరమై వచ్చుచుండిన ప్రవాహ వేగమునుగాంచి కంపితురాలైన కాత్యాయిని "కంప, కంప"— భయము, భయముగా నున్నదని కంపించుటచేత నీ ప్రవాహమునకు 'కంపానది' యను పేరుగల్గినది. అతి భీకరమై వచ్చుచుండిన ప్రవా హవేగము నడ్డుకొని యాపుజేసి తోడ్పడవలసినదని కాత్యాయని తన కండయై యుండిన శక్తులిరువురిలో నొకతె నాజ్ఞాపించెను. అంత నా దుర్గ యతివేగమున వచ్చుచుండిన ప్రవాహమున కెదురునిల్చి తన చేత నుండిన "విశ్వభక్షణ" సంజ్ఞకంబగు కపాలమునందా ప్రళయజల ప్రవాహ మిఱ్ఱింకులు చేసెను. అందుచే నాయీశ్వరి దూతికకు 'మహా ప్రళయబంధిని' (ప్రళయముగాచినమాత) అనుపేరు గల్గెను.

ప్రళయ జలప్రవాహము దూతికాకపాలస్థితమగుటచే భంగపాటు నొందిన పరమశివుడు తనలీలను కొనసాగింప నిశ్చయించి, యంతకు పూర్వముకన్న భయంకరమైన జలప్రవాహము నా కపాలమునుండియే వెలువడునట్లు జేసెను. కపాలోత్పతిమగు మహాప్రళయ నదృశమైన ఆ జలప్రవాహమును మహాప్రళయబంధిని మరల బంధింప- సమర్థు రాలుగాకుండెను.

మహాభయంకరమై తన కెదురై వచ్చు మహా ప్రవాహమును గాంచిన మహాదేవి తనకు తోడ్పడి ప్రవాహభయమును బాపుమని యాపద్బాంధవుడను బిరుదువహించిన తన సోదరుడగు మహావిష్ణుని ప్రార్థించెను. ఈశ్వరి భయమును దోగొట్టి యభయమొసగ సంకల్పించిన శ్రీహరి నేలను దాకియున్న పాదంబులతోడను, ఆకాశమునంటుచున్నట్లున్న కిరీటముతోడను నిల్చి చంద్రరేఖ తనకంఠమున ప్రకాశింప మహారూపమును ప్రదర్శించి చంద్రకంఠుడై ప్రవాహమున కెదురు నిల్చెను. ప్రవాహరూపముననున్నది చంద్రశేఖరుడేయని తన సోదరియగు యీశ్వరి నుద్దేశించి, "విష్ణువు, నీ తపస్సును శోధించుటకై చంద్రశేఖరుడు సహస్ర ముఖసమేతమైన జలప్రవాహమును గల్గించెను. కాన మహాదేవుని శరణుజొచ్చి, నీ దృఢభక్తిని ప్రదర్శించి సఫలమనోరథవు గమ్మ" అని తెలియజెప్పెను తన చింతదీర చక్కని మార్గ మెఱిగించిన చంద్రగ్రీవుడైన చక్రిని మనమారగొనియాడిన ఉమాదేవి తాను గొల్చుచుండిన సైకతలింగము నీటగఱిగి పోకుండునట్లనకట్టవలె తన యిరుకరంబులతో నాలింగనము జేసికొని కవచంబువోలె తనగౌగిట గప్పి భయభక్తులు పెల్లుబుక తన్మయత్వము నొందియుండెను. కాత్యాయని వక్షస్థల కర కంకణంబులచే నొక్కువడి పులకాంకితుడైన పరమశివుడు ఉమాదేవికి సాక్షాత్కరించి మన్నించి యర్ధాసనంబొసగి యాదరించి కటాక్షించి కాత్యాయని కామితమీడేర జేయుటచే నీశ్వరుడు కామేశ్వరుడయ్యెను. పరమశివుని పాదఘాతమున కంపానది భూమిలోపలకు బోయి యంతర్వాహినియై ప్రవహించి సర్వతీర్థమున గలిసెనని ప్రతీతి. ఉమాదేవి కౌగిటనుండిన సైకతలింగము సుకరంబై యుండెను. కామేశ్వరుని కటాక్షమున కామితఫలదయైన కాత్యాయిని కామేశ్వరియయ్యెను. కంచిలో రసాల వృక్షమూలమున సైకతలింగరూపంబున ఉమాదేవిచే గొలువబడిన శివుడు ఏకామ్రనాధుడై వెలసివిరాజిల్లు చున్నాడు.

"ఉమాలింగన సంక్రాన్త కుచకంకణముద్రితమ్।
లింగమేకామ్రనాథస్య. సైకతం సముపాస్మహే॥"

"ఏకామ్రం"—'ఏక'—ఏకాకియై, తనకుతానై, తానుమాత్రమే నెలకొని నిల్చినట్లొకే యొక్క; ఆమ్రము—చూతవృక్షము, రసాలము మామిడి—తానొకటి మాత్రము నెలకొని నిల్చియున్న మామిడిచెట్టు—ఒకేయొక్క మామిడిచెట్టు అని యర్థము, ఏకామ్రేశుడు—తానొక్కడేయై నిల్చిన వేదస్వరూపమగు మామిడినీడను వెలసిన యీశ్వరుడని సంకేతము. మామిడినీడను మహాదేవుడు, చూతనాథుడు, ఏకామ్రనాథుడు, ఏకామ్రేశుడు, ఏకామ్రేశ్వరుడు, కచ్చితిరుయేకంబన్ అన బరగు నీయీశ్వరుని మహిమను సమయాచార్యులు నలువురును గీర్తించి పాడియున్నారు.

ఉమావశంగతుడైన పరమేశ్వరుని సందర్శించిన నంది ప్రభృత రుద్రగణంబులు, దేవముని గణంబులు పరమానందమునొంది యాయాది దంపతులను వివాహశోభతో సందర్శింపవలెనను కోరిక విన్నవించి తమ యీప్సిత మీడేరు నట్లనుగ్రహింపుమని పరమేశ్వరుని ప్రార్థించెను. భక్తవశంకరుడగు శంకరుడు ఉమాదేవి పాణిగ్రహణ మొనర్చి ఉమా శంకరుడై సాక్షాత్కరించిన పుణ్యదినము కృతయుగమున భవ సంవత్సరము ఫాల్గుణమాసము శుక్లపక్ష పౌర్ణమినాడు సంభవించినట్లు పురాణములందు జెప్పబడియుండుటచే కంచిలోని యేకామ్రేశుని యాలయమున ఏటేట జఱుగు బ్రహ్మోత్సవములలో ఫాల్గుణమాసమున పూర్వఫల్గునీ నక్షత్రయుక్త శుభదినమందు పరిమళకుంతల నామక ఉమాదేవికిని ఏకామ్రేశునికిని కళ్యాణోత్సవము వైభవముగా జఱిపించబడుచున్నది.

పశుపతిని పతిగాబడయ గౌరి కాంచీపురమున తపమాచరించిన ఉమాదేవి శ్రీ కామాక్షియే యనియు, శ్రీ కామాక్షియే పరిమళకుంతల

నామక కామేశ్వరియనియు నెంచబడుటయే పరిమళకుంతలను పరిణయమైన యేకామ్రనాథుని, శ్రీ కామాక్షీసహిత శ్రీ యేకామ్రేశ్వరుడని ప్రస్తుతించుట పాడుకలోనున్నది.

పృథ్వీలింగముగ కాంచీపురమున వెలసియున్న యేకామ్రేశుని మహిమ పురాణములందు విశేషముగ బ్రస్తుతింపబడియున్నది. "ఉమా సమాలింగన సంక్రాంత కుచకుంకుమ కరకంకణ ముద్రాముద్రితంబును, సైకతంబునునగు నేకామ్రేశునిలింగమని" మార్కండేయ మహాముని చే గొనియాడబడిన యేకామ్రేశుని ప్రభావము కాంచీపురమున సవిస్తరముగ వర్ణింపబడి యున్నది. శైవసమయాచార్యులలో నాల్వురని బ్రసిద్ధికెక్కిన 'తిరుజ్ఞానసంబంధర్', 'తిరునావుక్కరసర్' అనబడు అప్పర్ స్వాములవారు శ్రీ సుందరమూర్తి నాయనారు, మాణిక్యవాచక స్వాములవారు 'కచ్చియేకంబ' రనబడు ఏకామ్రేశ్వరుని వైభవమును వినుతించి పాడియున్నారు. పట్టణత్తారని ప్రసిద్ధిజెందిన సిద్ధపురుషునిచే గీర్తింపబడిన ఘనత కంచి యేకామ్రనాథునికి గల్గుట మఱొక విశేషము.

సంగీత త్రిమూర్తులలో నొకరగు శ్రీ ముత్తుస్వామిదీక్షితులవారి పంచలింగేశ్వర కృతులలో కంచి యేకామ్రనాథుని మహిమా గరిమ, యతి రమ్యముగా గీర్తింపబడియున్నది. సోమస్కందమూర్తియై సచ్చిదానందమును గల్గించు నాయకుడైన సదాశివుడు భువినిగాచి రక్షించు పరమ కారుణ్యముచే పృథ్వీలింగమై కంచిలో వెలసియున్నాడు. ఆయేకామ్రనాథుని ప్రభావము దీక్షితులవారి "చింతయ—మాకందమూలకందం" అను కృతిలో నత్యద్భుతముగ వర్ణింపబడి యుండుట దెలియనగును.

పృథ్వీలింగమై కంచిలో వెలసియున్న యేకామ్రనాథునియాలయ సంబంధమైన వివరములు కాంచీపురాణము, పెరియపురాణము, మణిమేఖల, మత్తవిలాస ప్రకరణము, శ్రీకామాక్షివిలాసము మొదలగు

గ్రంథములనుండి లభ్యమగుచున్నవి. పురాణములను జదివి దెలిసి కొనజాలని పామరులు సయితము ఏకామ్రనాథుని మహిమను సులభముగ గ్రహించి భక్తిపరవశ మొందునట్లు లలితమైన శైలిలో కంచి కోటప్పనాయకునిచే తమిళమున రచింపబడిన సుందరతర జానపద గేయములు పామరజనరంజకమై "కచ్చియేకంబన్ కైశిలంబుపాటలు" అను పేర ప్రసిద్ధి నొందియున్నవి.

పురాణప్రసిద్ధితోబాటు చరిత్ర ప్రసిద్ధిజెందిన కంచి యేకామ్రేశ్వరుని యాలయము శ్రేష్ఠమైన శిల్పకళానైపుణ్యమును బ్రదర్శించు శిల్పములతో నిండి శిల్పకళా నిలయమై శోభిల్లుచున్నది. కాంచీపురము నందున్న యాలయములలో నత్యున్నత గోపురముతోగూడి, యతివిశాలమైనది యేకామ్రేశ్వరుని యాలయము. ఈ యాలయ రాజగోపురము సుమారు 58 మీటర్లు లేక 192 అడుగుల యెత్తుగల్గి తొమ్మిది యంతస్థులతోగూడి యున్నది. గంభీరమగు నీ గోపురరాజము విజయనగరము నేలిన శ్రీకృష్ణదేవరాయలచే 1509 వ సంవత్సరమున నిర్మింపబడినది. మద్రాసు నుండి పూందమల్లి, శ్రీపెరుంబూదూరు మార్గమున కంచికి వచ్చు యాత్రికులకు గగనమునంటు చున్నట్లు గన్పట్టు నీ రాజగోపురము దూరమునుండియే దర్శనీయమై యున్నది.

ఏకామ్రనాథుని యాలయ రాజగోపురమున కిరుప్రక్కల నతి గంభీరమైన గణపతి, కుమారస్వాముల సన్నిధులుగలవు. గోపుర గణపతిని గొలిచి లోనికిఁ జనినంతనే శరభేశమంటప మనబడు వాహనాలంకార మంటపముగలదు. ఇది నవరాత్రి మంటపమనియు పేర్కొనబడుచున్నది. రాజగోపురమును దాటినంతనే తొలిప్రాకారమున వేయి కాళ్ళమంటపము గానబడును. వెయ్యికాళ్ళ మంటపమునకు వెళ్ళుమార్గమున ప్రస్తుతము కోనేటివలె గనుపించు కంపానదిని దర్శింపనగును. కోనేటివలె గనుపించినను, ఇచటి కంపానది ధరాంతర్వాహినియై భూమి

కడుగున ప్రవహించుచున్నట్లు ఎంచబడుచున్నది. ఈ నదీతీరముననే జగదంబిక తపమాచరించినట్లు పురాణము వెయ్యికాళ్ళ మంటపము ముందున్న వికటచక్ర వినాయకుడు శ్రీ కాంచీక్షేత్రపు స్థలవినాయకుడు. విష్వక్సేనుడు తన వికటముచే నీ వినాయకుని మెప్పించి చక్రబలమును బడయుటచే నీ వినాయకునికి వికటచక్ర వినాయక నామధేయము గల్గి నట్లు ప్రతీతి. తమిళదేశమున జంటకవులని ప్రసిద్ధిజెందిన యాసు కవులుబాడిన ' తిరువేకంబనాధర్‌వులా ' లను చాటు పద్యమూలికయందు ఈ వికటచక్ర వినాయకుని ప్రశంసించి యుండుట దెలియనగును.

ఏకామ్రనాధుని యాలయ ధ్వజస్తంబము ప్రక్కన కచ్చిశ్మశాన మనబడు సన్నిధిగలదు దానికి ముందు భాగమున దాతపచ్చెయప్ప ముదలియార్ మంటపమనబడు కళ్యాణమంటపము గలదు, ఏకామ్ర నాధుని యాలయసరిహద్దులలో నాల్గువైపులనున్న సన్నిధులు తిరుకచ్చి శ్మశానము, వాలీశము, ఋషభేశము, సత్యనదీశమనబడునవి. ఆలయ మందున్న ప్రధానపుష్కరిణి శివగంగ తీర్థమనబడుచున్నది. ఈ పుష్క రిణిగట్టునగల యత్యున్నతమైన నందీశ్వరుని దర్శించి యాలయమునఁ బ్రవేశింపగనేఁ యెత్తైన స్తంబములను, వానియందుఁ జెక్కబడియున్న శిల్పములును నేత్రానందకరమై శ్రేష్ఠమైన శిల్పకళా నైపుణ్యమును బ్రదర్శించు చున్నవి. వానియందొక స్తంబమున నలలాడు కైలాస మున పరమేశ్వరుని నేత్రములను ఈశ్వరి, దన రెండుచేతులతో మూసి నట్లు జెక్కబడియున్న శిల్పము, దానికెదురుగానున్న స్తంభమందు శంకరుడు ఈశ్వరి తపమునకు మెచ్చి సాక్షాత్కరించిన ఉమాశంకరుల కళ్యాణ శిల్పము అత్యంత రమణీయమై శిల్పుల కళా కౌశలమును బ్రకటించుచున్నవి.

ఏకామ్రేశుని యాలయ ప్రథమ ప్రదక్షిణ ప్రాకారంబున ప్రళయ కాల జలప్రవాహమువలె భీకరమైవచ్చిన కంపానదీ ప్రవాహమును తన

చేతియందలి కపాలమున నరికట్టిన "ప్రళయబంధిని" యనబడు శక్తి సన్నిధియు, దానినంటినట్లున్న మంటపమునందు అద్దాలగదిలో సోమా స్కంద రూపమున వేంచేయబడియుండు ఉత్సవ విగ్రహములు దర్శ నీయములై యున్నవి. ఈ మంటపమునంటినట్లు ఇచట స్థల వృక్షమగు మావడి యనబడు మామిడి వృక్షము గలదు. నాల్గువేదములను నాల్గు శాఖలుగాగల్గిన యీ మామిడినీడను మహాదేవి యిసుకతో లింగమమర్చి మహాదేవుని బూజించినట్లు పురాణములందు బ్రశంసింపబడి యున్నది. అరవై యడుగుల యెత్తుగల యీ రసాలము 3500 యేండ్లకు ముందటి దనియు, అంతకుమించి ప్రాచీనమైనదనియు, మున్ను ప్రళయకాలమున జలప్రవాహమున జిక్కుకొనిన మార్కండేయునికి ఆధారమై సాక్షాత్ పరమేశ్వర స్వరూపమై శోభిల్లినదీ దివ్యవృక్షమనియు, దీని నాల్గు శాఖల నుండి నాల్గు విధములైన భిన్నరుచులుగల ఫలములు ప్రాప్తించు చున్నవనియు జెప్పబడుచున్నది.

పూర్వము ప్రళయకాలంబున నిలువ నాధారములేక తల్లడిల్లు చుండిన మృకండునందనుని గాపాడనెంచిన దయామయుడగు శంకరుడు చిద్రూపుడై యవ్యక్తతేజంబున చూత బీజాకారంబు ధరించి యాబీజము నుండి నాల్గువేదములను శాఖలుగాగల్గి విరాజిల్లు మహిమాన్వితమైన మామిడిచెట్టునుత్పాదించెను. మహేశుని మహిమచేఁ బుట్టిన రసాలము ప్రళయ జలంబులను భేదించుకొని బహిర్గతమై మహావృక్షమయ్యెను. ప్రవాహముపైఁ గన్పించిన మామిడికొమ్మ నాధారముగాగొని యావృక్ష మధ్యంబుననుండి దిగి తన్మామల ప్రదేశంబునుజేరి యచట నా చూతవృక్ష ఫలంబుల భక్షించుచుండిన మయూరవాహనుండగు కుమారస్వామినిఁ జూచి సంభ్రమమునొంది స్తుతించి కుమారస్వామి మూలముగా నాప్రదే శము మహాదేవుని మహిమచే ప్రళయకాలంబునను విర్జలంబై భయ రహితమై యొప్పునట్టి ప్రళయజిత్తనబడు కాంచీక్షేత్రమని యెఱింగి

యేకామ్రవృక్షమై వెలసి యీశ్వరుని దయార్ద్రహృదయమును గొని యాడి ధన్యుడయ్యెనని పురాణవిదితము.

"శివబీజ సముద్భూతం, వేదశాఖాభిరుజ్జ్వలమ్ ।
మృకండు తనయాధారం రసాలం తంనమామ్యహమ్ ॥

శంకరాత్మకంబగు నీ మామిడినీడను పరమశివుడు సోమాస్కంద రూపమున చిన్ముద్రతో నాసీనుడై యుండుట దర్శనీయము. ఈ సోమా స్కందుని పీఠమునకు దిగువ తపః కామాక్షిబింబము, లింగోద్భవుడు, దానిప్రక్కన శ్రీకామాక్షీదేవి సైకతలింగము నాలింగనమొనర్చనట్లున్న మామిడిచెట్టు ప్రక్కన "మామిడికందు" దనబడు కుమారస్వామిసన్నిధి పరిమళకుంతల యమ్మవారి సన్నిధి గలవు.

ఏకామ్రనాథుని యాలయములో ప్రాకారమున అనేకములైన శివ లింగములు ప్రతిష్ఠితములై యున్నవి. ఇందొకలింగమున వెయ్యిలింగము లిమిడియున్నట్లొక లింగము సహస్రలింగేశ్వర నామధేయముతో ప్రతిష్ఠి తమైయున్నది. నాయన్మార్లను యరువదిముగ్గురు శివభక్తవరేణ్యుల బింబములు, వారి యుత్సవమూర్తులు లోప్రాకారమున దర్శింపబడు చున్నవి. చిదానందమూర్తియై యానందనటనమొనర్చు నటరాజమూర్తి కిచట నొక సుందరమైన సన్నిధిగలదు. దీనికి ముందు బాగమున నవ గ్రహములు ప్రతిష్ఠింపబడి గొలువబడుచున్నవి. ఆలయ గర్భగృహ మున కభిముఖముగ పశ్చిమాభిముఖుడై నిల్చున్నరీతిని వెలసియున్న విష్ణుమూర్తి సన్నిధిగలదు చంద్రగ్రీవనామకుడైన యీ విష్ణుమూర్తి నిలాతుత్తుండప్పెరుమాళని తిరుమంగై యాళ్వార్లచే ప్రశంసింపబడి యున్నాడు. క్షీరసాగరమథన సమయంబున వెలువడిన విషజ్వాలచే సముద్రపుటడుగుననుండి తపించి బయల్వెడలిన నారాయణునికి హిత మగురీతిని తన శిఖనలంకరించియున్న చంద్రుని చల్లని కిరణములు మాధవుని మేనిపై బడునట్లనుగ్రహించుటంజేసి విష్ణుమూర్తికి తాపోప

శమనముగల్గిన కారణముననుఁ, పిదప ఉమాదేవి తపమును పరిశోధించు నిమిత్తము తన జటాజూటమునుండి గంగను వెలువడజేసి మహాప్రళయమువలె బంపినపుడు తనసోదరియగు ఉమాదేవికి ప్రవాహభయమును బోగొట్టుటకై చంద్రకళ తన కంఠమునఁబడు చందమున మున్నతాకారమును ధరించి వరద నీటికెదురు నిల్చుటచేతను శ్రీమన్నారాయణుడు చంద్రగ్రీవుడనబరగెను. ఈ విష్ణుమూర్తిసన్నిధిని ప్రాచీనమైన విగ్రహముతోబాటు తర్వాతికాలమున దానిముందుగ బ్రతిష్ఠింపబడిన మరొక విగ్రహముగలదు. చంద్రకళాశోభిత కంఠుడనియు, చంద్రగ్రీవుడనియు స్తుతింపబడు నీ విష్ణుమూర్తి సన్నిధి తిరుమంగైయాళ్వార్లచే 'నిలాతుంగప్పెరుమాళని' మంగళాశాసనము జేయబడిన శ్రీ వైష్ణవ దివ్యదేశము.

గర్భగృహమున ఏకామ్రేశ్వరుడు సైకతలింగ రూపమునవెలసియుండి భక్తులచే గొలువబడుచున్నాడు ఆధారపీఠమునుండి యరటిపూవు నాకారమున నొప్పారు నీ శివలింగము మన్నుతోనైన లింగమగుటంజేసి యీ లింగమునకు వెండికవచము ధరింపబడి యున్నది. శివుడభిషేక ప్రియుడగుటచేతను, ఇచట వెలసియున్న శివలింగము సైకతలింగమగుటచేతను, ఇచటి శివలింగమునకుబదులుగా స్వామివారు వెలసియున్న యాధారపీఠమునకే యభిషేకము జరిపించుటయు, శివలింగమునకు పునుగు చట్టమును లేపన మొనరించుటయు వాడుకలోనున్నవి.

పురాణప్రసిద్ధిజెందిన ప్రాచీనమగు ఏకామ్రేశ్వరుని యాలయము పల్లవరాజుల కాలమున నభివృద్ధి చేయబడి విస్తరింప బడినందులకును వారిచే అనేక కైంకర్యములు జరిపింపబడినందులకును ఆధారములీయాలయమందలి శిలాశాసనములనుండి దొరకుచున్నవి. చోళ, పల్లవ, విజయనగరరాజుల కాలముననుఁ, పిదప నాంగ్లేయుల పరిపాలనమందు

1799 వ సంవత్సరమున చెంగల్పట్టు జిల్లాకలెక్టరుగా నుండిన హడ్సను దొరగారిచేతను, 1900 వ సంవత్సరమున నగరీకులనబడు నాట్టుకోట శ్రేష్ఠులచేతను, అనేకవిధముల నుద్ధరింపబడిన యీ యేకామ్రేశ్వరుని యాలయము సమీపకాలమున 1979 వ సంవత్సరమున శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శంకరాచార్య శ్రీ జయేంద్ర సరస్వతీ స్వాములవారి యనుగ్రహ బలముతోను, వారి బహుళ ప్రయత్నము చేతను జీర్ణోద్ధారణము గావింపబడి శ్రీయేకామ్రేశ్వరాలయ మహాకుంభాభిషేకము శ్రీ యాచార్యస్వాములవారి సమక్షమున నత్యంత వైభవముగా, జరిపింపబడినది.

శ్రీ యేకామ్రేశ్వరుని యాలయమున సంవత్సరమందలి పండ్రెండు మాసములందును విశేషోత్సవములు జరుగుచున్నవి. అందు ఫాల్గుణ మాసమున నడచు పంగుని ఉత్తరమహోత్సవము ఈయాలయ బ్రహ్మోత్సవము. బ్రహ్మోత్సవమందు నాల్గవనాటి రాత్రి సవారి జేయుచున్నట్లొప్పు వెండి వృషభసేవ ఐదవ దినమున పగలు "అధికారనందిసేవ" రాత్రి రావణేశ్వరుడు భుజములపై ధరించిన భంగి నొప్పారు వెండి కైలాస పీఠవాహనసేవ, ఆరవదినము ఉదయమున అరువదిమువ్వరు నాయన్మార్ల ఉత్సవము, ఆనాటిరాత్రి వెండితేరు, తొమ్మిదవనాటిరాత్రి అమ్మవారు శివలింగము నాలింగన మొనర్చుకొనినట్లున్న మామిడిసేవ, పదవనాటిరాత్రి పంగుని ఉత్తర కల్యాణ మహోత్సవము ప్రసిద్ధమైనవి. ఫాల్గుణ మాసము ఉత్తర నక్షత్రయుక్త శుభదినమందు జరుగు నీ కల్యాణమహోత్సవమందు పరిమళకుంతల నామకదేవికిని యేకామ్రేశునికిని జరుగు పరిణయ కాలమున నదేకళ్యాణ మంటపమునందు ఆయాదిదంపతులసమక్షమున నేకకాలమందు అనేకవధూవరులకు జాత్యం

తస్థుల వ్యత్యాసములేక వివాహము జరుగుట యిచటి ప్రత్యేకత. కంచిలోని యేకామ్రేశుని యాలయమున జరుగు నీ సమష్టి వివాహము మానవసమైక్యతకు మార్గదర్శియై యొప్పుచుండుట ప్రశంసనీయము.

ఏకామ్రేశ్వరుని యాలయమునకు వెనుక పశ్చిమమున 'పంజి పేట' యనబడు పత్తిపేట పెద్దవీధికొసను ఎడమవైపున 'ఓణకాంతన్ తళి' యనబడు దౌణకాంతేశ్వరుని యాలయము గలదు. జలంధరుని సేనానాయకులగు దౌణుడు, కాంతుడుననువారు ఈ శివునిపూజించి ఖడ్గ శూలమును బడసి ప్రఖ్యాతిగాంచి తరించుటచే నిచటవెలసియున్న శివుడు దౌణకాంతేశ్వరుడని బరగుచున్నాడు. సమయాచార్యులు నాల్వరిలో శ్రీ సుందరమూర్తిస్వామలీ దౌణకాంతేశ్వరుని గీర్తించి పాడి శంకరుని కరుణచే స్వర్ణమునుబడసిన సంభవము సుప్రసిద్ధము. శ్రీసుందరమూర్తి స్వాములవారిచే గీర్తింపబడిన దౌణకాంతేశ్వరుని మీద పాటలు 'పొన్ పెఱ్రపదిగం'—'స్వర్ణము బడసిన దశకమ' ని ప్రసిద్ధి జెందియున్నవి.

ప్రపంచమున జీవితమందు కష్టములు ప్రవాహమువలె వచ్చినను, భగవంతుని యందచంచల భక్తి విశ్వాసము లేర్పడినపుడు వాని నెదు ర్కొను ధైర్యముగల్గి కడతేర గల్గుటయు, ఎంచిన కార్యమును నిరాఘా టముగా నిర్వర్తించు సామర్థ్యమును బొందుటయు మనోబలము, కర్త వ్యాసురక్తి, కార్యసిద్ధి లభించుటయు నిక్కమని నిరూపించుటకై కంచిలో కాత్యాయిని తప మొనరించుట, పరమేశ్వరుడు ఈశ్వరి తప మును పరిశోధించుట, జగదంబిక నాయకునియందున్న భక్తితత్పరతను ప్రదర్శించుట. యేకామ్రనాధుడు పరిమళ కుంతలదేవి పాణిగ్రహణ మొనర్చుట మొదలైన సంఘటనలు యీశ్వర సంకల్పమున సంభవించె

భక్తవశంకరుడగు శంకరుని వాత్సల్యాతిరేకమును వెల్లడించునట్లయ్యెను. కంచిలో సైకతలింగమై వెలసియుండి యాశ్రితుల యందనలేని కారుణ్యముచే, వారి నెల్లవేళలఁ బ్రోచి గాపాడు ఏకామ్రేశ్వరుని కనులారసేవించి, మనసార నుతియించి నిర్మల చిత్తముతో గొల్చువారికి కష్టములు దొలగి సుఖము గల్గుటచే మనశ్శాంతి యేర్పడి యానందము లభించుచున్నది.

—/—



# కరుణించుమా తల్లి కంచినున్న కామాక్షి

శ్రీకరంబై శోభిల్లు సత్యవ్రత నామాంకిత పుణ్యస్థలమగు శ్రీ కాంచీక్షేత్రమున కరుణారస పరిపూర్ణయై శ్రీకామాక్షి యను పేర వెలసి యున్న పరాశక్తి ప్రపంచమందలి సకల జీవరాసులను సంరక్షించి నిజ భక్తుల వాంఛితములను తన కటాక్ష వీక్షణ మాత్రమున నీడేర్చజేసి దయ జూచిఁ గాపాడుచున్న శ్రీ కంచికామాక్షి కరుణావిలాసము పురాణ విదితము. శ్రీకామాక్షివైభవము మార్కండేయ పురాణమునందలి దేవీ మహాత్మ్యంబను యధ్యాయమునందును, బ్రహ్మాండ పురాణములోని లలితోపాఖ్యానము నందును, స్కంద పురాణములోని సనత్కుమార సంహిత యందును, కాంచీ పురాణమునందును వర్ణితమైయున్నది. మాతృప్రేమచే మనలనెల్లఁ గాపాడుచున్న తల్లియగు కంచి కామాక్షి శ్రీ లలితా త్రిపురసుందరియేయని యెంచబడి గొలువబడుచున్నది. శ్రీవిద్యాస్వరూపిణియగు శ్రీమహాత్రిపురసుందరియొక్క శక్తి స్వరూపిణుల బింబములలో శ్రీకంచికామాక్షీ మూల విగ్రహమొక్కటే శ్రీలలితా మహాత్రిపురసుందరి స్వరూపగుణ సంపూర్ణమైన బింబమై విరాజిల్లుచున్నదని యెంచబడుచున్నది.

అరువదినాల్గు శక్తిపీఠములలో ఓడ్యాణ పీఠమనబరగు జగన్నాధము, జాలంధరపీఠమనబడు జ్వాలాముఖి, కామరాజ పీఠమన ప్రసిద్ధమైన కాంచీపురము ముఖ్యమైనవి. ఈ మూడింటిలోను భూమికి నాభిస్థానమై యొప్పుచున్న శ్రీకాంచీక్షేత్రము శ్రేష్ఠమైనదని భావింపబడుచున్నది. పరాంబికయగు కామాక్షి తన దక్షిణ నేత్రమున బ్రహ్మను, వామనేత్రమున విష్ణువును కరుణజూచి తనకనుచూపుచే బ్రహ్మ 'కా' యను సరస్వతిని, విష్ణువు 'మా' యను లక్ష్మిని బడయునట్లను గ్రహించుటచే పరాంబిక కామాక్షియనబడుచున్నదనియు, లక్ష్మీసరస్వతు లిరుపక్కల నిల్చి చామరమువీచి సేవించుచుండ శ్రీకామాక్షీదేవి కాంచీపురమున కొలువై యున్నదనియు పురాణములందు ప్రశంసింపబడియున్నది.

'సచామర రమావాణి సవ్యదక్షిణ సేవితాయైనమః' యని శ్రీలలితా సహస్రనామ స్తోత్రమున నుతింపబడియున్నట్లు శ్రీ పరాంబికకు కుడివాగమున లక్ష్మీదేవియు, యెడమ భాగమున సరస్వతీదేవియు వింజామరలు వీచుచు సేవించుచున్నారనునది శ్రీకామాక్షిదేవిని సూచించుచున్నదని పెద్దల యభిప్రాయము. కరుణారసపూరితమైన తన కనుచూపుచే కోరివచ్చు వారికోర్కెల నీడేర్చుచున్న మహిమాన్వితమైన దేవి యగుటచే 'కామాక్షి' యనబడుచున్నది. ఐశ్వర్యమును గోరువారికి కోట్లకొలది గల్గజేసి యనుగ్రహించుటచేతను, భక్తుల యాశలను — 'కామమును' తన కనుచూపుచే — అక్షి వీక్షణచే పూర్తిజేయుటచేతను, పురుషార్థములందు తుదయున్నదగు — చతుర్థ పురుషార్థమగు మోక్షమును గల్గింపగల మహిమను బొందిన కన్నులు గలదగుట చేతను, కామితఫలమును పలురెట్లు అధికముగ కోట్లకొలది యనుగ్రహించుట చేతను కామకోటి కామాక్షియని కరుణనిండిన కన్నులతల్లి కంచికామాక్షిగా ప్రస్తుతింపబడుచున్నది. బిలాకాశ రూపమున శ్రీ కామాక్షి వెలసియున్న శ్రీకామకోష్ఠమునఁ జేయుధర్మము కోట్లకొలది యుత్తమ ధర్మఫలముల నొసగి భక్తులు కోరిన యాయాకామములను అనేకంబులుగ ననుగ్ర

హించి కరుణించు మహిమగల్గియుండుటచేతను 'కామకోటి' యనప్రసిద్ధిం జెందెను కాంచీపురమునకు మధ్యభాగముననున్న శ్రీ కామాక్షీదేవి వెలసియున్న దివ్యస్థలము "కామకోష్ఠము", కామకోటి, శ్రీపురము, భద్రము, జీవన్ముక్తిపురంమను నైదునామములను గలిగియున్నది.

శ్రీకామాక్షి యను పేర దేవియాలయములు మన దేశమందు ఉత్తరమునుండి దక్షిణమువరకు గల ప్రాంతమందు పలుచోట్లనుండుట కామాక్షితల్లి కరుణాతిరేకము యావద్భారతమున గీర్తించి గొలువబడు చుండుటనుండి విదితమగుచున్నది. అస్సాం రాష్ట్రమునందలి కామాఖ్యా యాలయము, వారణాసిలోని శ్రీకాశికామేశ్వరాలయమునందలి కామాక్షీ దేవిమందిరము, ఆంధ్రప్రదేశమునందలి నెల్లూరుజిల్లాలోని కోవూరు తాలూకా బుచ్చిరెడ్డిపాళెమునకు సమీపమున పినాకినీ నదీతీరమున వెలసి యున్న శ్రీ జొన్నవాడ కామాక్షీ అమ్మవారి యాలయము, మద్రాసు మహానగరమున రంకశాలవీధిలోని యేకామ్రేశుని యాలయమునందలి శ్రీ కామాక్షిసన్నిధి, మద్రాసుకు సమీపమున పూందమల్లికి ప్రక్కన నున్న '**మాంగాడు**' స్థలమున వెలసియున్న '**మాంగాడు కామాక్షి**' చెంగల్పట్టు జిల్లాలోని కాంచీపురమున కామకోష్ఠమున వెలసియున్న "కామకోటి కామాక్షి" యనబడు శ్రీ కంచికామాక్షి యమ్మవారి దేవస్థానము, తొలుత కంచిలో వెలసియుండి పిదప తంజావూరునకు వేంచేయబడిన తంజావూరులోని బంగారుకామాక్షి యనబడు స్వర్ణకామాక్షియాలయము, చెంగల్పట్టు, పాండిచ్చేరి, విళుపురము, విష్ణంపేట, కళ్ళప్పెరంబూరు, చెట్టికుళం, కడలూరు మొదలగు స్థలములందును, మాయవరమునకు సమీపముననున్న 'కరువాళక్కరై' యను స్థలమునను, పట్టుకోటకు సమీపముననున్న 'ఇళైయాత్రుమంగళం' యను చోటను, కుంభకోణము నందలి శ్రీ నగరేశ్వరుని యాలయమందును, తిరుచ్చిరాపల్లి, తూత్తుకుడి, కోయంబత్తూరు, రామేశ్వరములందును శ్రీ కామాక్షి దేవాలయములు భక్తులచే దర్శింపబడి యాయాప్రదేశములు ప్రార్థనా

స్థలములై విరాజిల్లుచున్నవి. అయినను "కామాక్షి" యనునంతనే వెంటనే దోచునట్టిదియు మన హృదయ ఫలకములందు ప్రతిఫలించు నదియు. శ్రీకాంచీపురమున కామకోష్ఠమునందు వెలసియున్న కామకోటి పీఠనివాసియగు శ్రీకంచి కామాక్షియేయన నది యతిశయోక్తి గాజాలదు.

సర్వలోకజనని యను సంబంధమే హేతువుగ తన్నాశ్రయించు వారికి దృఢభక్తిని గల్గజేసి భక్తియను నౌకచే సంసారసాగరమును దాటజేసి, దురితములబాపి శుభముల గలిగించునదియు, ఆశ్రితుల సుఖ జీవనమునకు హేతువై యుండి పిదప వారి మనసును పరిశుద్ధ మొనరించి చతుర్ధ పురుషార్ధమగు మోక్షమును బొందుటకై పరిపక్వమును గల్గించు నదియు, కామితార్ధ ఫలప్రదాయినియునగు శ్రీ కంచికామాక్షి కరుణాతి రేకమును, కృతయుగమున దుర్వాస మహాముని 2000 శ్లోకములందును, త్రేతాయుగమున పరశురాముడు 1500 శ్లోకములలోను, ద్వాపరయుగ మున ధౌమ్యముని 1000 శ్లోకములలోను కలియుగమున శ్రీమూక శంకరులవారు 500 శ్లోకములలోను ప్రశంసించి యున్నారు.

సర్వవ్యాప్తియై, సర్వము తానై, సర్వజీవరాసులను కరుణచే గాపాడుచున్న జగజ్జనని యగు పరాశక్తి పూర్వము దేవతలను అసురుల బాధలనుండి గాపాడుటకై ధర్మసంరక్షణార్ధము కాంచీపురమున సాక్షాత్క రించి వారిచే బూజింపబడుటతోబాటు మనమందరము గొలిచి తరించుట కనువుగను మనలనెల్ల కరుణించి మంచిమార్గమున నడిపించుటకును, తన్నాశ్రయించువారి కోరికలనెల్ల తన కనుచూపుచేతనే యీడేర్చి యను గ్రహించుటకునై కాంచీపురమున బిలాకాశరూపముననను, శ్రీచక్రరూపము నను, పాశాంకుశేక్షుకోదండ పుష్పబాణములను, పాశము, అంకుశము, చెఱుకువిల్లు, పూలబాణములను తన కరములందు ధరించి చతుర్భు జములతోను వెలసి శ్రీకామాక్షియనుపేర విరాజిల్లుచున్నదని పురాణ విదితము.

పూర్వము బంధకాసురుడను రాక్షసుడు ఘోర తపమాచరించి బ్రహ్మదేవుని మెప్పించి యనేకవరములను బొంది యతిబలాఢ్యుడై విజృంభించి ముల్లోకముల నాక్రమించుకొని యహంకారమున దేవతలనెల్ల పీడింపసాగెను. బంధకాసురబాధితులైన దేవతలు భీతచిత్తులై గత్యంతరము లేక స్వర్గమునుండి పలాయనమొనరించి విరించివరబలమున విఱ్ఱవీగుచుండిన బంధకునిబారినుండి తమ్ముగాపాడి కరుణించుమని పరమేశ్వరుని ప్రార్థించిరి. అనిమిషుల యాక్రందనము నాలకించిన పరమేశ్వరుడు బంధకాసురుని సంహరించగలశక్తి పరాశక్తికి మాత్రమేగలదనియు, ఆమెను ప్రసన్నురాలగునట్లు ప్రార్థించుట దక్క వేరుమార్గములేదనియు నెఱింగించి తన్నాశ్రయించిన వారిని ద్రోసిపుచ్చుట శరణ్యునికి తగదని యెఱిగిన వాడగుటచే వారిని అంతదనుక సురక్షితంబగు ప్రదేశంబున నుండజేయుట యుచితమని యెంచి దేవదూతలందరిని కైలాసమునకు ఉత్తరముననున్న గోముఖమునుండి బిలమార్గమునజని ప్రళయకాలమున సుస్థిరమైన సురక్షితంబైయుండు ప్రళయజిత్తన బరగు సత్యవ్రత నామాంకిత కాంచీక్షేత్రమునుజేరి పరాంబికను ప్రార్థించి బంధకుని బాధల నుండి విముక్తిబొందుడని యాదేశించి యనుగ్రహించెను.

భూమిని గోరూపమున నెంచుట పరపాటియైయుండుటజే భూమికి "గోముఖి" అనుక్షేత్రము ముఖముగను త్రిపురము శిరముగను హిమాలయము కంఠముగను కేదారము ఉదరముగను కాశి పృష్ఠభాగముగను కాంచి నడుముగను ఎంచబడుచున్నదనియు నడుమునకు నడుమ నాభియైయొప్పునది బిలద్వారమగు కామకోష్ఠమనియు శ్రీకాంచీక్షేత్ర ప్రభావమును వివరించి ప్రళయకాలంబున సుస్థిరమైయుండు సురక్షితంబగు నా దివ్యస్థలముననుండి పరాశక్తిని శరణుజొచ్చి రక్షణమువేడుట దక్క బంధక భయరాహిత్యమునకు మార్గాంతరము లేదని యెఱింగించిన పరమేశ్వరు నాజ్ఞను శిరసావహించిన దేవతలు బిలమార్గమున కాంచీపురము

నుజేరి బిలమునుండి వెలువడి యచటనుంచిన చంపకవృక్షముపై శుక రూపధారులై యుండి బలస్థితియగు మహాత్రిపురసుందరిని యభయము వేడి ధ్యానించుచుండిరి.

దేవతల ప్రార్థనలను వినిన పరదేవత ప్రళయకాల భీకరరూప మున బిలమునుండివెలువడి యష్టాదశభుజసహితయై చక్రాద్యష్టాదశా ధ్యాయుధములను ధరించి కైలాసమున నిదురించుచుండిన బంధకాసురుని గుండెలపై నొకపాదమును కంఠమున నొకపాదమునుంచి యతనిని సం హరించి యా యసురుని శిఖనుబట్టుకొని యతని శవము నీడ్చుకొనుచు కన్నికారూపమున బిలమున ప్రవేశించెను. అతిఘోరరూపుడైన బంధకుని శిఖనుబట్టుకొని బిలములోనికి లాగుచుండిన యైదేండ్ల కన్నికను గాంచిన దేవతలామెను తమ్ముగాపాడవచ్చిన పరదేవతయేయని యెంచి తమ శుకరూపములనువదలి నిజరూపములనుదాల్చి జయజయధ్వనులు గావించి యాదివ్యరూపమును దర్శించి, స్తుతించి సత్కరించుటకై సమీపించిరి.

భయంకరాకారుడైన బంధకుని శిఖను జేబట్టి కోపోజ్జ్వలితయై యతి భీకరంబుగ నుండిన కన్నికనుగాంచి దేవతలెల్ల భయకంపితులై మూర్ఛిల్లిరి. వారి భయమును బోగొట్టుటకై తన భీకరరూపము నుప సంహరించి యతి సౌందర్యరాశియై దివ్యాభరణాలంకృతయై మందస్మిత ముఖలావణ్యముతో దివ్యమంగళ స్వరూపమున సాక్షాత్కరించెను. మూర్ఛదెలిసిన దేవతలు ప్రసన్న వదనయగు కన్నికనుగాంచి పరాంబి కయే తమ్మారూపమున కరుణించి బంధకాసురునిబారినుండి విడిపించినదని గ్రహించి యామె దర్శనభాగ్యమున ధన్యులమైతిమని గొనియాడిరి. తన్ను నుతించిన దేవతల నుద్దేశించి తనచే వధింపబడిన బంధకుని శవము నచ్చోట బాతిపెట్టి దానిపై జయస్తంభమును ప్రతిష్ఠింపుడని యాజ్ఞాపించు టతోబాటు తన కచ్చోటనే బిలమున్నంతమేరకు నొకేద్వారముతోగూడిన

యాలయమును నిర్మించుమడని యాదేశించి పరాంబిక యదృశ్యురా లయ్యెను.

పరాంబిక యాజ్ఞానుసారము బంధకాసురుని శవమును పాతిపెట్టుటకై దేవతలచట నొక గుంటను త్రొవ్వనపుడచట భూమిలోపల ధ్యాన సమాధిలోనుండిన మల్లకుడను రాక్షసునిగాంచి యతనిచే తమకు కీడు వాటిల్లకుండునట్లు మల్లకుని సంహరించి తమ్మొగాపాడమని శ్రీహరిని వేడిరి. దేవతల ప్రార్థనల నాలకించిన నారాయణుడు మల్లకుని సంహరింప దలపడెను. దైత్యాంతకుడగు శ్రీహరి మల్లకుని సంహరించు సమయమున నతని దేహమునుండి వెలువడిన రక్తకణములనుండి యనేకులైన రక్కసులు జనియించి మహావిష్ణు నెదుర్కొనసాగిరి. రాక్షస సమూహముతో బోరాడుచుండిన చక్రికి సహాయపడనెంచిన పరమేశ్వరుడు తన జటను భూమిపై మోది రెండు భూతముల నావిర్భవింపజేసి వానిని మహావిష్ణునికి సహాయపడునట్లు వినియోగించెను.

పరమేశ్వరునిచే నియమింపఁబడిన యాడమగ భూతములు రెండును మల్లకుని శరీరమునుండి వెలువడిన రక్తము ద్రావి యసురవృద్ధి గాకుండునట్లుచేసి దోడ్పడుటచేతను శ్రీహరి రక్కసులను సంహరించుచుండ భూతద్వయ మారక్కసుల రక్తమును ద్రావి సహకరించుటచే రక్కసులు నిరవశేషులుగాగ శ్రీహరి మల్లకుని సంహరించుటకు వీల య్యెను. రక్కసుల రక్తపానముచే మదించిన భూతద్వయము మనోవైకల్యముగల్గి విష్ణుమూర్తి నెదుర్కొన దలబడెను తనమీదికివచ్చిన భూతముల మదమణచుటకై జనార్ధను మభూతద్వయమును నేలపై బడవైచి పాదములతో మట్టగించి వానిపై నిల్చుండెను. అంత భూతములజంట తమ బలమునంతయు నుపయోగించి తమపైనిల్చిన విష్ణుని క్రిందకు బడద్రోసి బాధింపసాగెను. తనతో పోరాడుచుండిన భూతముల మదమణంచుటకై వానిని మరల క్రిందబడవైచి యవి గదలకుండ నట్లు విష్ణువు

వానిపై గూర్చుండెను. ఎటులైనను పైకిలేవవలెనను యత్నమున గదలుచుండిన భూతములను గమనించిన పరంధాముడు వానిపై శయనించి యవి గదలకుండునట్లుజేసి వానిని మర్దించి వాని మదమణచెను. అందుచే విష్ణుమూర్తికి భూతబంధన జనార్ధనుడను పేరుగల్గెను.

మైకముదీరిన భూతములు తాము రాక్షస రక్తపాతమున మధించి మాధవునెదిరించి బాధించి నందులకు మిగులవగచి పశ్చాత్తాపము నొంది తమ యపరాధమును క్షమించి తామొనర్చిన యపచారమునకు తగిన ప్రాయశ్చిత్తము నెఱిగించి యనుగ్రహింపుమవి విష్ణుని వేడుకొనినవి. పరంధాముడు తామను పరమేశ్వరునిచే, తనకు సహాయమునకై పంపబడిన భూతములను క్రిందబడద్రోసి మర్దించి బాధించుటచేనైన శివభక్తాపచారమునకు పరితపించెను. పరంధాముడు శివభక్తాపచారమునకు పరితపించుటను గుర్తించిన పరమేశ్వరుడు తన జటనుండి గంగను వెలువడఁజేసి యచటనొక పుణ్యతీర్ధము నేర్పడఁజేసి యందా రెండు భూతములను, విష్ణుమూర్తిని తీర్ధమాడజేసి పరంధామునితో బోరాడిన పాపమునుండి భూతములు, భూతములను మర్దించి బాధించుటచేనైన శివభక్తాపచారమునుండి మహావిష్ణువు పరిహారము బొందుటకైన మార్గమును గలిగించి యనుగ్రహించెను. లోకపావనియగు గంగ పంచముఖుడగు పరమేశ్వరుని యైదుముఖములనుండి యైదుధారలుగా నుదయించి కామకోష్ఠమున బడుటచే నీపుణ్యతీర్థము పంచతీర్థ మనబరగెను. విష్ణుమూర్తి యా యాడు మగభూతములను రెండింటిని పంచతీర్థమునకు కావలియుండునట్లు ప్రతిష్ఠించి తాను నా భూతములకు నడమ తొలుత తానా భూతములతో బోరాడినపుడుండినట్లు నిల్చుండియు, కూర్చుండియు శయనించియు నుండిన చందమున మూడు భేదరూపములతో వెలసియుండి భూతబంధ జనార్ధనుడనబరగెను శ్రీ కాంచికామాక్షియమ్మవారి సన్నిధికి వెనుకవైపుననున్న యీ పంచతీర్థమున నీరాడి యీ భూత

బంధన జనార్ధనుని దర్శించువారికి పుత్రప్రాప్తి సిద్ధించునను విశ్వాసముతో భక్తులీభూతబంధన జనార్ధనుని గొలుచుట వాడుకలోనున్నది.

పరాశక్తి యాజ్ఞానుసారము బంధకాసురుని బూడ్చిపెట్టి యచట జయస్తంభముగ నొక ధ్వజస్తంభమును నిల్పి యచ్చటనుండి మహాబిలములకు బోవుటకొక మార్గమమర్చి దానికిదక్షిణమున నచటనుండి మహాబిలమున్నంత మేరకు చతుర్వేదములను వేదికగాను, యా వేదికకు మూడు ఖండములుగానున్న వ్యాహృతులతో గూడి త్రిఖండమగు నైన గాయత్రీ మంత్ర వర్ణములను స్తంభములుగాను ప్రణవమును పీఠము గాను జేసి ధ్యానయోగముచే గాయత్రీ మంటపమనబడు మంటపమును నిర్మించిరి. ఆ గాయత్రీ మంటపమునందు రత్న సింహాసనమున తాము గాంచిన కన్యకారూపమున దేవినావాహించి, పూజించి ద్వారములను బంధించి తామా మంటపమునకు ముందుండి రాత్రియంతయు దేవినామమును జపించుచు సూర్యోదయము దనుక వేచియుండి ప్రభాతకాలమున కవాటములు దెఱచి చూచునంత నచటవారిచే ముందురోజున బ్రతిష్ఠింపబడిన కన్నిం బింబమునకు బదులు శ్రీలలితా రాజరాజేశ్వరి తననిజరూపమగు మహాత్రిపురసుందరీ రూపమునుదాల్చి సింహాసనాసీనయై దివ్య తేజంబున వెలుగొందు చుండిన యత్యద్భుతమును గాంచి యాశ్చర్య చకితులై జయజయధ్వానములొనర్చి యనేకవిధంబులస్తుతించిధన్యులైరి.

గీర్వాణుల యిష్టార్థసిద్ధికై మహాబిలమునువదలి గాయత్రీ మంటపమునందు తన నిజరూపమున నావిర్భవించిన మహా త్రిపురసుందరి లోకకల్యాణార్థము కాంచీక్షేత్రమున వెలసియుండి కోరివచ్చు వారి కోరి కలనెల్ల తన కనుచూపుచే నీడేర్చు కరుణారసపరిపూర్ణయై కామాక్షియను పేర వెలసియుండి కాంచీపురాధీశ్వరియై భక్తులచే గొలువబడుచున్నది. అలనాడు శ్రీ కాంచీక్షేత్రమున గాయత్రీ మంటపమునందు రత్నఖచిత

సింహాసనమున అఖిలలోక జననియగు మహా త్రిపురసుందరి వెలసిన శుభదినము సావిత్రీనామక కల్పమున, స్వాయంభువమన్వంతరమున, కృతయుగమందు శ్రీ ముఖనామసంవత్సరమున ఫాల్గునమాసమున రవి కుంభరాశిగతుడై యుండు కృష్ణపక్షప్రథమ తిథియందు పూర్వఫల్గునీ నక్షత్రయుక్త శుక్రవారము నాడరుణోదయ కాలమున సంభవించెనని పురాణవిదితము.

గాయత్రీమంటపమున సింహాసన స్థితయై యుండిన పరాంబికకు దేవతలు పట్టాభిషేక మహోత్సవము జరిపింపనెంచి విశ్వకర్మ పల్లకిని, బ్రహ్మదేవుడు ముత్యాలజాలరును, నారాయణుడు నవరత్న ఖచిత కిరీటమును, పరమేశ్వరుడు సర్వరత్న సంశోభితమగు శ్రీచక్రపదకమును బహూకరించి దేవిని దివ్యాభరణములతో నలంకరించి మహోత్సవము చేయించి మరల పీఠముపై నిలిపి యాదేవి యచటనే శాశ్వతముగా వెలసి యుండవలయునని ప్రార్థించిరి. ఆ మహా త్రిపురసుందరియగు పరాంబికయే శ్రీకంచికామాక్షీ యనబరగి మననెల్ల తన చల్లని చూపులచే కరుణించి కాపాడుచున్నది.

కంచికామాక్షి కామకోటికామాక్షియైన వృత్తాంతము పురాణము లందు వివరింపఁబడి యున్నది. తారకాసుర సంహారనిమిత్తము శివ కుమారుడగు కుమారస్వామి యవతరింపవలసిన యావశ్యకతను గుర్తించిన దేవతలు ధ్యానసమాధిలో నుండిన శివుని మనసు పార్వతి వశమగు నట్లొనరించుటకై కాముని కైలాసమునకుఁబంపి శివునిమనసు రంజిల్లఁ జేయమని నియోగించిరి. మన్మథుని పుష్పబాణముల తాకిడికి చలించిన మహేశుడు పార్వతిపై మరులుగొనునట్లయ్యెను. తన మనసు చలించుటకైన కారణమరసి కోపించిన ముక్కంటి తన మూడవకన్నును దెఱచుటచే వెలువడిన యగ్నిజ్వాలలచే మన్మథుడు దహింపబడెను. తనపతి

భస్మీభూతుడగుట గాంచి దుఃఖించి రోదించుచుండిన రతీదేవిని గరుణింప నెంచిన పరమేశ్వరుడు మన్మధుని సజీవునిజేసి పరోక్ష దేహుండై యుండు నట్లును, యనంగుడై యుండియు రతీదేవికి మాత్రమతడు గోచరించు నట్లనుగ్రహించెను. తదుపరి యనంగుడగు మన్మధుడు ప్రత్యక్షదేహ లాభము నొందగోరి కామకోష్ఠమునకు వచ్చి యచట వెలసియున్న పరాంబికయగు కామాక్షీదేవిని నుతించి ప్రార్థించినంతనే శ్రీకామాక్షి కటాక్షవీక్షణమున ననంగునకు బ్రత్యక్ష దివ్యదేహము ప్రాప్తించెను తనకు బ్రత్యక్ష దేహము బొసగి యనుగ్రహించిన కామాక్షీదేవి ననేక విధముల స్తుతించి తన శరీరము జరామరణరహితమగునట్లును తన శరీరమునకై ప్రయోజనము హరుని జయించుటయే యగుటచే యందులకు దేవి తన పక్షముననుండి హరునిపై జాలిచూపక దనకు దోడ్పడి జయమును జేకూర్చి కరుణింపుమని వేడెను. కాముని కామిత మీడేరుటకై యతనికి దోడ్పడుట కిచ్ఛగించిన కామాక్షి పరమశివుడు మన్మధుని శరణువేడుదనుక యతని తాపము దీరకుండునట్లు జేయు నుద్దేశములో లీలావినోదముగ నొక సంఘటన ఏర్పఱుప సంకల్పించెను.

దేవీకటాక్ష లబ్ధబలముతో కాముడు కైలాసమునకుంజని శివునిపై పుష్పబాణముల వర్షింపసాగెను. తనపై సుమశరములను బ్రయోగించిన యిక్షుశరాసనుని గాంచి కోపోద్దీపితుడైన హరుడు మన్మధుని దహింపనెంచి తన మూడవకన్నగు యగ్నినేత్రమును దెఱచి నిప్పును బుట్టించెను, దేవి కటాక్షము కవచమై గాపాడుటచే శివుని నేత్రాగ్ని మన్మధుని దహింపదయ్యెను మారుగ నాయగ్ని మన్మధుని కిరీటమున రత్నమువలె బ్రకాశించి నిల్చెను. తననేత్రాగ్ని విఫలమగుటచే కైలాసాచలాధీశుడు ఇనుమడించిన కోపముతో మన్మధునిపై త్రిశూలమును, పాశుపతాస్త్రమును బ్రయోగించెను. దేవికటాక్షమహిమచే శివప్రయుక్తమైన త్రిశూలము మన్మధునికి పెక్కెముగను, పాశుపతాస్త్రము పూల

మాలగను నయ్యెను. తనచే ప్రయోగింపబడిన యాయుధములు వ్యర్థములగుటయేగాక విపరీతస్థితినిఁబొంది మన్మథు నలంకరించుటయు, మన్మథుడు నాశరహితుడై సుందరరూపమున సుఖముండుటను గాంచి సంభ్రమాశ్చర్యములునిండ కర్తవ్యము నాలోచించు సమయమున మన్మ థుడు పుష్పబాణములను శివునిపై వర్షింపజేయుటచే శివుడు కామాగ్ని పీడితుడై తాపోపశమనార్థము గౌరినిఁజేరుటకై తన మందిరములోనికిఁ జని చూడ, అందు గౌరిగనఁబడదయ్యెను. హరుని గర్వమును హరిం చుటకై పరాంబిక కైలాసాది స్థానములందు తన యంశతోనుండిన గౌరిమూర్తులనెల్ల తన చోటికాకర్షించి శివుని కెచ్చోటనో గౌరి గాన రాకుండునట్లుచేసి యూరకుండెను. మన్మథ తాపమునకు రాళఁజాలని శంకరుఁడు గౌరిని వెదకుచు క్షేత్రములనెల్ల దిరిగితిరిగి వేసారి కడకు కాంచీక్షేత్రమునకువచ్చి యందు కామకోష్ఠమున గౌరి సదృశ్య రూప ధారిణియై యుండిన కామాక్షినిఁగాంచి యా దేవి గౌరియని దలంచి తన తాపమును దీర్చుమని కోరి సమీపించెను. కామాతురుడైన కైలాసాధీశునిగాంచి కుపితురాలైన పరాంబిక తాను గౌరిగాదని యెంత జెప్పినను వినక విసిగించుటచే హరుని గర్వమణచుటకై కోటి మన్మథులను సృజించి శివుని బాధింపుఁడని యాజ్ఞాపించెను. శివుడును ఆ కోటిమన్మథుల నెదుర్కొనుటకై కోటిరుద్రులను గల్పించి వారితో బోరాడజేసెను. అయినను దేవీకటాక్షమున కోటిరుద్రులు పరాజితు లైరి. చివఱకేకాకియైన శివుని పంచబాణుడు జయించి దేవిసన్నిధికి దోడ్కొనివచ్చి భిక్షాపాత్రను తనచేతికిచ్చి బిచ్చమెత్తుకొనుమనిబలికెను. కామునకోడి పరాభవమునొంది యపరాధివలె తనముందు నిలుపబడిన పరమశివునికి తన నిజస్వరూపమగు మహా త్రిపురసుందరి రూపమున కామాక్షి దర్శనమిచ్చెను. దేవిచే సృజింపబడిన కోటి మన్మథులనామె తనలోనేకీభవించుకొనెను

మన్మథుని పుష్పబాణములైన తామర, యశోకము, చూతము, మల్లిక, నీలోత్పలములను ఐదువిధములైన పుష్పములను బాణముగను చెఱకు విల్లును తనకరమున ధరించి సింహాసనస్థితయై సాక్షాత్కరించిన పరాంబికను దర్శించిన శివుడు తన తొందరపాటుకు వగచి శ్రీ కామాక్షి కిని, ఆమెయందేకీభవించిన కోటిమదనులకును తలవంచి నమస్కరించి తన తావునకుఁబోయెను. దేవీకటాక్షమున మదనుడు శివుని జయించిన స్థలమగుటచే కాంచీపురమునకు శివజిత్క్షేత్రమను పేరు గల్గెను. కామునిచేఁ బూజింపబడుటచే కామాక్షి కామపూజితయనియు, కామసేవిత యనియు నుతింపఁబడెను. శివుని జయించిన మదనుని కామకోష్ఠమున నున్న పీఠమున కెదురుగ నాకాశమున నక్షత్ర రూపముననుండి తన్ను గొలుచుచుండుమని కామాక్షిదేవి యాదేశించెను. అందుచేతనే గ్రహ ములన్నియు వానినడిమి త్రోవను సంచరించక ప్రదక్షిణముగ సంచ రించుచున్నట్లు ఎంచబడుచున్నది. కోటిమదనులను తన యందేకీభ వించుకొనుటంజేసి కామకోష్ఠమున వెలసిన కంచికామాక్షి కామకోటి కామాక్షి యనబరగెను.

మన్మధుని యాయుధములగు నశోకము, మామిడి, మల్లిక, తామర, నీలోత్పలములను పుష్పబాణములను, ఇక్షుశరాసనమును తన చేత ధరించి సాక్షాత్కరించుటచే పరాంబిక 'సుమబాణేక్షుకోదండమండిత' యని స్తుతింపబడుచున్నది. భక్తులవద్దను, జ్ఞానులవద్దను తనచేతి వరుసను జూపింపవద్దని మన్మధునాజ్ఞాపించి శివుని జయించితి నను గర్వ మునణచుటకై యతని వద్దనుండి చెఱకు వింటిని పుష్పబాణములను పరి గ్రహించి మరు బారినుండి దప్పుటకు తన కటాక్షము సాధనమని ప్రక టించుటకై మన్మధుని యాయుధములైన యిక్షుకోదండ పుష్పబాణము లను తానే ధరించి దర్శనీయయై యున్నదని శ్రీకామాక్షి ప్రభావమును

శ్రీ కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శంకరాచార్య శ్రీ చంద్రశేఖ రేంద్రస్వాములవారు యత్యద్భుతముగ వర్ణించి దెలియజేసి యున్నారు.

బంధకుడు, మన్మథుడు రజోగుణసంపన్నులు, రజోగుణము రెండువిధములైన స్వభావము గలది. ఒకటి కామము; మరొకటి క్రోధము కామమనునది యాశకు సంకేతము, ఆశ నెఱవేరనపుడు క్రోధము సంభవించుట సహజము. కామక్రోధములు ప్రాణులకు నైజగుణములు. వానిని సంపూర్ణముగ నిర్మూలించుట కానిపని. ధర్మాచరణ కనుగుణముగా వాని నణచిపెట్టి యుంచుట యుక్తము. కామక్రోధముల నణచి యుంచుటకు కామాక్షి కరుణావిలాసమే సాధన మని దెలియుట వివేకము. రజోగుణము కార్యసాధన యందుద్రేక మును గల్గించు స్వభావము గలది. ఉద్రేకము తొట్రుపాటుకు కారణ మగుచున్నది. కార్యాచరణమందు ఉద్రేకములేక, తొట్రుపాటులు గల్గకుండ క్రమపఱచి సత్కార్యముల నాచరించునట్లుచేయునది పరాంబిక కరుణయేనని మహనీయుల యుపదేశములనుండి దెలిసికొనవగును. అతి గర్వితుడై తన్నెదిరించువారు లేరను నహంకారమున మదించి సోమరి తనమున నిదురించుచుండిన తమోగుణభరితుడగు బంధకాసుర సంహా రము సోమరితనము కూడదనియు కర్మనిష్ఠ యవశ్యమైనదనియు సత్కార్మాచరణ శ్రేయస్కరమనియు లోకమున కెఱుక పఱచుటకై పరాంబిక సంకల్పించిన లీలావినోదము. మంచి చేతల చేతనేగదా సాధన సాధ్యమగుచున్నది. అందుచే సోమరితనము ప్రగతికి ప్రతి బంధకము. సోమరియైన బంధకుని నాశనమొనరించియు, శివునంతటి వానిని జయింపవలెనను అత్యాశకులోనై కాముని గర్వమణచుటకై యతని యాయుధములను పరిగ్రహించియు, రజస్తమోగుణములను నిగ్రహించుటయే ముక్తికి మార్గమని సూచించు విధమున భక్తవాత్స ల్యముచే పరాంబిక కాంచీక్షేత్రమున కామాక్షితల్లియై వెలసియుండి తన

కరుణాకటాక్షముచే మనలను మంచి కార్యముల నాచరించునట్లుచేసి మంచిని కలిగించి మంచివారమై జీవించునట్లనుగ్రహించి కరుణించి కాపాడుచున్నది.

శివుని సందర్శించుటకై కైలాసమునకువచ్చిన బ్రహ్మదేవుడచట గౌరి లేకుండుటను గుర్తించి జరిగినదంతయు దెలిసికొని గౌరీశంకరుల నొకటిజేయు సత్సంకల్పముతో కామకోష్ఠమున కేతెంచి పరాంబికను ధ్యానించి సాక్షాత్కార మొనరించుకొని యాకామాక్షిదేవి నత్యంత భక్తితో స్తుతించి సకలలోకస్థిత శివాలయములందెల్ల శివునితోబాటు శివయుసన్నిహితురాలై యుండునట్లనుగ్రహించి కరుణింపుమనివేడెను. పరాంబికయు ప్రసన్నురాలై పరమేష్ఠి ప్రార్థనను మన్నించి తాను వెలసియున్న కాంచీక్షేత్రమునం దక్క యన్ని ప్రదేశములందును గల శివాలయములందెల్ల గౌరీదేవి సన్నిహితురాలగునట్లను గ్రహించెను. దానిచే సంతుష్టుడుగాని పరమేష్ఠి ప్రతి సంవత్సరము ఏకామ్రేశునికి కల్యాణోత్సవము జరుగవలసి యుండుటచే దానికనువుగ కాంచీక్షేత్ర మునను గౌరి సన్నిహితురాలగునట్లనుగ్రహింపుమని పరాంబికను మరల ప్రార్థించెను. కామాక్షిదేవి యందులకొక మార్గమాలోచించి కాంచీపుర మందలి సకల శివాలయములయందలి యీశ్వరి యంశముల నొకే రూప మున 'ఏకాంబిక' యనుపేర తన ఫాలనయనమునుండి చిజ్జ్యోతిరూపమున నుదయింపజేసి బ్రహ్మనుగాంచి యతని నా యేకాంబికను కంచిలోని సకల శివాలయములందు స్థాణురూపమున స్థాపించి దానిని మూలవిగ్రహముగ భావించిం బూజింప జేయుమనియు, ద్విభుజ కలితయు దక్షిణ కరధృత శుకయు, లంబమాన వామహస్తయునగు నొక గౌరి విగ్రహమును దివ్యలోహముతో జేయించి యాభువేశ్వరి నా లోహపు విగ్రహము సందావహించి కల్యాణదినమున యేకామ్రేశుని యాలయమునకు గొని వచ్చి గౌర్యేకామ్రేశ్వరుల కల్యాణము జరిపించి పిదప గౌరీదేవిని

ధ్రుపాలయమునను, ఏకామ్రేశుని యథాస్థానమునను వేంచేపుజేయునట్లు చేయుమని బ్రహ్మదేవు నాదేశించెను. శ్రీ కామాక్షీ నయనమునుండి జ్యోతిరూపమున వెలువడిన గౌరీస్వరూపమును మనసుననిల్పి తద్రూప మైన విగ్రహమును స్వర్ణముతో చేయించి యా స్వర్ణకామాక్షికిని, ఏకామ్రేశునికి కల్యాణోత్సవము జేయించి విరించి ధన్యుడయ్యెను. ఈయంబికయే పూర్వము ఏకామ్రనాధునిగూర్చి తపమాచరించి సైకతలింగరూపమున నారాధించి యేకామ్రేశుని యర్ధాసనమునుబొందిన యుమాదేవియని పరాంబిక బ్రహ్మ కెఱిగించెను. అందుచేతనే కాంచీపురమందలి శివాలయములలో అంబికకు ప్రత్యేక సన్నిధులు లేకుండునట్లయ్యెను. కంచిలోని శివాలయములందుండదగిన శక్తిస్వరూపములన్నియు శ్రీ కామాక్షీదేవి యందైక్యమై యున్నట్లెంచబడుచున్నది. బ్రహ్మదేవునిచే బంగారుతో జేయింపబడిన స్వర్ణకామాక్షీ విగ్రహమే ప్రస్తుతము తంజావూరులో నున్న బంగారుకామాక్షీ విగ్రహము. ప్రకృతమున శ్రీ యేకామ్రేశుని కల్యాణోత్సవమున వేంచేయబడుచున్న లోహవిగ్రహము తదనంతరము మన పూర్వులచే జేయింపఁబడిన పరిమళ కుంతలనామక గౌరి విగ్రహమని చెప్పబడుచున్నది

శ్రీకాంచీక్షేత్రమున కామకోష్ఠమునవెలసిన శ్రీకామాక్షీదేవి నారాధించిన బ్రహ్మ యాదేవిని బూజించిన పుష్పములనుండి యొక తామర పుష్పమును దీసి యాకసమున విసిరివేసెను. ఆకాశమున కెగసిన తామర వికసించి భూమికి దిగివచ్చి మనుష్య రూపమును దాల్చెను. బ్రహ్మ యతని కాకాశభూపతియని పేరిడి కాంచీమండలమున కతనిని రాజునుజేసి శ్రీకామాక్షీ నారాధించుటతోబాటు ఆ పరాంబిక యాదేశానుసారము ఏకాంబికకును ఏకామ్రేశునికిని ఏటేట కల్యాణోత్సవము జఱిపించి తరింపుమని నియమించెను.

కాంచీపురమునుండి సత్యలోకమునకు దిరిగి వచ్చిన బ్రహ్మ దేవునకు కండ్లు గనబడక పోయినట్లును, కాంచీపురమున శ్రీ కామకోష్ఠమున కుండలినీగృహమని యెంచబడు గాయత్రీమంటపమున గాలిడుటచే పాదస్పర్శ పాపమున బ్రహ్మకు గ్రుడ్డితనము ప్రాప్తించెననియు, గాయత్రిమంటపమున పాదములుంచుటచే గల్గిన పాపము హేమకామాక్షి సందర్శనమునను, శ్రీచక్రపూజచేతను నశించుననియు సరస్వతి దెలియ జెప్పుటచే బ్రహ్మదేవుడు శ్రీచక్రపూజజేసి తాను గోల్పోయిన చూపును మరల బొందినట్లు పురాణముగలదు. అందుచే కంచికామాక్షి యాలయమునకు వచ్చు భక్తులు స్వర్ణకామాక్షి మందిరమును దర్శించుట ముఖ్యమని యెంచబడుచున్నది.

చంద్రవంశ సంజాతుడగు ఆకాశభూపతి బహుకాలము సంతానము లేకుండుటచే చింతించుచుండెను. దానితోబాటు వర్షములు లేకుండుటచే దేశమున దుర్భిక్షమేర్పడెను. క్షామబాధనుండి ప్రజలనుగాపాడి తన్నాదుకోవలసినదని యాకాశభూపతి శ్రీకామాక్షిదేవినారాధించి ప్రార్థించెను. ఆకాశభూపతి భక్తికి మెచ్చిన శ్రీకామాక్షి వినాయకుని, అతనికి కుమారునిగ అవతరించు నట్లనుగ్రహించెను. పుత్రప్రాప్తిచే పరమానంద భరితుడైన యాకాశరాజు శ్రీకామాక్షికి విశేషమైన పూజలు జేయించి యన్నదానము గావించెను ఆకాశరాజు చేయించిన సంతర్పణలో శ్రీకామాక్షిదేవి యొక ముత్తైదువ రూపమునవచ్చి స్త్రీలపంక్తిలోకూర్చుండి విందారగించెను. అపుడు సంతర్పణ జరుగుచుండిన మందిరిజయట బంగారువాన గురిసెను. జనులావింతను గని యాశ్చర్యపడిరి. సంతర్పణకై యుంచిన పెసలుగింజలను పరిశుద్ధ పరచునపుడు మహారాణి యంగుళీయమున నుండిన బంగారు ముత్తెములనుండి యొక బంగారు తునకరాలి పెసలతో గలసి పొంగలితోజేరి యమ్మవారి కుక్షిని జేరుటచే పొంగలినారగించిన యమ్మవారికడుపు చల్లబడి జల్లున వానగురిటయు

యా పిడ భుజించిన యాహారమున బంగారు తునక గలిసి యుండినందున బంగారువాన సంభవించెనని, వినాయకుని యవతారమైన యాకాశరాజు తనయుడగు పసికందు దోగాడుచువచ్చి కామాక్షి కరుణచేత కనకవర్షము గురిసెనని పలికి పందిటిలో స్త్రీల పంక్తిని ముత్తైదువ రూపమున గూర్చుండి యుండిన యమ్మవారిని జూపించుటతోడనే యామె మంద స్మిత మొనరించి యదృశ్యయయ్యెను. కామాక్షికరుణచే కంచిలో కనక వర్షము గురియుటతోబాటు వానలుబడి పంటలు పండి దేశము సుభిక్ష మయ్యెను.

ఆకాశభూపతి తన కుమారునికి తుండీరుడని నామధేయమొసర్చి యల్లారుముద్దుగ బెంచసాగెను. ఆకాశభూపతి యనంతరము తుండీరుడు కాంచీమండలాధీశుడై శ్రీ కామాక్షీదేవి నత్యంత భక్తితో నారాధించు చుండెను. తుండీర మహారాజుచే బరిపాలించబడినందున కాంచీమండ లమునకు తుండీర మండలమను పేరుగల్గెనని యందురు. శ్రీ కంచి కామాక్షి యమ్మవారి యాలయమున మూలస్థానమున కెదురుగనున్న మంటపమున, ఉత్సవకామాక్షి సన్నిధి కభిముఖముగ బద్ధాంజలి ఘటించి ధ్యాననిష్ఠలో నిల్చియున్న తుండీరమహారాజు ప్రతిమ యతనికి శ్రీ కామాక్షి యెడనుండిన యపారమైన భక్తికి యుక్తమైన చిహ్నమై విరా జిల్లుచున్నది. ఉత్సవకామాక్షి ప్రదక్షిణముగ మంటపమునుండి ధ్యాన యోగమునసున్న తుండీరమహారాజు విగ్రహమును దాటి వెళ్ళునపుడు భక్తులతని అంతర్యోగధ్యాననిష్ఠకు భంగము వాటిల్లకుండు చందమున నోటికరచేతి నడ్డముంచుకొని నిశ్శబ్దముగ వెళ్ళుట యతనిభక్తికి గౌరవ సూచకమగు వాడుకయై యుండుట గమనించదగినది.

పూర్వము క్షీరసాగరమథన సమయమున పాలసముద్రమున కడుగున కమఠాకృతినుండి మందరపర్వతమును తన కర్పరంబున ధరించి

యుండిన మహావిష్ణువుని సుందరదేహము, వాసుకిగ్రక్కిన హాలాహల విషజ్వాల సోకుటచే నీలవర్ణమునుబొంది నారాయణుడు నల్లనివాడగు నట్లయ్యెను. తదుపరి, యొకనాడు హిరణ్యవర్ణయగు లక్ష్మి తన బంగారువన్నెకు నారాయణుని నల్లనిమేను నచ్చునట్లుగ లేదని వినోద ముగఁ బరిహసించెను. పతిని పరిహసించగల సాహసమునకు లక్ష్మీదేవి యొక్క సౌందర్యాతిశయమే కారణమనియెంచి రమారమణుడు రూప లావణ్యయగు రమాదేవిని రూపహీనయగునట్లు శపించెను. పరిహాసము పరిపరివిధములఁ జేటనుటకు తార్కాణముగ నేర్పడినదీ యీ దుస్సంఘ టన, పతిశాపముచే నష్టరూపయైన మంగళదేవత వ్యథనుజెంది కాంచీ క్షేత్రమునకు వచ్చి మంగళనాయకియగు శ్రీ కామాక్షిదేవి నాశ్రయించి తన్ను గాపాడమని మొరలిడెను. దుఃఖితయై తన్నాశ్రయించి వచ్చిన చంద్రసహోదరిని నారాయణ సోదరియగు నారాయణి కరుణజూపి యాదరించి యోదార్చి తనకు ఎడమవైపునసుండునట్లు నిర్దేశించి తన్న ర్చించిన కుంకుమ ప్రసాదమును భక్తులా యరూపలక్ష్మికి సమర్పించు నట్లును ఆ కుంకుమ స్పర్శచే యరూపలక్ష్మి స్వరూపమును బొందు నట్లును అనుగ్రహించెను. మంగళనాయికి శ్రీ కామాక్షి కుంకుమప్రసాద ప్రభావమున ఆరూపలక్ష్మి స్వస్వరూపమును బొంది సౌందర్యలక్ష్మియై శోభిల్లెను. శ్రీ కామాక్షీదేవిని దర్శించి కామాక్ష్యర్చిత కుంకుమ ప్రసాద మును స్వీకరించిన భక్తులాకుంకుమ ప్రసాదమును యరూపలక్ష్మియెడ సమర్పించి తదుపరి యటనుండి కుంకుమను దీసికొని ధరించుటచే అష్టైశ్వర్యములను బొంది సుఖించునట్లు దేవి యనుగ్రహించుటచే ఈ పద్ధతి శ్రీ కామాక్షి సన్నిధిని సంప్రదాయమై యున్నది.

తన శాపవశమున యందమును గోల్పోయిన లక్ష్మి కంచిలో కామకోష్ఠముననున్న శ్రీకామాక్షి నాశ్రయించుటెఱింగిన మహా విష్ణువు అచట నేమి జఱుగునో జూతమని తానును కామకోష్ఠమునకు వచ్చి

యన్యులెఱుగకుండునట్లు మఱుగున నుండి గమనించు చుండెను. శ్రీ కామాక్షి కుంకుమ స్పర్శచే యరూపలక్ష్మి స్వస్వరూపమును బొంది యత్యంత సౌందర్యరాశియై శోభిల్లుటనుగాంచి సౌందర్యలక్ష్మి యందమున మైమరచియుండెను. తనపతి తన్నాదరించుటకై యేతెంచుట కామాక్షి కటాక్ష ప్రభావమేయని యెంచిన సౌందర్యలక్ష్మి కామకోష్ఠమున నక్కి యుండి దొంగచూపుల దన్ను జూచుచుండిన మహావిష్ణువుని గాంచి శ్రీ కామాక్షి యండ ఉన్నదను ధైర్యమున పరిహాసముగ 'దొంగా దరికిరా' యని బిలిచెను. 'దొంగా దరికిరా', యనియు. 'దొంగా నా దారికిరా' యనియు ధ్వనించునట్లు దొంగచూపులు జూచుచుండిన తన పతియగు విష్ణుని చూచి 'చోరా' యని లక్ష్మిదేవి సంబోధించుటచేతను, రమా హృదయ చోరుడగుటచేతను రమారమణుడిచట 'చోరవిష్ణు'వనబరగెను. తిరుమంగై యాళ్వార్లచే తిరునెడుంతాండకములోని యెనిమిదవ పాశుర మున కళ్వరని మంగళాశాసనము చేయబడిన శ్రీ కంచికామాక్షి సన్నిధిలో వెలసియున్న చోరవిష్ణునిసన్నిధి 'కళ్వర్‌సన్నిధి' అనబడి నూటెనిమిది శ్రీ వైష్ణవ దివ్యదేశములలో నొకటిగా ప్రసిద్ధిఁ జెందియున్నది.

శ్రీ కామాక్షి కటాక్షమున కవితాశక్తినిఁ బొంది యత్యద్భుత స్తోత్రములచే నమ్మవారిని నుతించి ధన్యులైన మహనీయులనేకులు, యుగమున కొకరిచొప్పున శ్రీదేవ్యుపాసకులై ప్రసిద్ధి జెందిన దుర్వాస మహాముని, పరశురాముడు, ధౌమ్యుడు, మూక శంకరులు యుగపురు షులై ప్రఖ్యాతిగాంచినది పరాంబికయొక్క పరమకారుణ్యముచేతనేయని పెద్దల యభిప్రాయము. కామముయొక్క పరిధియగు మోక్షమును కరుణనిండిన తనకనుచూపులచే కటాక్షించు శ్రీకంచికామాక్షి ప్రభావము కృతయుగమున దుర్వాసమహామునిచే రెండువేల శ్లోకములలోను, త్రేతాయుగమున పరశురామునిచే వెయ్యైన్నూరుదువందల శ్లోకములలోను, ద్వాపరయుగమున ధౌమ్యమునిచే వెయ్యి శ్లోకములలోను, కలియుగ

మున శ్రీ మూకశంకరులవారిచే నైదువందల శ్లోకములలోను ప్రశంసింప బడియున్నదనుట విదితమే. అందు శ్రీకామాక్షీ పూజావిధానమును క్రమపఱచిన మహనీయుడు శ్రీ దుర్వాసమహాముని.

శ్రీదేవి యుపాసకులై తన్మయత్వమునొంది శ్రీదేవితో సమానముగ గౌరవించబడు మహనీయులు భట్టారకులనబడుచున్నారు భట్టారకులన "పూజనీయులైన పండితోత్తము" లని యర్థము. భట్టారికా మాన్యమని ప్రాచీన శాసనములందు గానబడుటచే పరాంబికకు గూడ భట్టారికయను పేరుగలదని పెద్దలందురు. శ్రీదేవి ఖడ్గమాలాస్తోత్ర సంకల్పభాగమున "శ్రీలలితా భట్టారికాదేవతా" యని ప్రస్తుతింపబడి యుండుట దీనినే సూచించుచున్నదనియు అందురు. సాక్షాత్ పరమేశ్వరుని భట్టారకునిగ పరిగణించి పరమశివ భట్టారకులని ప్రస్తుతించుట పరిపాటియై యున్నది. అటుతర్వాత క్రోధభట్టారకులని ప్రశంసింప బడువారు శ్రీదుర్వాసమహామునులు. శ్యామలా దండకమును అనుగ్రహించిన కాళిదాస మహాకవిని శృంగార భట్టారకులని యందురు. శ్రీ చక్రార్చన, శ్రీవిద్యాజప విధానములను విశదముగ ననుగ్రహించి లోకోపకార మొనరించిన మహనీయుడు శ్రీదుర్వాసమహాముని.

అత్రి, యనసూయలకు త్రిమూర్తుల యంశమున నవతరించిన తనయులు ముగ్గురును పరాంబిక నారాధించి తరించినవారలే. బ్రహ్మాంశ సంజాతుడగు చంద్రుడు పరాంబిక మకుటమునకు అలంకారప్రాయముగ నమరియుండుటచేత నంబికకు "చంద్రమౌళీశ్వరి" యను పేరు గలిగినది. విష్ణ్వంశమున నవతరించిన దత్తాత్రేయులు పరాంబిక నాత్మార్థముగ నుపాసించి తరించినట్లు పురాణప్రసిద్ధి. పరాంబిక నాత్మార్థముగ నుపాసించుటతోబాటు లోకకల్యాణార్థము ఉపాసనామార్గమును బహిరంగముగ బోధించిన మహాపురుషుడు దుర్వాసుడు శ్రీదుర్వాసమహాముని యను

గ్రహించిన "సౌభాగ్య చింతామణి" యను ఆగమరీత్యా శ్రీ కామాక్షి పూజావిధానము ఈనాటికిని జరుగుచుండుట గుర్తింపదగియున్నది.

శ్రీశంకర భగవత్పాదులవారు శ్రీకామాక్షి సన్నిధిని విదేహ కైవల్యముఁ బొందినట్లు జెప్పబడుచున్నది. అందుచే శ్రీ కామాక్షి యమ్మవారి సన్నిధిని శ్రీయాదిశంకరులవారికి ప్రత్యేకసన్నిధి గలదు. శ్రీయాదిశంకరులవారు కంచిలోని మఠమునకు శ్రీకామకోటి పీఠము యొక్క పేరిడియుండుట శ్రీ కామాక్షికిని శ్రీ శంకర మఠమునకునుగల పరస్పర సంబంధమును వెలువరించు చున్నది. శ్రీ దుర్వాసమహా మునులు శ్రీ కామాక్షి పూజావిధానమును క్రమపఱచినట్లు శ్రీయాదిశంక రులవారు శ్రీకామాక్షి సన్నిధిని శ్రీచక్రప్రతిష్ఠజేసి పరాంబిక ప్రసన్ను రాలై ప్రజలగాపాడు నట్లనుగ్రహించిన మహనీయుడు.

పరాంబికయగు శ్రీకామాక్షిదేవి ప్రసన్నురాలగునట్లు శ్రీచక్ర ప్రతిష్ఠఁజేసి లోకోపకార మొనరించిన శ్రీయాదిశంకరులు శ్రీకామాక్షి యాలయమును శ్రీచక్రాకారమున నుండునట్లు నూతనముగావించి, యా కాలమున రాజ్యపాలన మొనరించుచుండిన రాజసేనునిచే కాంచీపురమును శ్రీచక్రాకారమున పునర్నిర్మాణ మొనరింపజేసి, కాంచీనగరమునకు శ్రీకామాక్షిసన్నిధి బిందువై యుండునట్లమర్చి యచట సర్వజ్ఞపీఠమును స్థాపించి పీఠారోహణమొనర్చి జగద్గురువై విరాజిల్లెను.

శ్రీకామకోటి పీఠాధిపతుల వరుసలో ఇరువదవ పీఠాధిపతియైన శ్రీమూకశంకరులవారు శ్రీకామాక్షి కటాక్షమున కవితాశక్తినిఁబడసి శ్రీ కామాక్షిని గీర్తించి శ్రీకామాక్షి ప్రభావమును ఐదువందల శ్లోకములలో బ్రశంసించి యనుగ్రహించియున్నారు. 'మూక' యనునది మూగ యను పదమునకు పర్యాయము. మాటాడు శక్తిలేనివాడై - మూగయై - యుండినట్టు వీరి పూర్వస్థితికి 'మూక' యను పదము సంకేతమైయున్నది.

మూకశంకరులనునది కారణ నామధేయము. తొలుత మూగవాడైయుండి పిదప వాక్పటుత్వమును బొంది, మేధావియై శంకరమఠాధి పతులగుటచే వీరికి మూకశంకరులని పేరు గలిగినది. తొలుత వీరు బ్రహ్మచారిగ నుండినపుడు మూగవారై మందమతిగ నుండినందున నిరాధారముగ నుండి యను దినము శ్రీ కంచికామాక్షి సన్నిధికి వచ్చి యచట నొక దేవ్యుపాసకుని ప్రక్కన గూర్చుండి యతనిని గమనించు చుండెడివాడు. ఆదేవ్యుపాసకుడు వాక్పటుత్వమునుగోరి శ్రీకామాక్షిని ధ్యానించెడివాడు. ఒకనాడాయుపాసకుని కటాక్షింప నెంచిన శ్రీకామాక్షిదేవి యొక స్త్రీరూప మున వచ్చి యతనిని నోరు దెరువుమనెను. కర్మవశమున వచ్చినది శ్రీకామాక్షియని యరయలేక ఉపాసకుడామెను ప్రక్కకు దప్పుకొమ్మ నియెను ఉపాసకుని ప్రక్కన గూర్చుండి యీవింతను జూచుచుండిన బ్రహ్మచారియైన బాలకుడు మూగవాడగుటంజేసి ' భేభే ' యనుచు నోరు దెఱచుటచే పరాంబిక తాంబూల స్పర్శ ప్రాప్తమై మూగయై యుండిన వాడు కవితకారంబించిన యద్భుత సంఘటన సంభవించెను. మందమతి యని యెంచబడిన మూగవాడు వాక్పటుత్వమునుబొంది మహాపండితుడై పరమభక్తుడై, బ్రహ్మజ్ఞానియై శ్రీకాంచి కామకోటి పీఠాధిపతియగు బాగ్యమును బొంది జగద్గురువన బ్రఖ్యాతి గాంచినది శ్రీ కంచి కామాక్షి కటాక్షప్రభావమున కొక నిదర్శనము. శ్రీకామకోటి పీఠాధిపతుల వరు సలో వచ్చిన యరువై రెండవ యాచార్యులైన నాల్గవ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వాములవారు 'శివగీతమాలిక ' యను గ్రంథమున శ్రీకామాక్షి యేకామ్రేశ్వరుల లీలావినోదములను వర్ణించి యుండుట శ్రీకామాక్షి కరుణావిలాసమున వారికిబ్రాప్తించిన కవితాశక్తిని బ్రకటించుచున్నది.

శ్రీకామాక్షి స్తోత్రగ్రంధములలో శ్రీదుర్వాసమునిని యనుగ్రహిం చిన " యార్యాద్విశతి " యను లలితాస్తవరత్నము. శ్రీయాదిశంకరుల వారి సౌందర్యలహరి, వారి వరుసనను వచ్చిన శ్రీమూక శంకరులవారిచే

అనుగ్రహింపఁబడి శ్రీమూకపంచశతియని ప్రసిద్ధమైన స్తోత్రరత్నము లతి ప్రాచీనమై ప్రఖ్యాతిగాంచి యున్నవి. సంగీత మమ్మూర్తులన బరగు శ్రీత్యాగరాజస్వామి, శ్రీముత్తుస్వామిదీక్షితులు, శ్రీశ్యామశాస్త్రి శ్రీకామాక్షిదేవిని స్తుతించి గీర్తించి యుండుట వారి సాహిత్యములనుండి దెలియనగుచున్నది. వినాయకుని అనుగ్రహించినట్లు కరుణించి కాపాడు మని వేడిన

"వినాయకునివలెను బ్రోవవే, నినువినావేల్పు లెవరమ్మ ?
అనాధరక్షకి శ్రీకామాక్షీ, సుజనాఘమోచని, శంకరి! జనని!"

యను శ్రీత్యాగరాజస్వామివారి మధ్యమావతి రాగకీర్తన బహుళ ప్రసిద్ధమై యున్నది.

"కామాక్షీ ! కామకోటి పీఠవాసిని మామవ" యను సుమద్యుతి రాగకృతిలో శ్రీకామాక్షిని సమస్త సామ్రాజ్యదాయినియనియు. కళ్యాణ గుణశాలిని యనియు గీర్తించిన శ్రీముత్తుస్వామి దీక్షితులు, శ్రీమూక శంకరులవారినిఁ గటాక్షించినట్లు గరుణింపుమనివేడి "మూకముఖ్యవాక్ప్రదాయినీం — ముక్తిప్రద గురుగుహ పాలినీం" యని శ్రీ కామాక్షిని గీర్తించి "శ్రీయేకామ్రేశ నాయకీం ఈశ్వరీం, భజరేమానస" యను శుద్ధసావేరి రాగకృతియందు వాంఛిత ఫలప్రదాయిని యగు శ్రీకామాక్షిని గొలుచుట తరించుటకు మార్గమని తెలియఁజేసి యున్నారు. శ్రీశ్యామ శాస్త్రి సాహిత్యములన్నియు పరాంబిక యొక్క పరమ కారుణ్యమును బ్రశంసించు స్తుతిరత్నములు. అందు "కనకశైల విహారిణి, అంబ శ్రీకామకోటిబాలే, సుశీలే" యను పున్నాగవరాళి రాగ సాహిత్యమున శ్రీకామకోటి బాలయగు శ్రీకామాక్షిదేవిని "కామితార్థ ఫలప్రదాయకి, శ్రీకామాక్షీ ! సకలలోకసాక్షి" యని స్తుతించి యున్నారు. "కామాక్షీ ! అనుదినము మరువక నేనీ పాదముల దిక్కనుచు నమ్మితిని శ్రీకంచి —

కామాక్షి!" యని శ్రీకంచికామాక్షిని పరిపరివిధముల ప్రార్థించి, స్తుతించి యున్న శ్రీ శ్యామాశాస్త్రిగారి భైరవిరాగస్వరజతి సుప్రసిద్ధమైనది. శ్రీకామాక్షి కరుణావిలాసము ప్రశంసింపఁబడియున్న యీ కాలపు రచన లనేకములు. శ్రీకామాక్షీదేవి యనుగ్రహమున ప్రకటింపబడియున్నవి.

రాజులవలెనే శ్రీకంచికామకోటి పీఠాధిపతులు శ్రీకామాక్షియమ్మ వారిగుడిని అపుడపుడు జీర్ణోద్ధారణ మొనరించి యభివృద్ధిపఱచుట వారికి శ్రీ కామాక్షీ యెడగల భక్తిభావమును ప్రకటించుచున్నది. శ్రీ కంచి కామాక్షి దేవాలయము శ్రీ కంచికామకోటిపీఠము యొక్క దేవాలయమై శ్రీకామకోటి పీఠాధిపతులుగా ధర్మకర్తలుగ నుండి వారి నిర్వహణలో అలరారుచున్నది. 1761 వ సంవత్సరమున శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వాములన బరగిన శ్రీకంచికామకోటి పీఠాధిపతులు కంచిలోని శ్రీ కామాక్షీయమ్మవారి యాలయమును జీర్ణోద్ధారణ మొనరించినట్లు శిలా శాసనములు లభ్యమగుచున్నవి. 1942 వ సంవత్సరమున శ్రీ కంచి కామకోటి పీఠముయొక్క పరమాచార్యులైన శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారు శ్రీ కంచికామాక్షీ యాలయ జీర్ణోద్ధారణ మొనరించి మహాకుంభాభిషేకము జరిపించుటతోబాటు శ్రీకామాక్షీయమ్మవారికి శ్రీ చక్రాకారముగ వెండితేరును, బంగారు సహస్రనామమాలను జేయించి సమర్పించుచున్నారు.

శ్రీకృష్ణదేవరాయలచే నిర్మింపబడి పల్లవరాజులచే అభివృద్ధి జేయబడి, తదుపరి 1942 వ సంవత్సరమున శ్రీ చంద్రశేఖరేంద్ర స్వాములవారిచే కుంభాభిషేకము జేయింపబడిన శ్రీ కామాక్షీయమ్మవారి యాలయ రాజగోపురము, ప్రాకార గోపురములు, విమానము, తిరుగ జీర్ణోద్ధారణ మొనరింపబడి 1976 వ సంవత్సరము, ఏప్రెల్ నెల యైదవ తేదీన శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ జయేంద్ర సరస్వతీ శంకరా

చార్యులవారిచే మహాకుంభాభిషేక మత్యంత వైభవోపేతముగ జరిపించ బడినవి.

మహాకుంభాభిషేకమహోత్సవ దినము మొదలుకొని మండలాభిషేకము పూర్తియగు వఱకు ప్రతి దినము దినమునకు ఒకటి, రెండు చొప్పున నలభైయైదు దినములలో డెబ్బదియైదు సంగీత కచేరి కార్యక్రమములను, మూడు దినములు హిందూమత మహాసభ సమావేశము, విద్వత్ సదస్సులు నడిపించబడి విశేషాభిషేకములు, ఆరాధనలు వైభవోపేతముగ జరిపింపబడినవి. అటు పిదప శ్రీ కంచి కామాక్షీఅమ్మవారి విమానమునకు బంగారు రేకులు వేయబడి 1979 వ సంవత్సరము ఫిబ్రవరినెల మొదటి తేదీన శ్రీ జయేంద్ర సరస్వతీ స్వాములవారిచే శ్రీ కామాక్షీయమ్మవారి బంగారు విమానమునకు కుంభాభిషేకము అత్యంత వైభవముగ జరిపింపబడినవి.

నాల్గుదిశలలోను శ్రేష్ఠమైన శిల్పకళానైపుణ్యమును ప్రదర్శించు ఎత్తైన గోపురములతో శోభిల్లు శ్రీకామాక్షీయమ్మవారి యాలయ ప్రాకారములుదాటి రాజగోపురద్వారమున ఆలయమును ప్రవేశించిన దిశలను సరిగ దెలిసికొనలేని విధమున ఈ యాలయము నిర్మితమై యుండుటచే శ్రీకామాక్షీయాలయము దిగ్భ్రమము గల్గించు దేవాలయమని ప్రసిద్ధి జెందియున్నది. రాజగోపుర మార్గమున ప్రాకారమునుదాటి లోపలకు వెళ్ళినంతనే యెత్తైన ధ్వజస్తంభము, బలిపీఠము గన్పించును. ధ్వజస్తంభమున కెదురుగా ఆలయపు గోడలలో నమర్చియున్న రాతి కిటికీ గుండ చూచినచో సన్నిధిలోని మూలస్థానమున వెలసియున్న శ్రీ కామాక్షీయమ్మవారి మూల విగ్రహమును దర్శింపనగును. ధ్వజస్తంభమున కెదురుగ రాతిగవాక్షమునకు ప్రక్కననున్న వినాయకుని దర్శించి యాలయ ప్రధాన ద్వారమును సమీపించునపుడు ప్రధానద్వారముముందు శుక్రవారమంటపము గలదు.

శుక్రవారములలో ఉత్సవ కామాక్షిని ఈ మంటపమున వేంచేపు జేయుటచే నీ మంటపమునకు శుక్రవారమంటపమని పేరుగలిగినది ఈ శుక్రవార మంటపముయొక్క స్తంభమున వినయ "ముద్ర" తో నున్న యాంజనేయుని బింబము భక్తులనాకర్షించి గొలువబడుచున్నది. శుక్ర వార మంటపము గుండా ప్రధాన వాకిలిని నడచి లోపలికి జనినంతనే జయస్తంభము గలదు. దాని కెదురుగానున్న వాకిలినుండి లోప్రాకా రము బ్రవేశించి యెడమవైపున దిఱిగినంతనే విఘ్ననివారణ గణపతిని దర్శింపనగును. అమ్మవారి సన్నిధిని జుట్టి ప్రదక్షిణముగ ప్రాకార మమర్చబడి యున్నను, యమ్మవారి మూలస్థానమున కెదురుగ ఉత్సవ కామాక్షి వేంచేయబడియున్న మంటపమునెక్కి ఉత్సవకామాక్షిని దర్శిం చిన పిదప మూలస్థానమునకు వెళ్ళుట వాడుకలో నున్నది. ఉత్సవ కామాక్షి మంటపము మెట్లెక్కినంతనే దుర్వాసమహామునిని దర్శింప నగును. శ్రీదుర్వాసమహాముని ఏర్పఱచిన సౌభాగ్యచింతామణి యను పూజావిధానముననే శ్రీకామాక్షీయమ్మవారిగుడిని యారాధనము జఱుగు చుండుట గుర్తింపదగియున్నది. దుర్వాసమహామునిని దర్శించి ప్రద క్షిణముగ దిరుగునపుడు ఎడమవైపున అమ్మవారి శయనమందిరము గలదు. దానిని దాటి కుడివైపునకు దిఱిగి ప్రదక్షిణముగునపుడు ఇష్ట సిద్ధి వినాయకుని దర్శించనగును.

ఉత్సవమంటపమున ఉత్సవకామాక్షి సన్నిధిని 'సచామర రమా వాణి సవ్య దక్షిణ సేవితాం' యనబడినట్లు లక్ష్మీసరస్వతు లిరుప్రక్కల చామరము వీచుచుండ జగన్నాయకియైయున్న శ్రీకామాక్షిదేవి యుత్సవ మూర్తిని దర్శింపనగును. ఆచట నిల్చుండి మూలస్థానముననున్న శ్రీకామాక్షి అమ్మవారి మూలవిగ్రహమును గవాక్షముగుండా బాగుగా దర్శించుటతో బాటు బంగారు విమానమును దర్శించ నగును. ఉత్సవ కామాక్షిని దర్శించి మంటపమున వెళ్ళునపుడు బద్ధాంజలి ఘటించి ధ్యాన

ముననున్న తుండీర మహారాజు ప్రతిమను దర్శింపనగును. మంటప మున మరుప్రక్కన సరస్వతి, స్వర్ణ కామాక్షి సన్నిధులు గలవు. ఈ సన్నిధులకు వెడలు వాకిలికిరుప్రక్కలనున్న సౌభాగ్య గణపతి సుబ్రహ్మణ్యస్వాములను దర్శింపగలరు.

ఇచట వెలసియుండిన స్వర్ణకామాక్షియే బంగారు కామాక్షి యన బరగి ప్రఖ్యాతిగాంచిన యమ్మవారు, ఆదిలో బ్రహ్మదేవునిచే జేయింపబడినది యీ స్వర్ణకామాక్షి బంగారు విగ్రహము. కాలగతిలో అన్యులయాక్రమణమునుండి సంరక్షింపబడుటకై సంగీత త్రిమూర్తులలో నొకరైన శ్రీ శ్యామశాస్త్రిగారి పూర్వులు, ఈ బంగారుకామాక్షి విగ్రహమును కంచినుండి దీసికొనిపోయి చెంజి, వుడయార్‌పాళెము, తిరువారూరు మార్గముగ తంజావూరుకుదెచ్చి యచట వేంచేయజేసి యచట నీ యమ్మవారి కొక యాలయమును ప్రతిష్ఠింపజేసిరి. అలనాడు కంచిలో ప్రతిష్ఠింపబడిన స్వర్ణకామాక్షి యీనాడు తంజావూరులో బంగారుకామాక్షి యన ప్రతిష్ఠితమై విరాజిల్లుచున్నది. తొలుత కంచిలో బంగారు కామాక్షి ప్రతిష్ఠితమైయుండిన శ్రీ కామాక్షీయమ్మవారి గుడిలోని స్వర్ణ కామాక్షి సన్నిధిలో అమ్మవారి చరణాబ్జములు విలసిల్లు పీఠము మాత్రము గలదు స్వర్ణకామాక్షి చరణ కమలములను సేవించి ఉత్సవ మంటప మును దిగినంతనే మూలస్థాన ద్వారమున కెదురుగ అన్నపూర్ణ సన్నిధి గలదు. అన్నపూర్ణను దర్శించి మూలస్థానమును ప్రవేశించి యందు గాయత్రీమంటపమున కొలువైయున్న శ్రీకామాక్షిదేవిని దర్శించి భక్తులు తరించుచున్నారు. మూలస్థానమునకు బోవునపుడు శ్యామలాదేవి, సౌందర్యలక్ష్మి, కళ్వరనబడు శ్రీచోరవిష్ణులను దర్శింపనగును.

శ్రీకంచికామాక్షీయమ్మవారి యాలయ గర్భ గృహమున గాయత్రీ మంటపమునందు శ్రీ కామాక్షిదేవి బిలాకాశరూపమునను, తపః

కామాక్షీరూపమునను, చతుర్భుజములతో వామోర్ధ్వకరంబునందు అనగా పైనున్న యెడమచేతినందు పాశముతోను, దక్షిణోర్ధ్వకరమున (పైనున్న కుడిచేతిలో) అంకుశమును వామాధః కరంబున (క్రిందనున్న యెడమచేతిలో) చెఱకు విల్లును, దక్షిణాధఃకరంబున (దిగువనున్న కుడిచేతిలో) పుష్పబాణములను ధరించి పద్మాసనమున గూర్చుండి శ్రీలలితా మహాత్రిపురసుందరి రూపముననున్న శ్రీకామాక్షీదేవిగను వెలసియుండి కరుణారసపరిపూరిత నయనంబులచే ఆశ్రితుల కోరికలీడేర్చి కటాక్షించి కాపాడుచున్నది.

కరుణను వర్షించు కన్నులుగల శ్రీకామాక్షీ దివ్యమంగళ విగ్రహమును వర్ణింప నలవిగాదు. కరుణారస పూరితమైన కామాక్షి కనుచూపులచే వచ్చిన వారికోరిక లీడేరుటచే వారి వారికిగల్గు ఆనందానుభూతిని వారివారి శక్త్యాను సారమనుభవించి యానందించవలసినదే గాని శ్రీ కామాక్షి కనుచూపుల మహిమ యిట్టిదని వివరించుటకు వీలుగాదు. మాటలకందని మహిమగలిగిన కామాక్షి రూప సౌందర్యమును, కనుచూపు మహిమను మహనీయులు కొందఱు తమభావనా శక్తికి దగినరీతిని శ్లాఘించి యున్నారు. కోరిన వరాలిచ్చే కామాక్షి నాశ్రయించి, సేవించి, స్తుతించి, ధ్యానించి, పూజలుజేయించి, కామితార్థములను బొంది ముదముతో జీవించుటకు శ్రీకామాక్షీ చరణ కమలములే గతియని నమ్మి భక్తితో గొల్చువారికి ఇహపర సౌఖ్యముల ననుగ్రహించు దయగల తల్లియని శ్రీ కామాక్షిదేవి భక్తులచే నుతింపబడుచున్నది. శ్రీ కామాక్షీ యమ్మవారి మూలవిగ్రహమును దర్శించువారమ్మవారి కనులలో కరుణనిండి యుండి ప్రసన్నురాలై యుండుటను గమనించి పరవశమగుచున్నారు.

శ్రీ కామాక్షీ అమ్మవారిముందు శ్రీచక్రము ప్రతిష్ఠితమై విలసిల్లుచున్నది. ఈ శ్రీచక్రము శ్రీఆదిశంకరులచే ప్రతిష్ఠింప బడినది.

శ్రీచక్రము శ్రీవిద్యా స్వరూపిణియగు శ్రీలలితా మహాత్రిపురసుందరి సుగుణ స్వరూపమని యెంచబడుచున్నది. శ్రీ యనునది శ్రీవిద్యను సూచించుచున్నవి చక్రమనునది చక్రాకారమున నున్న యంత్ర రాజము. పూజ్యమైన యంత్రమగుటచే చక్రమునకు గౌరవవాచకమైన శ్రీనిచేర్చి శ్రీచక్రమని వ్యవహరించుట పరిపాటి శ్రీచక్రపూజ పరాంబికను పూజించుటయగును. అందుచే శ్రీకంచికామాక్షీదేవి యాల యమున పూజలన్నియు నీ చక్రమునకే జరిపించబడుచున్నవి. ఈ శ్రీ చక్రమును జుట్టియున్న కవచమున, అష్టలక్ష్మి రూపములు విరాజిల్లు చున్నవి.

అమ్మవారి కర్పించిన కుంకుమప్రసాదమును బడసి యమ్మవారి సన్నిధికి ప్రక్కననున్న యరూపలక్ష్మికడ నా కుంకుమను సమర్పించి యరూపలక్ష్మికి సమర్పించిన కుంకుమను దీసికొనిధరించుట పరిపాటియై యున్నది. అరూపలక్ష్మికి సమీపమున వారాహియు, వారాహికెదురుగ సంతాన గణపతియు దర్శనీయులై యున్నారు. వారిని దర్శించి శ్రీ కామాక్షి యమ్మవారిని మరల నమస్కరించి గాయత్రీ మంటపమునుండి వెలుపలికివచ్చి శ్రీయన్నపూర్ణాదేవిని ప్రదక్షిణముగ వచ్చునపుడు శ్రీ పూర్ణపుష్కలాసమేత శ్రీధర్మశాస్త్ర సన్నిధి దర్శనీయమై యున్నది.

హరిహరాత్మజుని సన్నిధికి ప్రక్కన జగద్గురు శ్రీ యాదిశంక రులవారి సన్నిధిగలదు. జగద్గురు శ్రీ యాదిశంకరులవారు సర్వజ్ఞ పీఠారోహణ మొనరించిన దివ్యస్థల మిదియని యెంచబడుచున్నది. శ్రీ కామాక్షియమ్మవారి కటాక్షమును గోరివచ్చు భక్తులకు జ్ఞానమార్గమును జూపించి మంచి హృదయముతో మంచి చింతనగలిగి మంచి మార్గమున నడచి లోకమునకు మంచిచేయు మంచివారై మనుగడగల్గి యుండునట్లు నుగ్రహించు విధమున సద్గురుమూర్తియై వెలసియున్న జగద్గురువును

దర్శించుటచే మనఃశ్శాంతి గల్గుచున్నది. జగద్గురువు సన్నిధి నంటి యున్న మంటపమున శ్రీయాదిశంకరుల జీవితచరిత్రను వర్ణించు చిత్రములు చలువరాతిపై జెక్కబడియున్నవి.

శ్రీకామాక్షియమ్మవారి సన్నిధి ప్రాకారమునుండి వెలుపలకు వచ్చినంతనే ధ్వజస్తంభమునకు ప్రక్కన ఎడమవైపుననున్న వరసిద్ధి వినాయకుని దర్శించి యాలయమునుండి వెలుపలకు వచ్చి గోపురమున కిరుప్రక్కల నమర్చియున్న మందిరమున నొకదానియందు భైరవుని మఱొకదానిలో దుర్గను దర్శించి ధ్వజస్తంభమునకు నమస్కరించి ప్రాకారప్రదక్షిణ మొనరించునపుడు శ్రీకాశీవిశ్వనాథుని సన్నిధిని దర్శింప నగును. శ్రీకామాక్షియమ్మవారి యాలయమునకు వెనుకవైపున ప్రాకారములలోననే యమరియున్నది పంచతీర్థమను పుష్కరిణి. పుష్కరిణి గట్టున నవరాత్రి మంటపము గలదు. నవరాత్రి దినములలో సాయం సమయమున ఉత్సవకామాక్షి నీ మంటపమున వేంచేపు జేయించి యమ్మవారి సమక్షమున సంగీత కార్యక్రమములు జఱుగుట వాడుకలో నున్నది. పంచతీర్థమును జుట్టి వచ్చునపుడు గట్టుననున్న స్థలవృక్షమైన కాంచీవృక్షమును గాననగును. శ్రీకామాక్షియమ్మవారి యభిషేక జలమీ పుష్కరిణిలో గలియునట్లమర్పబడియున్నది. అమ్మవారి యభిషేకజలము ఈ కోనేటిలో గలియుచోట గావలియుండునట్లు యాడ మగ భూతముల బింబములు, కోనేటిగట్టున భూతబంధన జనార్ధనుడు నిల్చి, కూర్చుండి, శయనించిన చందమున మూడువిధములుగ మూడంత స్థుల మందిరములో వెలసియున్నాడు. కోనేటిని దాటి వచ్చినంతనే యమ్మవారి యాలయమునంటినట్లు విశాలమైన యాగమంటపము, దాని కెదురుగా ప్రధాన గోపురము నంటినట్లున్న యాగశాలగలవు. కాంచీ

పురమందలి ప్రధాన దేవాలయములో ఎచట ఉత్సవము జరిగినను యాయాదేవాలయ ఉత్సవమూర్తులు శ్రీ కామాక్షీయమ్మవారి యాలయమును ప్రదక్షిణముగ వచ్చురీతిని ఉత్సవములు జరుగుట సాంప్రదాయమైయున్నది.

శ్రీ కంచికామాక్షీయమ్మవారికి ప్రతి శుక్రవారము విశేషాభిషేకారాధనలు జరుగుచున్నవి. ఆది, మంగళ, శుక్రవారములలో అమ్మవారిని దర్శించుటకై భక్తులు గుంపులు గుంపులుగ వచ్చుచుందురు. ప్రతి పౌర్ణమి దినమునను అమ్మవారి నవావరణపూజ నడచుచున్నది. మాఘ మాసమున బ్రహ్మోత్సవము భాద్రపద మాసమున నవరాత్రియుత్సవము అత్యంత వైభవోపేతముగ జరిపింపబడుచున్నవి. నవరాత్రి దినములలో విశేషపూజలు, నవావరణ పూజ జరిపించుటతోబాటు ఆలయ ప్రాకారములోననే ఉత్సవకామాక్షికి ఉత్సవము జేయించి నవరాత్రి మంటపమున వేంచేయబడి యమ్మవారి సమక్షమున ప్రతి దినము సంగీత కార్యక్రమముల నేర్పాటుజేయించుట యానందదాయకమైయున్నది.

కాంచీపురమున కారుణ్యమున కాటపట్టి వెలసియున్న శ్రీ కామాక్షీదేవిని నమస్కరించువారికి అమ్మవారి కరుణాకటాక్షమున సర్వైశ్వర్యములేర్పడి విద్యాబుద్ధులుగలిగి సర్వమంగళములు సంప్రాప్తించుచున్నవనియు, శ్రీకామాక్షీ చరణాబ్దములందు సమర్పింపబడు వందనములు సర్వక్షేమములను బొందుటకు సాధనము లగుచున్నవనియు శ్రీకామాక్షీ కటాక్షవైభవమును శ్రీమూకశంకరులవారు ప్రశంసించి యున్నారు, కోరివచ్చు వారి కోరికలను తన కటాక్ష వీక్షణమున నెఱవేర్చి యిహపర

సౌఖ్యముల ననుగ్రహించు మహిమాన్వితయై కంచినున్న కరుణించు తల్లి కామాక్షిని గొల్చుట శుభములను బొంది సుఖముండుటకు సాధనము.

"జయ జయ జగదంబ శివే
జయ జయ కామాక్షి జయజయాద్రిసుతే
జయ జయ మహేశదయితే
జయ జయ చిద్గగన కౌముదీధారే"— మూకపంచశతి.

శ్రీ కామాక్షిదేవ్యైనమః

——:O:——

# అవనిగొలుచు ఆదిశంకరులు
# కరుణగొలుపు కామకోటి పీఠము

అవనిలో ధర్మచింతన మభివృద్ధిఁజెంది ప్రజలు ప్రేమతో మెలగి, సదుద్దేశముతో సత్కర్మల నాచరించి, నిర్మల మనస్కులై ప్రశాంతత లభించి నిజమైన నిత్యానందమును బొందుటకు దైవకృప యత్యావశ్యక మని మహనీయులనుభవ పూర్వకముగఁ ప్రపంచమున కెఱిగించి యున్నారు. మనుజుని చిత్తమందు స్వస్వాభావికమైన ప్రేమగలదు. ఇది దైవదత్తము. మనసులోని ప్రేమ ప్రకటితమై పరిమళించుటను చైతన్యము నొందుటయని యందురు. తాను, తనదను స్వలాభాపేక్ష చేత యాశలను బెంచుకొని, వానిని నెరవేర్చుకొను ప్రయత్నమున రాగద్వేషములకులోనై, దైవదత్తమగు సహజమైన యనురాగమును విసర్జించుటచే జనులు దుఃఖితులగుచున్నారను నిత్యసత్యము నెఱింగి నిజమైన పరిస్థితిని బోధపఱచి తెలివిని గల్గించి భక్తి జ్ఞానమార్గములను తరుణోపాయములను దెలియజెప్పి కడతేరుటకు దారి జూపించిన జ్ఞానదనులగు మహనీయులు మార్గదర్శకులనియు, గురువులనియు, యాచార పురుషులనియు ప్రశంసింపబడు చున్నారు.

"ఆచార్యవాన్ పురుషోవేద"— గురువుగలవాడే తత్త్వమును దెలియగలడు. ఎంతటివాడైనను స్వయంప్రజ్ఞచే నరిషడ్వర్గములనుండి దప్పించుకొనజాలడని మన పెద్దల నమ్మకము. అందుకు అపరోక్ష సాక్షాత్కారముగల్గిన సద్గురుని యండ యవసరము. గురుకటాక్షముచే అజ్ఞానము దొలగి యాత్మస్వరూపుడైన భగవంతుని యునికి దెలిసికొన నగును. ఆత్మ పరిపక్వమును బొందినపుడు తనలో యిమిడియుండి

ప్రకాశించు పరమాత్మ తక్కుంగల ప్రాముఖ్యయుండను గలడను భావము గల్గి ప్రకృతిలోని జీవరాసులనన్నింటిని ప్రేమింపగల సహృదయతను బొందగల్గుచున్నది. తనలోని పరమాత్మ యెల్లెడల వ్యాపించియుండుటను గ్రహించుటయే జీవన్ముక్తి. సద్గుణములను బెంపొందింపజేసికొని సన్మార్గమున సంచరించి సచ్చిదానందమయమగు పరబ్రహ్మము నరసి సద్గతిని బొందుటకు సద్గురుని యాశ్రయమత్యావశ్యకము, సరియైన మార్గమును జూపించువాడు — తరించుటకు మార్గమును జూపువాడ — సద్గురువు. సద్గురువులను మతాచార్యులనియు, ఆచార్యపురుషులనియు ప్రశంసించుట పరిపాటి అట్టి మతాచార్యులలో కంచిలోవసించి అద్వైత సిద్ధాంత ప్రచారమొనరించి జగద్గురువని నుతింపబడిన యాదిశంకరులు మహాద్భుత మేధాశక్తి సంపన్నులైన లోకోత్తర పురుషులు.

సచ్చిదానందమయమగు బ్రహ్మమొక్కటే. ఇది వేదవిహితమగు సత్యము. అహంకార మమకారములకు లోనై విషయలంపటుడై మాయావలయంబున జిక్కి, తనలో అణగియున్న యాత్మజ్ఞానము నరయలేక యజ్ఞానాంధకారమున జిక్కియున్న మనుజుని మోహమును మైకమునుండి విడిపించి, మమతను గోసి, మాయయను తెరను దొలిగించి మైలదీసి, పరిశుద్ధాత్మునిగజేసి యతనిలో నంతర్గతమై ప్రకాశించుచున్న పరమాత్మ తత్త్వమును దెలియజెప్పు నద్వైత సిద్ధాంతమును బోధించి లోకము నుద్ధరించుటకై యవతరించిన మహనీయుడాదిశంకరులు.

" తన్నుతానెఱిగిన తప్పొకటిలేదు "

తన్నుతానెఱుగక తా జెడిపోవు — అను తిరుమూలరను మహనీయుని యుపదేశానుసారము మనుజుడు తాను పరమాత్మయొక్క ప్రతిబింబమని గ్రహించి బ్రహ్మానందము నొందలేక సంసారసాగరమునీదలేక కడతేరుమార్గము దెలియక కష్టపడుచున్నాడు. బ్రహ్మజ్ఞానముచే

మానవుడు తనజన్మముకైన ప్రయోజనమును దెలిసికొనగల్గుచున్నాడు. పరమాత్మ తత్త్వమును నెఱిగి బ్రహ్మానందమును బొందుటయే జన్మమెత్తినందులకైన ప్రయోజనము బ్రహ్మానందమును బొందుస్థితియే జీవన్ముక్తి. జీవన్ముక్తికాధారమైన బ్రహ్మజ్ఞానము ఆత్మతత్త్వ విచారమున గల్గుచున్నది.

ఆత్మతత్త్వ విచారమునకు దోడ్పడునవి వేదోపనిషత్తులు, ఆగమ సిద్ధాంతములు. పరమాత్మను గుర్తింపగల యాత్మజ్ఞానమే వేదము. ఆత్మ పరమాత్మ తత్త్వమును వివరించునవి యుపనిషత్తులు, ఆత్మజ్ఞానమును బొందుటకు ఉపకరణములై యొప్పునవి యాగమములు ఆత్మపరమాత్మ తత్త్వ నిర్ణయ మొనర్చునది యాగమసారమగు సిద్ధాంతము.

శివతత్త్వమును వివరించి, శివజ్ఞానమును బోధించి, యద్వైత సిద్ధాంతమును నెలకొల్పిన మహాత్ముడు ఆదిశంకరులు. అద్వైత గురు పరంపరయందు ఆదిశంకరులకు ముందుండిన యాచార్య పురుషులలో బ్రహ్మనంది, ద్రవిడాచార్యులు. పతంజలిముని. గౌడపాదాచార్యులు, భర్తృహరి, సుందరపాండ్యుడు, గోవిందభగవత్పాదులు మొదలగు వారు వేద భాష్యమును వివరించి, పరమార్థతత్త్వమును దెలియజెప్పి యాత్మజ్ఞానమును బడయుటకు తోడ్పడిన మార్గదర్శకులగు మహనీయులు. అయినను, అద్వైతసిద్ధాంతమును తొలుదొల్త నిర్ధారణ మొనర్చి, వివరము బోధించి, సనాతనమార్గమును క్రమపఱచి, వైదిక ధర్మము సుస్థిరమై యుండునట్లు భారతదేశమంతట వ్యాపింపజేసిన ఘనత శ్రీ యాదిశంకరులకే చెందును.

ప్రకృతిలోని పదార్థము లన్నింటిని నెలకొనజేసి వాని ప్రవర్తనకు మూలకారణమై యున్నది పరమాత్మ యనియు, ఆ పరమాత్మ

సర్వవ్యాప్తియై సర్వముతానేయై యున్నదనియు నెఱింగి, తానను పర మాత్మ స్వరూపమేనని గ్రహించి యాత్మజ్ఞానమును బొందుటకనువైన యద్వైతసిద్ధాంతమును బోధించి లోకము నుద్ధరించుటకై యవతరించిన మహాపురుషుడు శ్రీ ఆదిశంకరులు.

బ్రహ్మసూత్రమునకు భాష్యము గావించిన ఆదిశంకరులు ఈశ, కేన, కఠ, ముండ, మాండూక్య, తైత్తిరీయ, బృహ దారణ్యక ఉప నిషత్తులకు భగవద్గీతకు, విష్ణుసహస్రనామము, లలితాత్రిశతి మొదలగు స్తోత్రములకు భాష్యముల గావించి యనుగ్రహించిన మహామేధా సంప న్నుడు శ్రీ ఆదిశంకరులు. వీనితోబాటు సామాన్యులు సయితము గ్రహింప గల్గునట్లు సరళమైన శైలిలో ప్రకరణము లనబడు ముప్పది యైదు వ్యాఖ్యాన గ్రంథముల ననుగ్రహించి యున్నారు. వీనిలో వివేక చూడామణి, ఆత్మబోధము, ప్రబోధసుధాకరము, శతశ్లోకి మున్నగు నవి సుప్రసిద్ధములై యున్నవి. శ్రీ శంకరులవారి ప్రకరణములువారి యద్వైత సిద్ధాంత బోధనలను సులభముగా గ్రహించుట కుపయోగ పడుచున్నవి. ఇవిగాక దైవకృపను బడయుట కనువుగ వారు 67 స్తోత్రముల ననుగ్రహించి యున్నారు. వానిలో శివానందలహరి, ఆనందలహరి. దక్షిణామూర్తి స్తోత్రము, అన్నపూర్ణాష్టకము, కనక ధారాస్తోత్రము, లక్ష్మీనృసింహ కరావలంబ స్తోత్రము, భజగోవింద మనునవి దైవముయొక్క కళ్యాణగుణములను వర్ణించి దేవుని దయను సులభముగా బొందుట కుపకారములుగా నున్నవి. భక్తిని కల్గజేసి భక్తిచే పరిపక్వదశను, పరిపాకముచే జ్ఞానమును, జ్ఞానముచేత అద్వైత సిద్ధిని బొంది తరించుటకు తగిన త్రోవను జూపిన మహనీయుడు జగ ద్గురు శ్రీ ఆదిశంకరులు.

కేరళదేశమందలి ' కాలడి ' యను పుణ్యస్థలమున ఆర్యాంబా శివ గురు దంపతులకు వైశాఖ శుద్ధ పంచమినాడు అవతరించిన శ్రీశంకరులు

తను ఐదవయేట గురుకులవాసమునఁజేరి బాల్యముననే వేద, వేదాంత, పురాణ కావ్యాలంకారములను పఠించి జ్ఞానము నార్జించి మేధావియై యొప్పుచుండెను. గురుకులమున వసించుచుండిన బాలకుడగు శంకరు డొకనాడు ద్వాదశి పుణ్యదినమున ప్రాతఃకాలమునందు భిక్షాటనకై చని యొక విప్రుని యింటిముందు నిల్చి భిక్షమడిగెను. అతి దరిద్రుడైన యా విప్రునింట నొక ధాన్యపుగింజయు లేకుండుటచే నాగృహిణి మిగుల వగచి, చిన్నిశంకరుని కిచ్చుట కేమియులేని తమ లేమిని జింతించి చింతాక్రాంతయై తుదకు ఇంటిలో ద్వాదశి పారణకై తన భర్త యుంచి వెళ్ళిన రెండు ఉసిరికాయలలో తనకైన భాగమగు నొక యామలకమును దెచ్చి శంకరుని భిక్షాపాత్రమున నిడి దుఃఖముచే నిల్వలేక కన్నీరుగార్చుచు లోనికి జనెను. ఆ కుటుంబము యొక్క బీదతనమును గుర్తించిన బాలశంకరుడు మనసు గఱిగి యా బీద కుటుంబమును దయతో ననుగ్రహించి కటాక్షింపుమని ప్రార్థించి లక్ష్మీదేవిని స్తుతింపగనే యనుగ్రహప్రదయగు లక్ష్మీకటాక్షమున బంగారపు టుసిరికలు వర్షించి యా బీదకుటుంబము యొక్క దారిద్ర్యము దీరునట్లు చేసెను. బాలశంకరులచే స్తుతింపబడుటంజేసి జాలిగల్గిన శ్రీదేవి బంగారమును వర్షింప చేయుటచే బాలశంకరులనుగ్రహించిన యీ లక్ష్మీస్తోత్రము "కనకధారా స్తోత్ర"మన ప్రఖ్యాతిగాంచియున్నది. కనకము—బంగారమును, ధార —వానవలె గుఱియుటచే నీ స్తోత్రము కనకధారా స్తోత్రమనబరిగి ప్రసిద్ధమైయున్నది

సన్యాసము స్వీకరించుటకు తల్లి సమ్మతినొసంగిన బాలశంకరుడు కాలడినుండి బయలుదేరి పాదచారియై పర్వతారణ్యములను దాటి పలు ప్రాంతములను, క్షేత్రములను దర్శించి పుణ్యజలంబుల నీరాడి, నర్మదా నదీతీరమునకు వచ్చిచేరెను. నర్మదానదీతీరమునకు నొక కొండగుహలో తపమాచరించుచుండిన గోవింద భగవత్పాదులను మహాత్ముని శంకరుడు

దర్శించి వందన మొనరించెను. శంకరుని మనఃపక్వమను గుర్తించిన గోవింద భగవత్పాదులవారు శంకరుని జ్ఞానదీక్షనొసగి సన్యాసము నను గ్రహించి మహామంత్రోపదేశ మొనరించి యద్వైతమును జ్ఞానసిద్ధిని ప్రసాదించి కటాక్షించిరి. వేదోపనిషత్తులందును, బ్రహ్మసూత్రము లందును, భగవద్గీతయందును ఇమిడియున్నతత్త్వమే అద్వైతమనబడు చున్నది అట్టి అద్వైతతత్త్వమును నిర్ధారణమొనర్చి భారతమంతయు ప్రచారమొనరించి యద్వైత సిద్ధాంతము దేశమున నెలకొనునట్లు చేసిన మేధాసంపన్నుడు ఆదిశంకరులు.

'తత్త్వమసి'—అది నీవేయనునది తత్త్వము. 'అది' యనునది యన్నింటికి మూలాధారమైన పరమాత్మ; పరబ్రహ్మము అదియే మనోవాక్కాయ కర్మలందిమిడియున్న యున్నత తత్త్వము. సర్వ వ్యాప్తియై సర్వకాల సర్వావస్థలయందు స్థిరముగా నుండి సర్వముతానై సర్వమునందిమిడి యుండునది నిర్గుణమైన బ్రహ్మము. బ్రహ్మము దేశకాలవస్తు భేదముల కతీతమైనది.

బ్రహ్మముగాని పదార్థము ప్రకృతిలో లేదను భావమున సర్వము బ్రహ్మమయమని దెలియచెప్పునది యద్వైతము. సర్వము తానై యున్నదనుటచే పరమాత్మయే జీవముగల్గిన జీవాత్మగను ఉన్నదనియు రెండును వేరుగాదనియు, ఉన్నది యొకటే యనియు, ఆ యుండునది బ్రహ్మమొకటేయనియు, జీవుడు దానినుండి వేరుగాదనియు దెలియ జెప్పునది యద్వైత సిద్ధాంతము. ఇదియు నదియు నొకటే యనునది యద్వైత సిద్ధాంతము. నీరు, నీటిబుడగలవలె రెండును యొకటేనని భావము. నీటిబుడగ నీటిలో నేర్పడి, నీటినుండి నీటిలో గలసిపోవు నట్లు జీవాత్మ పరమాత్మలకు భేదములేదని దెలుపునది యద్వైతము. ఈ రెండింటికి గనుపించు వ్యత్యాసము కేవలము కల్పితము. భావ

మాత్ర భేదముచేత నొకే పదార్థము రెండు వేరువేరుగా నున్నట్లు దోచుచున్నది.

'తాను — నేను' — అనుశబ్దము లొకేయర్థము నిచ్చు పర్యాయ పదములు. 'నీవు, అతడు, అది' యను శబ్దములు ప్రతీతి మాత్రములు. నేను అను దానియందే కల్పింపబడిన వికల్పములు. కావున తనకంటే యాత్మకంటే వేరుగాదోచు పదార్థములన్నియు కల్పనామాత్రములేయని యుపనిషత్తుల సిద్ధాంతము. ఈ తాను నేను యను శబ్దములు ఆత్మను బోధించునట్టివి. ఆత్మ యనగా పరమాత్మయేగాని వేరుగాదు ఈ యాత్మ పరమాత్మలను వేరు జేయునది అంతఃకరణము లేక మనసు. ఈ యంతఃకరణమనునది మనసు, బుద్ధి, చిత్తము, అహంకారములని నాల్గు విభాగములుగా నున్నది. మనోహరరూపమున సంకల్ప వికల్పములు; బుద్ధిరూపమున నిశ్చయము; చిత్తరూపమున స్మరణము; అహంకారమున నేను, నాది యనుభావము గల్గుచున్నది. ఇన్నింటి సమిష్టిరూపమే యంతఃకరణము.

అద్దములో మన ముఖమే మఱియొకటిగా గన్పించునట్లు యీ యంతఃకరణమను అద్దమందు పరమాత్మయే ప్రతిబింబమై జీవాత్మగా దోచుచున్నది. ప్రతిబింబమగు జీవాత్మ పరమాత్మ స్వరూపమేగాని వేరుగాదనియు, విశ్వమంతయు పరమాత్మ స్వరూపమేయనియు తత్త్వ శాస్త్ర నిర్ణయము. "ఈశ్వరః సర్వభూతానాం" — సర్వభూతములలో నంతర్యామియై యీశ్వరుడున్నాడు అనునది తత్త్వము.

జీవాత్మ తానున్న శరీరమే తాననియెంచి తనయందిమిడియున్న పరమాత్మను గుర్తించి తాను పరమాత్మ స్వరూపమేయని గ్రహింప లేకుండునట్లు జేయునది మాయ. మాయ యన ఏదిలేదో యద్దాని నున్నట్లు భ్రమింపజేయునది యని యర్థము. నిజమును గప్పి యుంచునది మాయ. నిత్యమైన బ్రహ్మమును గప్పివేసి యనిత్యమైన

దేహమును శాశ్వతమని యెంచఁజేయునది మాయ. నశించు స్వభావము గల్గుటచేతనే జగము, బ్రతుకు మాయ యనబడుచున్నవి. మాయను జయించి తాను, లోకమంతయు నొకే బ్రహ్మమయమని యెంచి తానను బ్రహ్మమేయని దెలియును. అనగా జీవాత్మ తాను పరమాత్మ స్వరూపమేనని గుర్తించుటను మోక్షమనియు, జీవన్ముక్తియనియు, సోహం భావమును బొందుటయనియు జెప్పుదురు. 'అహం బ్రహ్మాస్మి' - నేను బ్రహ్మమును అని యెంచుటయే సోఽహం భావము, సః+అహం= సోహం — అతడే నేను అనెడి తాదాత్మ్యభావమును కలిగియుండుటయే సోహంభావ ప్రాప్తి లేక జీవన్ముక్తి. అదే అద్వైత లక్ష్యము.

అ+ద్వైతము = 'అద్వైతము' — రెండుగానిది; అనేకము గానిది; ఒకటేయైనది; పరమాత్మ యొక్కటే యనునది సంకేతము. ఈసత్యమును గ్రహించుటను బ్రహ్మసాక్షాత్కారము బొందుటయనియు తన్ను తానెఱుగుట యనియు యందురు. బ్రహ్మ సాక్షాత్కారము బొందుటకు జ్ఞానము సాధనము, పంచేంద్రియముల నణచియుంచుటయే జ్ఞాన సముపార్జనకు మార్గము. ఫలాపేక్ష లేక చేయబడు కృత్యముల వలన మనస్సు పరిశుద్ధమగు చున్నది; నిష్కామ్యకర్మచే మనశ్శుద్ధి యేర్పడి తన్ను తానెఱుగవలెనను బుద్ధి గలుగుచున్నది; పరమాత్మ నెఱుగవలెనను బుద్ధిగల్గినపుడు దానికైన మార్గముల నన్వేషించి భక్తి ఉపాసనామార్గములవలన ఏకాగ్రచిత్తముగల్గి బ్రహ్మము నరయు జ్ఞానమును బొందగల్గుచున్నది. ఆత్మజ్ఞానము గల్గునపుడు మధ్యనున్న మాయ తనంతతాను పరమాత్మ స్వరూపమేనని దెలిసికొనగల్గును. సర్వవ్యాప్తియగు పరమాత్మ స్వరూపమేనని తానని దెలిసికొనినపుడు ప్రకృతిలోని జీవరాసులన్నియుఁ దనవలె పరమాత్మస్వరూపమై యుండుటను గుర్తించి యన్నింటిని యొకేవిధముగనెంచి ప్రేమించి స్నేహభావ

ముతో మెలగగల పరిపక్వము గల్గుచున్నది ఈ స్థితిని బొందినవారిని బ్రహ్మజ్ఞానులనియు, జీవన్ముక్తులనియు, ఉత్తమ పురుషులనియు నందురు.

" అద్వేష్టాసర్వ భూతానాం మైత్రః కరుణఏవచ
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖఃక్షమీ "

అని ఉత్తమ పురుషలక్షణము భగవద్గీతయందు వివరింపబడి యుండుటఁ దెలియనగును. అహంకార మమకారములను వీడి సర్వ జీవరాసులను స్నేహభావముతోఁ బ్రేమించుట, రాగరహితులై నిష్కామ్యముతో ననివార్యమైన కర్మల జేయుచు ఫలాపేక్ష లేక సుఖదుఃఖముల నొకేరీతిని నెంచగల సమభావమును గల్గియుండుట యుత్తమ పురుషలక్షణముగఁ బరిగణింప బడుచున్నది. నిత్యానిత్య వివేక విచారమే యాత్మవిచారము; ఆత్మపరమాత్మ స్వరూపమేనని దెలియుటయే జ్ఞానము; జ్ఞానము పరమాత్మను తమ యాత్మస్వరూపముగ నెఱింగి యద్వైత సిద్ధినందుదురు. ఇదియే అద్వైతముయొక్క లక్ష్యము.

మాయ యను వలలో జిక్కి దిక్కుదెలియక తల్లడిల్లు పామర జనులకు, పరమాత్మను నిర్గుణబ్రహ్మముగనెంచు సోహంభావమును బొందుట సాధ్యము గాకుండుటచే, యాత్మ పరిపక్వమును బొందుటకు భక్తిమార్గము సులభమైనదని గుర్తించిన ఆదిశంకరులు భవసాగరమీదుటకు భక్తియే సులభసాధనమని జనులు గ్రహించుట కనువుగ షణ్మత స్థాపన మొనర్చి లోకోపకారము గావించిరి

ధర్మము స్థిరమైనది. సుఖదుఃఖము లనిత్యములు. జీవుడు నిత్యమై యుండ జీవన మనిత్యమై యున్నది. సుఖమని యెంచబడున వన్నియు అస్థిరమై దుఃఖమున ముగియుచున్నవని గ్రహించి ప్రాపంచిక సుఖములను బొంద నిచ్ఛగింపక రాగరహితులై భగవద్భక్తిని గల్గి

యుండుట తరుణోపాయము. భగవంతుని యనుగ్రహముచే ఆత్మశుద్ధి గల్గి చిత్తమునకు విలక్షణమైన సుఖానుభవము బొందువరకు పరిపరి విధముల భగవంతుని వేడుకొనుటయే భక్తిలక్షణము. భక్తిమార్గమున పరమాత్మయగు భగవంతుడు నాయకునిగను, ఆత్మవస్తువగు భక్తుని దాసుడిగాను పరిగణించుటచే ఆత్మ పరమాత్మలు వేరువేరుగానున్నట్లు గోచరించినను బ్రహ్మజ్ఞానుల స్థితిని బొందువరకు ఈ భావము ఆధ్యాత్మిక చింతనమున పురోగమించుట కత్యావశ్యకమగుచున్నదని పెద్దల అభిప్రాయము భగవద్ధ్యానముచే నేకాగ్రచిత్తము, దానిచే నేకాంత సమాధి బాగ్యముగల్గి యాత్మానుభవమును బొందుట పరమ భక్తుల లక్షణము. దీనినే సాధనమనియు, ఉపాసనమనియు, అనుసంధాన మనియు నందురు మహనీయుల యుపాసనాపద్ధతులు, సంప్రదాయములు వేర్వేరుగా నున్నను, అందరి తీరులందును ధ్యాన, ధారణ, సమాధి భాగ్యములు సమానముగానుండుట గుర్తింపదగినది. ఎవరే రూపమున నుపాసించినను లక్ష్యమొక్కటై యుండుట నిజము. శంకరుల షణ్మత స్థాపనము భక్తి మార్గమును బలపఱచుటచే ఈ భక్తి జ్ఞాన సముపార్జనకు మార్గమై అద్వైత సిద్ధాంతమును గ్రహించుటకు ఉపకరణమై యున్నదని యెంచబడుచున్నది వ్యవహార ప్రపంచమందు ద్వైతము సహజమై గన్పట్టినను, పరమార్థమునందు అద్వైతము పరమసత్యమై యున్నది.

"దేహ బుద్ధ్యాతు దాసోహం,
జీవబుద్ధ్యాత్వ దంశకః
ఆత్మ బుద్ధ్యాత్వమేవాహం
ఇతి వేదాంత డిండిమః"—

దేహబుద్ధితో దాసుడనియు, జీవబుద్ధితో పరమాత్మయంశమనియు ఆత్మబుద్ధితో పరమాత్మయేయనియు నెంచబడుచున్నదని మూడు భూమిక

లందు జెప్పబడిన ఆదిశంకరుల సమన్వయమందులకు పరిష్కారమై యొప్పుచున్నది. భక్తిచే జ్ఞానము, జ్ఞానముచే నాత్మ విచారము, యాత్మ విచారముచే నద్వైత సిద్ధి గల్గుచున్నది. దీనినే జీవన్ముక్తి యని యందురు. జీవన్ముక్తికి మంచివారి సహవాసము — సత్సంగతి — భగవద్గోష్ఠి జ్ఞానుల సంగతి ప్రధానమని ఆదిశంకర కృత భజగోవింద స్తోత్రమున వివరింపబడియుండుట దెలియనగును.

"సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలచిత్తం
నిశ్చలచిత్తే జీవన్ముక్తి "—

మంచివారి సమూహమున నుండుటచే బంధము లేర్పడుటలేదు. బంధములు లేకుండుటచే రాగద్వేషములు గల్గుటలేదు. రాగరాహిత్యము నిశ్చల చిత్తమును బొందుటకైన యోగ్యత. నిశ్చల చిత్తమను బొందుటయే జీవన్ముక్తి యనుటనుండి యాదిశంకరులు సజ్జన సహవాసము జీవన్ముక్తికి దోహదమగుచున్నదని విశదపఱచియుండుట గుర్తింపదగినది జీవన్ముక్తికి సజ్జన సహవాస ముపకరణమనుటచేతను, భగవద్భక్తికి సజ్జనలక్షణమగుటచేతను భక్తి అద్వైతసిద్ధికి సాధనమగు జ్ఞానలబ్ధికి ఆధారమైయున్నదని గ్రహింపనగును. పుణ్యభారతమును పాదచారియై దిగ్విజయమొనర్చి, యద్వైత సిద్ధాంతమును నెలకొల్పి వేదధర్మము నిలిచియుండునట్లుచేసి, జనులకు భక్తిని, తద్వారా జ్ఞాన సముపార్జనాసక్తిని గల్గజేసి యద్వైతమును బోధించి లోకోపకార మొనరించిన మోక్షమార్గ దర్శకులు జగద్గురు శ్రీ యాది శంకరులు.

భూమికి నాభిస్థానమై యొప్పు శ్రీ కాంచీక్షేత్రమున జ్ఞానస్వరూపిణియై విరాజిల్లు పరాంబికయగు శ్రీకామాక్షీదేవి మనలనెల్ల కరుణచూచి

కాపాడుట కనువుగ శ్రీకామకోష్ఠమున శ్రీచక్ర ప్రతిష్ఠజేసి, జనులు ధర్మమార్గమున నడిచి తరించుటకు, వైదిక ధర్మము సుస్థిరమై నిలచి యుండుటకు తోడ్పడుటకై శ్రీకామకోటి పీఠమును స్థాపించి మహోపకార మొనరించిన మహనీయులు జగద్గురు శ్రీ ఆదిశంకరులు.

శ్రీకాంచీక్షేత్రమునందు తమచే స్థాపింపబడిన శ్రీకామకోటిపీఠమునందు తమచే కైలాసమునుండి దేబడిన స్ఫటికలింగము లైదింటిలో యోగలింగమును(తమ)యాత్మార్థపూజకై యుంచుకొని కంచిలో వసించు జనులను జ్ఞానభక్తిమార్గమున నడిపించుచుండిరి. శ్రీ ఆదిశంకరుల సర్వజ్ఞపీఠారోహణ వైభవము శ్రీ శంకర విజయము, బృహత్ శంకర విజయము, ఆనందగిరి విజయము మొదలుగాగల గ్రంథములందు విస్తారముగా వర్ణింపబడి యుండుట దెలియనగును. ఆదిశంకరులారాధించిన శ్రీ చంద్రమౌళీశ్వరుడే నేటికిని శ్రీ కాంచికామకోటి పీఠాధిపతుల యారాధ్యదైవమై విరాజిల్లుచుండుట శ్రీ కామకోటి పీఠము యొక్క మహిమను వెల్లడించుచున్నది.

అద్వైత సిద్ధాంతము ప్రపంచమున నెలకొని యుండుటకై జగద్గురు శ్రీ ఆదిశంకరులవారిచే స్థాపింపబడిన పీఠములలో శ్రీ కాంచీ కామకోటి పీఠము సుప్రసిద్ధము. శ్రీ ఆదిశంకరుల మార్గమున వచ్చిన గురు పరంపరలోని యాచార్యులైన శ్రీ కాంచి కామకోటి పీఠాధిపతులు లోక క్షేమమునకై శ్రీ చంద్రమౌళీశ్వరునారాధించి, శ్రీకామాక్షీదేవిని గొలుచుచుండుట వారి దయార్ద్రహృదయమును సూచించుచున్నది. శ్రీ కాంచి కామకోటి పీఠాధిపతుల వరుసలలో నొకరైన శ్రీ మూకశంకరులు పుట్టు మూగయైయుండి పిదప శ్రీ కంచికామాక్షి యమ్మవారి యనుగ్రహమున మాటాడుశక్తివిబొంది వరకవియై విలసిల్లి శ్రీ కామాక్షి కరుణావిలాసమును యైదువందల శ్లోకములలో గీర్తించి యున్నారు. శ్రీమూకశంకరులవారిచే ననుగ్రహింపబడిన యీ యైదువందల శ్లోకములు మూక

పంచశతి యను పేర ప్రసిద్ధమై యున్నవి. శ్రీ కామకోటి పీఠాధిపతుల దీక్షానామముతోబాటు "ఇంద్రసరస్వతి" యని జేర్చి నుతించుట పరిపాటియై యున్నది.

శ్రీ కాంచి కామకోటి పీఠాధిపతులు, జగద్గురువులు.

శ్రీ శంకరాచార్యస్వాముల గురు పరంపరక్రమము.

1. జగద్గురు శ్రీ శంకరభగవత్పాదాచార్యులు
2. శ్రీ మండన మిశ్రులనబడు శ్రీ సురేశ్వరాచార్యులు
3. శ్రీ సర్వజ్ఞాత్మేంద్ర సరస్వతి స్వాములు
4. శ్రీ సత్యబోధేంద్ర సరస్వతి స్వాములు
5. శ్రీ జ్ఞానానందేంద్ర సరస్వతి స్వాములు
6. శ్రీ శుద్ధానందేంద్ర సరస్వతి స్వాములు
7. శ్రీ అనంతానందేంద్ర సరస్వతి స్వాములు
8. శ్రీ కైవల్యానందేంద్ర సరస్వతి స్వాములు
9. శ్రీ కృపాశంకరేంద్ర సరస్వతి స్వాములు
10. శ్రీ సురేశ్వరేంద్ర సరస్వతి స్వాములు
11. శ్రీ శివానందచిద్ఘనేంద్ర సరస్వతి స్వాములు
12. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములు [1]
13. శ్రీ సచ్చిద్ఘనేంద్ర సరస్వతి స్వాములు
14. శ్రీ విద్యాఘనేంద్ర సరస్వతి స్వాములు
15. శ్రీ గీష్పతి గంగాధరేంద్ర సరస్వతి స్వాములు
16. శ్రీ ఉజ్జ్వల శంకరేంద్ర సరస్వతి స్వాములు
17. శ్రీ సదాశివేంద్ర సరస్వతి స్వాములు
18. శ్రీ యోగితిలక సురేంద్ర సరస్వతి స్వాములు
19. శ్రీ మార్తాండ విద్యాఘనేంద్ర సరస్వతి స్వాములు
20. శ్రీ మూకశంకరేంద్ర సరస్వతి స్వాములు

21. శ్రీ సార్వభౌమ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములు
22. శ్రీ పరిపూర్ణబోధేంద్ర సరస్వతి స్వాములు
23. శ్రీ సచ్చిత్సుఖేంద్ర సరస్వతి స్వాములు
24. శ్రీ చిత్సుఖేంద్ర సరస్వతి స్వాములు
25. శ్రీ సచ్చిదానంద ఘనేంద్ర సరస్వతి స్వాములు
26. శ్రీ ప్రజ్ఞాఘనేంద్ర సరస్వతి స్వాములు
27. శ్రీ చిద్విలాసేంద్ర సరస్వతి స్వాములు
28. శ్రీ మహాదేవేంద్ర సరస్వతి స్వాములు [1]
29. శ్రీ పూర్ణబోధేంద్ర సరస్వతి స్వాములు [1]
30. శ్రీ బోధేంద్ర సరస్వతి స్వాములు
31. శ్రీ శీలనిధి బ్రహ్మానంద ఘనేంద్ర సరస్వతి స్వాములు
32. శ్రీ చిదానంద ఘనేంద్ర సరస్వతి స్వాములు
33. శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతి స్వాములు
34. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములు [2]
35. శ్రీ బహురూప చిత్సుఖేంద్ర సరస్వతి స్వాములు
36 శ్రీ చిత్సుఖానందేంద్ర సరస్వతి స్వాములు
37. శ్రీ విద్యాఘనేంద్ర సరస్వతి స్వాములు [2]
38. శ్రీ ధీర అభినవశంకరేంద్ర సరస్వతి స్వాములు
39. శ్రీ సచ్చిద్విలాసేంద్ర సరస్వతి స్వాములు
40. శ్రీ శోభన మహాదేవేంద్ర సరస్వతి స్వాములు
41. శ్రీ గంగాధరేంద్ర సరస్వతి స్వాములు
42. శ్రీ బ్రహ్మానంద ఘనేంద్ర సరస్వతి స్వాములు
43. శ్రీ ఆనందఘనేంద్ర సరస్వతి స్వాములు
44. శ్రీ పూర్ణబోధేంద్ర సరస్వతి స్వాములు
45. శ్రీ పరమశివేంద్ర సరస్వతి స్వాములు [1]
46. శ్రీ శాంతానందేంద్ర సరస్వతి స్వాములు

47. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములు [3]
48. శ్రీ చిద్విలా స అద్వైతానంద బోధేంద్ర సరస్వతి స్వాములు
49. శ్రీ మహాదేవేంద్ర సరస్వతి స్వాములు [2]
50. శ్రీ చంద్ర చూడేంద్ర సరస్వతి స్వాములు [1]
51. శ్రీ విద్యాతీర్థేంద్ర సరస్వతి స్వాములు
52. శ్రీ శంకరానందేంద్ర సరస్వతి స్వాములు
53. శ్రీ పూర్ణానంద సదాశివేంద్ర సరస్వతి స్వాములు
54. శ్రీ వ్యాసాచల మహాదేవేంద్ర సరస్వతి స్వాములు
55. శ్రీ చంద్ర చూడేంద్ర సరస్వతి స్వాములు
56. శ్రీ సర్వజ్ఞ సదాశివ బోధేంద్ర సరస్వతి స్వాములు
57. శ్రీ పరమశివేంద్ర సరస్వతి స్వాములు [2]
58. శ్రీ విశ్వాధిక ఆత్మబోధేంద్ర సరస్వతి స్వాములు
59. శ్రీ భగవన్నామ బోధేంద్ర సర స్వతి స్వాములు
60. శ్రీ అద్వైతాత్మ ప్రకాశేంద్ర సరస్వతి స్వాములు
61. శ్రీ మహాదేవేంద్ర సరస్వతి స్వాములు [3]
62. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములు [4]
63. శ్రీ మహాదేవేంద్ర సరస్వతి స్వాములు [4]
64. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములు [5]
65. శ్రీ సుదర్శన మహాదేవేంద్ర సరస్వతి స్వాములు
66. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములు [6]
67. శ్రీ మహాదేవేంద్ర సరస్వతి స్వాములు [5]
68. శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములు [7]
69. శ్రీ జయేంద్ర సరస్వతి స్వాములు
70. శ్రీ శంకర విజయేంద్ర సరస్వతి స్వాములు

శ్రీ కంచి కామకోటి పీఠము నధిష్ఠించిన యాచార్యవరేణ్యుల వరుసలలో నేడు 68 వ యాచార్యులుగ జగద్గురు శ్రీ శంకరాచార్య

శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వాములవారును, 69 వ యాచార్యులైన జగద్గురు శ్రీ శంకరాచార్య శ్రీ జయేంద్ర సరస్వతి స్వాములవారును 70 వ యాచార్యులుగ జగద్గురు శ్రీ శంకరాచార్య శ్రీ శంకరవిజయేంద్ర సరస్వతి స్వాములవారును దయామయులై విరాజిల్లుచు నేడు మనలను భక్తిమార్గమున నడిపించుచున్నారు. జనులలో భక్తిభావము పెరిగి ధర్మమభివృద్ధి జెందుటకై శ్రీ యాచార్యస్వాములవారిచే నేర్పాటుపబడి శ్రీ స్వాములవారి యనుగ్రహబలముతో వారి యాదేశానుసారముగ నడచుచున్న కంచిలోని యాధ్యాత్మిక ధర్మ సంస్థలలో శ్రీ శంకర భక్త జనసభ, హిందూమతసమాజము, హిందు తమిళ రచయితల సంఘము, ఆధ్యాత్మిక సేవా సమాజము, భారతి సంఘము, శ్రీ పచ్చవణ్ణర్ పవళవణ్ణర్ భక్తజనసభ. శ్రీకంచికామాక్షియంబ దేవస్థానము శ్రీ శారద నవరాత్రి కళాకార్య క్రమ ట్రస్టు మొదలగు ధర్మసంస్థలు ప్రసిద్ధమై జనులందు భక్తిబావమును బెంపొందించుటలో నత్యంత కృషియొనర్చి ప్రశంసనీయమై విరాజిల్లుచున్నది.

శ్రీ కంచికామకోటిపీఠముచే కాంచీపురముననుం, దేశమందలి పలు చోట్లను వేదపాఠశాలలు నడుపబడుచున్నవి. శ్రీశంకరమఠముయొక్క యాదరణమున కుంభకోణమునందు వేదధర్మ పరిపాలనసభ నెలకొల్ప బడి దానిమూలముగా దేశమంతట వేదధర్మ సదస్సులు, మతసంబంధమైన ప్రసంగములు ఏర్పాటుజేయబడుచున్నవి. శ్రీ మఠముయొక్క యాదరణతో మద్రాసులో స్థాపింపబడియున్న శ్రీ ఆదిశంకర అద్వైత ప్రచారక నిలయముచే శ్రీ ఆదిశంకరుల గ్రంథములు ప్రచురింపబడుచున్నవి. సంప్రదాయ బద్ధముగా వివాహములను జరుపనెంచు బీదకుటుంబస్థులకు శ్రీమఠముయొక్క యాదరణతో స్థాపించబడియున్న 'కన్యకాదానట్రస్టు' వారు వధూవరులకై నూతనవస్త్రములు, మాంగల్యము శ్రీయాచార్య

స్వాముల యనుగ్రహ ప్రసాదముతో నుచితముగ నొసగి తోడ్పడుట శ్లాఘనీయము. ఇట్లే శ్రీమఠముయొక్క యాదరణతో ధర్మోపనయనములు, సమిష్ఠియుపనయనములు జరిపింపబడుచున్నవి.

శ్రీ కాంచి యాచార్య స్వాములవారిచే ప్రారంభింపబడి దేశము నందలి పలుప్రాంతములలో జయప్రదముగ నెఱవేర్చబడుచున్న 'పిడికెడు బియ్యము 'పథకముక్రింద ధర్మచింతన గల్గినవారి యింటింట దినమున కొకపిడికెడు బియ్యము ప్రత్యేకముగ నుంచబడి వారి యిండ్లనుండి నెలకొకసారి యాబియ్యమును సేకరించి యొక దేవాలయమున వండించి స్వామికి నైవేద్యము జేసిన పిదప యా యాహారమును బీదలకు వినియోగించుట బహుళ వ్యాపకమై ప్రజాదరణను బొందియున్నది.

క్షేత్రపరిపాలన సంఘమును స్థాపించి నేర్పఱచి దానిమూలముగ వసతిలేని యాలయములయందు రెండువేళల దీపము వెలిగించుటకును, ఒకవేళ నైవేద్యమునకునునైన ధనసహాయ మొనరించుటతోబాటు క్షీణదశలోనున్న యాలయములను జీర్ణోద్ధారణ మొనరించుటకు సయితము సాధ్యమైనంత సహాయము జేయబడుచుండుట ప్రశంసనీయము. ఇది గాక కొన్నిచోట్ల ధర్మవైద్యశాలలను స్థాపించి ఉచిత వైద్య వసతులు గల్పింపబడియుంచుట, పండుగ దినములందు వైద్యశాలలలో చికిత్స బొందుచున్నవారికి దగిన తీపిపదార్థములను బంచిపెట్టుట మొదలగు సాంఘిక సేవాచర్యలు శ్రీ కాంచిశంకర మఠముయొక్క యాదరణతో జరుగుచుండుట ప్రశంసనీయమైయున్నది.

ప్రపంచములోని హిందువులలో నైకమత్యమును బెంపొందించి హిందుమత సంబంధమైన విషయములను ప్రపంచమందలి హిందువు

లందరు దెలిసికొనుట కనువుగ శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శంకరాచార్య శ్రీ జయేంద్ర సరస్వతీ స్వాములవారిచే 1976 వ సంవత్సరమున విశ్వహిందు పరిషత్తు ప్రారంభింపబడియుండుట మనభాగ్యము. శ్రీ ఆచార్య స్వాముల యనుగ్రహబలముతో నెలకొల్ప బడిన సేలం గెజ్జెలపేట యందలి గీతా ట్రస్టువారిచే సేలం నగరమున హిందుమత కళాశాల, కోయంబత్తూరునందు ఆయుర్వేద కళాశాల నడుప బడుచున్నవి. కంచిలోను, మద్రాసులోను గోసంరక్షణ శాలలను నిర్మాణించి జనులచే అనాదరణముగ వదలివేయబడిన ముసలి పశువులు సంరక్షింపబడుటయు, యీ పశువుల మేతకై ప్రజలు తమంత తామే ముందుకువచ్చి మనస్ఫూర్తిగ విరాళముల నొసగి ప్రోత్సహించుటయు శ్రీమఠమువారి యీ సత్కార్యమునకు గల జనాదరణను వెల్లడించు చున్నది. శ్రీకాళహస్తిలో వయోధికులకైన యొకవిడిదిని యేర్పాటు జేసి యరవై యేండ్లకు పైబడిన ముసలివారికి వారివారి యోగ్యతాంశ ములననుసరించి యనుష్ఠానమునకైన యేర్పాట్లు, ఉచిత భోజనవసతులు గల్పింపబడి యుండుట ప్రశంసనీయము.

కాంచీపురములోని శ్రీ కామాక్షియమ్మవారి దేవస్థానము, తంజా వూరులోని శ్రీ బంగారుకామాక్షి దేవస్థానము, తిరయానైక్కోయిల్ శ్రీ పంచముఖేశ్వరస్వామి దేవస్థానము, తిరువిడైమరుదూరు శ్రీ విశ్వ నాధస్వామి, శ్రీ వరదరాజస్వామి దేవాలయములు, శ్రీ కాంచికామకోటి పీఠముయొక్క శ్రీమఠ నిర్వహణలో నున్న దేవాలయములు. కంచి శ్రీ శంకరమఠముయొక్క యాదరణలో హరిద్వారమునందు శ్రీశంకర మాత గుడియు, పూరిక్షేత్రమున శ్రీ ఆదిశంకరులు, జయదేవుడు, చైతన్యుల మందిరములు, నేపాళము, హృషీకేశము, కురుక్షేత్రము, బదరినాధ్. తిరుపతి క్షేత్రములందు శ్రీ ఆదిశంకరుల మంటపములు

కన్యాకుమారి, తిరువనంత పురములందు శ్రీ ఆదిశంకర పాదుకా మంటపములు, శీర్గాళిలో తిరుజ్ఞానసంబంధమూర్తి స్వాములవతరించిన గృహమగు జ్ఞాపకచిహ్నమందిరము నిర్మింపబడి మహిమాన్వితములై యున్నవి.

శ్రీ ఆదిశంకరులవతరించిన కేరళయందలి కాలడియను పుణ్యస్థలమున 152 అడుగుల యెత్తుగల జగద్గురు శ్రీ ఆదిశంకరుల కీర్తిస్తంభము శ్రీ కంచి కామకోటి పీఠాధిపతుల యాదేశానుసారము నిర్మింపబడి 1978 వ సంవత్సరము జనవరి 26 వ తేదీన భారత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డిగారిచే యావిష్కరించబడి యాత్రికులచే దర్శింపబడుట శ్రీ ఆదిశంకరుల కీర్తితోబాటు శ్రీ కాంచి కామకోటి పీఠముయొక్క ఘనతను జాటుచున్నవి.

హిందూ మతాభివృద్ధికిని, సమూహ క్షేమమునకును శ్రీ శంకర మఠముద్వారా పలువిధములైన సత్కార్యములను జేయించుటతోబాటు తిరుప్పావై తిరువెంబావై మహాసభలను, సమయ శిక్షణకేంద్రములను నడిపించి, హిందుమత సంబంధమైన గ్రంధములను వెలువరించి జనులను భక్తిమార్గమున నడిపించి ప్రజలలో ప్రేమ, సహనము, ఐకమత్యము పెఱుగుటకు తోడ్పడి లోకోపకార మొనరించుచున్న శ్రీ కాంచి యాచార్యుల కారుణ్యము వర్ణనాతీతము.

సద్భక్తిచే సద్బుద్ధి దానిచే చిత్తశుద్ధి దానివలన మనోవికాసము గలిగి విశ్వప్రేమ వెలువడి సోహంభావముతో బ్రహ్మానందము ననుభ

వింపగల యద్వైతసిద్ధిని బొందుటకు వీలగుచున్నదను నిత్యసత్య మును తేటతెల్లముగఁ దెలియజెప్పి సనాతన ధర్మాచరణము నందాసక్తిని గల్గజేసి, భక్తిమార్గమున మనలను నడిపించి యనుగ్రహించుచున్న దయామయులగు శ్రీ కాంచికామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శంకరా చార్య స్వాములవారి పాదారవిందముల నాశ్రయించి నుతియించి కంచిలో వెలసి కారుణ్యమును వర్షించి గాపాడుచున్న శ్రీ కామాక్షి యమ్మవారిని గొలుచుట మనము మంచి మనసుతో మంచి త్రోవను నడచి మంచి వారమై జీవించుటకు మంచిమార్గము.

జయజయ శంకర ! హరహర శంకర !

—:o:—

# శ్రీ మరకతవర్ణస్వామి-శ్రీ ప్రవాళవర్ణస్వామి దేవస్థానములు



(శ్రీ పవళవణ్ణర్ స్వామివారు)

శరణాగత వత్సలుడగు సర్వేశ్వరుడు కల్యాణగుణ సమన్వితు డగుటంజేసి కారుణ్యాతిరేకమున నాశ్రితుల మనోభీష్టములనుదీర్చి యను

గ్రహించి భక్తులను గాచుట కనువుగ నర్చావతార రూపమున నందందు వెలసియుండు పుణ్యస్థలములలో సత్యవ్రత క్షేత్రమగు కాంచీపురమున నెలకొన్న శ్రీ వైష్ణవ దివ్యదేశములందు శ్రీ ప్రవాళవర్ణస్వామి దేవాలయము సుప్రసిద్ధము.

జనులు యుగధర్మము ననుసరించి పాపపుణ్యముల నాచరించెద రనియు, తదనుగుణముగా ధర్మాధర్మ నిర్ణయము జరుగుచున్నదనియు జెప్పబడుచున్నది. కృతయుగమందలి ప్రజలు ధర్మరసికులు; త్రేతా యుగములోనివారు ధర్మార్థరసికులు; ద్వాపరయుగమువారు ధర్మార్థ కామరసికులు; కలియుగములోనివారు కేవలము అర్థకామరసికులై యున్నారని పెద్దల యభిప్రాయము. యుగధర్మము ననుసరించి మనో ధర్మము మార్పుజెందుట సహజము. మనోధర్మము ననుసరించి చింత నాశక్తి తద్యుక్తమైన శ్రద్ధా ప్రయత్నము లేర్పడి తదుచితమైన ఫల ప్రాప్తి గల్గుచున్నది. "యద్భావమ్ తద్భవతి" – యనుటచేతను, భగవంతుని యాత్మసంభవుడని యనుటచేతను, భగవంతుడు భక్తుల మనోభావమున కనుగుణముగ, యుగధర్మానుసారము వివిధమైన వర్ణ ములలో గన్పట్టుచుండెనని పురాణములనుండి తెలియనగుచున్నది.

కృతయుగమున జీవించినవారు పుణ్యాత్ములై సత్యగుణ సంప న్నులై శుద్ధమైన వర్ణమునందభిలాష గలిగినవారై యుండినందున వారికొఱకై కృతయుగమున భగవన్నారాయణుడు శ్వేతవర్ణుడై తెల్లని రంగుతో సాక్షాత్కరించినట్లు చెప్పబడియున్నది. త్రేతాయుగమున రక్తవర్ణుడై పగడమువంటి రంగుగలవాడై ప్రవాళవర్ణముతోను, ఎఱ్ఱని రంగుతోను, బంగారుచాయతోను ప్రకాశించి సాక్షాత్కరించినట్లు ప్రస్తు తింపబడియున్నది. ద్వాపర యుగమున మరకతవర్ణుడై పచ్చని రంగు తోను, కలియుగమునందు వేరువర్ణమునసనుండిన సంశయముతో నాశ్ర

యించు వారరుదగుదురేమోనని సహజమైన శ్యామలవర్ణముతో నీల మేఘశ్యాములుడై శోభిల్లు చున్నాడని వర్ణించుట వ్యావహారికమై యున్నది.

పూర్వము నైమిశారణ్య వాసులగు తపోధనులు లోకక్షేమార్థ మొక యాగమొనరింప సంకల్పించి తదర్కమైన ప్రయత్నములందు నిమగ్నులై యున్న సమయంబున బ్రహ్మమానస పుత్రుడగు నారదు డరుదెంచి వారి యజ్ఞ హవిర్భాగమును త్రిమూర్తులలో సత్యగుణ శోభితుడైనవానికి సమర్పించుట యుచితమను నభిప్రాయమును గల్గజేసి వెడలెను.

త్రిమూర్తులలో నెవరు సత్వరజస్తమోగుణములందు సత్యగుణాధిక్యముతో నొప్పుచున్నారో యని యరసివచ్చుటకై మునిశ్రేష్ఠులచే నియుక్తుడైన భృగుమహర్షి ముల్లోకములకు పయనమయ్యెను. సత్యలోకమనబడు బ్రహ్మలోకమున బ్రహ్మదేవుడు సరస్వతీదేవితో సల్లాపమాడుచు తన రాకను గుర్తింప కుండుటచే భృగుమహర్షి కోపించి భువిలో బ్రహ్మదేవున కారాధనము లేకుండునట్లు శపించి యటనుండి పరమశివుని దర్శింప కైలాసమున కేతెంచెను. రజితాచలమున సదా యోగసమాధియందుండు సదాశివుడా సమయమున శంకరి సంగతి నేకాంతముననుండ తటస్థించెను. తన రాకను గుర్తింపని శంకరుని స్థితినెఱింగి యాగ్రహించిన భృగుమహర్షి శివునకు స్వరూపారాధనము లేకుండునట్లు శపించెను. కైలాసమునుండి బయల్వెడలి వైకుంఠమున కేతెంచిన భృగుమహర్షి క్షీరసాగర మధ్యమున శేషతల్పముపై శయనించి యోగనిద్ర ననుకరించుచుండిన శ్రీమన్నారాయణుని గాంచి కోపోద్దీపితుడై రమారమణుని హృదయ పీఠమున కాలం దన్నెను. మహర్షి పాద తాడిత హృదయుడయ్యు కోమల హృదయుండగుటజేసి దానిం సరకు

జేయక మహిమాన్వితుడైన మునిశ్రేష్ఠుని పాదము తన హృదయ తాడనంబునంజేసి నొప్పి జెందినదోయని యెంచి తన పవిత్రహస్తము లతో భృగుమహర్షి పాదములనొత్తి యుపచారాముజేయ సప్తమహర్షి తాను కోపముచే విచక్షణాజ్ఞానమును గోల్పోయి జగన్నాధుని యెడ నప చార మొనర్పవలసి వచ్చినందులకు మిగుల వగచి మాధవుని క్షమ దమాదిగుణముల కచ్చెరువొందె. శ్రీమన్నారాయణుడు సత్యగుణాధి క్యమును గలిగియుండు నట్లెఱిగి యతడే పురుషోత్తముడని నిశ్చయించి తానవసరపడి యనాలోచితముగ నొనరించిన యపచారమును సైరించి క్షమించి కరుణించుటతోబాటు తన యపరాధమునకు ప్రాయశ్చిత్తము నెఱిగించి యనుగ్రహింపుమని వేడిన భృగుమర్షిని సత్యవ్రతక్షేత్ర మగు కాంచీపురమున తపమాచరింపుమని శ్రీమన్నారాయణుడానతిచ్చెను.

పశ్చాత్తప్తుడైన భృగుమహాముని వైకుంఠవాసుని సౌలభ్య మును, సౌజన్యమును వేనోళ్ళ గొనియాడి భువికి మరలివచ్చి నైమిశా రణ్యమున తన రాకకై నిరీక్షించుచుండిన మునిపుంగవులకు జఱిగిన దంతయు దెలియజెప్పి తాము సంకల్పించి యుండిన యాగమును సక్ర మముగ నిర్వర్తింపజేసి తదుపరి కాంచీపురమున కేతెంచి చక్రతీర్థమున నీరాడి యా పుణ్యతీర్థ తీరమున తపమాచరించెను. భృగుమహర్షి తపస్సునకు మెచ్చిన శేషశయనుడు అలనాడు మునిపాదతాడనముచే శేషశయనమునుండి లేచి కూర్చుండిన భంగి పగడంపుడంబున ప్రవాళ వర్ణుడై సాక్షాత్కరించి యచ్చోటారూపముననే వెలసియున్నట్లు పురాణ విదితము.

సత్యవ్రత క్షేత్రమగు కాంచీపురమున సత్యసంకల్పుడగు శ్రీ మన్నారాయణుడు అశ్వనీదేవతలకు పగడంపుడంబున ప్రత్యక్షమైనట్లు పురాణములందు ప్రశంసింప బడియున్నది. పగడపుడాలుతో గూడిన

శరీరచ్ఛాయగల్గియుండుటచే నీ విష్ణుమూర్తి ప్రవాళవర్ణుడు లేక పవళ వణ్ణర్ (పవడపు వన్నెకాఁడు) అనబడి యాళ్వార్లచే మంగళాశాసనము జేయబడియున్నాడు.

పూర్వము క్షీరసాగరమధన కాలంబున కమలనాభుడు కూర్మ రూపమున మందరపర్వతమును దన కర్పంబున నేర్పుగ నిల్పుటచే క్షీర సాగరమధనకార్యము సుసాధ్యంబగుటతోబాటు ఆ సమయమున వెల్వ డిన హాలాహల విషజ్వాలలచే తపించి శ్వేతవర్ణుడైన మహావిష్ణువు పచ్చని రంగును బొంది మరకతవర్ణుడయ్యెనని జెప్పబడుచున్నది. తదుపరి బ్రహ్మతోఁ గలహించిన వాణి యావిరించి సత్యవ్రతక్షేత్రమున నిర్వర్తింప దలపడిన యశ్వమేధయాగమును విధ్వంస మొనరించు నుద్దే శముతో నసేకరీతులఁ బ్రయత్నించుటయు వానినన్నింటిని నారాయ ణుడు నిష్ఫలంబొనరించుటయు పురాణ ప్రసిద్ధ సంఘటనలు. భగ్న ప్రయత్నయగు భారతి తనకడ్డమైయుండిన విష్ణుమూర్తి నెదుర్కొనుటకై యసురులనేకుల నియోగింపవలసి వచ్చెను.

పచ్చనిరంగుతో నొప్పు మాధవుడాగ్రహించి యసురులనెల్లవధించి యెఱ్ఱనైన వారి రుధిరమును పానమొనర్చినట్లును, యందుచే మరకత వర్ణుడైన మహావిష్ణుని పచ్చని శరీరచ్ఛాయ యెఱ్ఱనై పగడంపుడంబుతో ప్రవాళవర్ణుడయ్యెననియు కాంచీపురాణమున వివరింపబడియున్నది. పిదప భృగుమహర్షి తపఃఫలితముగ కాంచీపురము నందర్చావతారమున పగడపురంగుతో ప్రవాళవర్ణుడై సాక్షాత్కరించినట్లు ప్రతీతి. భృగు మహర్షికి ప్రత్యక్షమైన యీ ప్రవాళవర్ణుని తిరుమంగై యాళ్వారు తమ తిరునెడుం తాండకమను దివ్యప్రబంధ భాగమున 'పవళవణ్ణన్' యని మంగళాశాసన మొనరించియున్నారు.

పెద్ద కంచిలో శ్రీకామాక్షియమ్మవారి గుడిదాపునను, కాంచీపురం రైల్వేస్టేషను సమీపమున నున్నది శ్రీ ప్రవాళవర్ణస్వామి దేవస్థానము. ఇచట విష్ణుమూర్తి ప్రవాళవిమానమున ఐదుతలల శేషునిపై గూర్చుండి నట్లు వెలసియున్నాడు. శ్రీ పవళవణ్ణర్ సన్నిధిని భృగుమహర్షి విగ్రహమునుగూడ జూడనగును. శ్రీవారి సన్నిధికి యెడమ ప్రక్కన శ్రీ యాండాళనబడు గోదాదేవి సన్నిధియు దానికి ముందుగా సుందమైన పవిత్రోత్సవ మంటపము, అద్దాలగది, నమ్మాళ్వారు, తిరుమంగై యాళ్వారు, ఉడయవర్లను శ్రీమద్రామానుజులవారి సన్నిధులు, యాగశాల సొంపుగా నేర్పఱుపఁబడియున్నవి. అట్లే ప్రదక్షిణముగ వచ్చునపుడు ప్రవాళవర్ణస్వామి కభిముఖముగ వెలసియున్న యమ్మవారి సన్నిధి దర్శనీయమైయున్నది. ఇచట వెలసియున్న పవళవల్లిత్తాయారనబడు ప్రవాళవల్లి వరప్రసాదినియై విరాజిల్లుచున్నది.

పురాణ ప్రసిద్ధిఁజెంది యాళ్వార్లచే మంగళాశాసనము చేయఁబడిన ప్రవాళవర్ణుడు ప్రథమమున ప్రస్తుత దేవాలయమునకు రమారమి రెండు కిలోమీటర్ల దూరముననున్న 'బాణపట్టర'యను ప్రాంతమున వెలసి యుండునట్లును, ఆ ప్రదేశము జీర్ణస్థితి నొందుటచే ప్రస్తుతపు దేవాలయము పూర్వులచే నిర్మాణింపఁబడినట్లు ప్రతీతి. ఈ యాలయ ప్రాకార ద్వారమును ప్రవేశించినంతనే యెడమవైపున శ్రీ మనవాళ మహామునుల సన్నిధియు, వాహన మంటపమును గలవు. ఈ ప్రవాళవర్ణుని దేవాలయమున కెదురుగ చక్రతీర్థమను పేరనొక పుష్కరిణిగలదు.

కంచివరదుని బ్రహ్మోత్సవంబున నైదవదినమున పల్లకియందు మోహిని యవతారాలంకార సేవలో నొప్పు కంచివరదుడు పవళవణ్ణర్ సన్నిధికి వేంచేయుటొక విశేషము. శ్రీ ప్రవాళవర్ణునికి వైశాఖమాసమందు అనూరాధ నక్షత్రము తీర్థవారియగునట్లు బ్రహ్మోత్సవమేర్పడు చున్నది.



(శ్రీ పచ్చవణ్ణార్ స్వామివారు)

శ్రీ పవళవణ్ణార్ కోవెలకెదురుగా పవళవణ్ణార్ సన్నిధి పీధిచివరను శ్రీ పచ్చవణ్ణార్ దేవాలయము గలదు. ఇచటవెలసియున్న విష్ణుమూర్తి పచ్చనిరంగుతో విరాజిల్లుటచే పచ్చవణ్ణారనియు. మకతవర్ణుడనియు నుతింపబడుచున్నాడు. ఈ పచ్చవణ్ణార్ పవళవణ్ణార్ దేవాలయము

కొకదాని కొకటి యెదురెదురుగా నమరియుండి రెండింటిని గలుపునట్లు నడుమనున్నవీధి పవళవణ్ణర్ సన్నిధివీధి యనియు, కాలాండార్ వీధి యనియు బిలువబడుచున్నది. పురాణప్రసిద్ధిజెందిన శ్రీ మరకతవర్ణుని యాలయమున వెలసియున్న మరకతవల్లిత్తాయారు మిగుల వర ప్రసాదినియై భక్తులచే గొలువబడి ప్రతి శుక్రవారము విశేషముగా నారాధింప బడుచున్నది.

ఆళ్వార్లచే గీర్తింపబడిన ప్రవాళవర్ణుని, పురాణప్రసిద్ధి జెందిన మరకతవర్ణుని సేవించి, స్తుతించి ప్రణమిల్లుటచే పుణ్యప్రాప్తి గలిగి కోరికలీడేరి సుఖముండుట నిక్కము.

——:o:——

# విశ్వాకారమున విజృంభించిన వామనమూర్తి

(శ్రీ ఉళగళందప్పెరుమాళ్ లేక శ్రీ వామనమూర్తి)

శ్రియఃపతియైన సర్వేశ్వరుడు సకల కళ్యాణ గుణాత్మకుండనియు సర్వశక్తుడనియు, సర్వజ్ఞుడనియు, సత్య సంకల్పుడనియు, సత్య వ్రతుడనియు, సత్య స్వరూపియనియు, సర్వ శ్రేష్ఠియనియు, సర్వ స్వతంత్రుడనియు సకలవేదశాస్త్ర పురాణములు శ్రీమన్నారాయణుని ప్రశంసించుట "సత్యవాక్సత్యవిక్రమ" యను శ్రుతి వాక్యమునుండి విదితమగుచున్నది. "సకలఫలప్రదోహివిష్ణుః" అనుటచే శ్రీ మహా విష్ణు తన్ను శరణుజొచ్చినవారి కాశ్రయమిచ్చి వారి యభీష్టములను ఈడేర్చువాడని యర్థము. సర్వవ్యాపియగుటచే విష్ణువనఁబడుచున్నాడు; సకల కళ్యాణ గుణాత్మకుఁడగుటచే శ్రేష్ఠుడగు చున్నాడు. శ్రీమన్నా రాయణుడు తన భక్తులను పరిశోధించు విధమున లీలావినోదముగ వారికి సంకటంబులు గల్గునట్లొనర్చి, భక్తిబలముచే వానిని భరింపగల్గ జేసి తద్వారా వారి భక్తిప్రభావము ప్రదర్శితమై వారి భక్తితత్పరత ప్రకటితమై వారిఘనత జగద్విఖ్యాతి గాంచునట్లనుగ్రహించు నిమిత్తము భక్తుల నాదుకొనుటకై భగవంతుడు తన శ్రేష్ఠతను సయితము సరకు జేయక భువికి దిగి వచ్చుట అవతారమనబడు చున్నది. భగవంతుని యవతారమహిమ భక్తులు ఘనత జెందుట యందిమిడి యున్నదనుట యతిశయోక్తిగాదు. భగవంతుని యవతార ప్రయోజనము శరణాగత రక్షణమేయనియు, సర్వేశ్వరుడు తన స్వరూపగుణసిద్ధికొఱకై శరణా గత రక్షణము జేయుననియు శ్రీ వైష్ణవుల యభిప్రాయము.

ఆశ్రితదురిత నివర్తకుడగుటంజేసి హరియనబడు నారాయణు డపుడపుడు ధర్మసంరక్షణార్థ మవతరింపవలసి వచ్చుచున్నదని పురాణములందు ప్రస్తుతింపబడియున్నది. సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుని యసమాభ్యధికత, యఘటిత ఘటనా సామర్థ్యము, సర్వశక్తత్వము, సర్వవ్యాపకత్వము, ప్రకటితమగుటకై యేర్పడిన యవతారము శ్రీవామనావతారమున ప్రసిద్ధమైన త్రివిక్రమావతారము.

భక్తశిఖామణియగు ప్రహ్లాదుని మనుమడైన మహాబలి విష్ణుభక్తి తత్పరతచే ధర్మాత్ములై ధరణియెల్ల బొగడునట్లు న్యాయమార్గమున రాజ్యపాలన మొనరించు చుండెను.

బలిచక్రవర్తి బహుకాలము తపమాచరించి బ్రహ్మదేవునొద్ద తాను ధర్మాచరణనుండి తపకుండునట్లు వరమునుబొంది యజ్ఞ యాగాదులాచరించి, దాన ధర్మములొనరించి సత్యవ్రతుడై రాజనీతి యొప్ప రాజ్యపాలన మొనరించుచు ధర్మాత్ముడనం బ్రసిద్ధికెక్కెను. ప్రాజ్ఞుడయ్యు పరుల ప్రోత్సాహమున గర్వించిన మహాబలి తమ పూర్వులేలిన స్వర్గమును ఇంద్రుడు చేపట్టియున్నాడని వాదించి యాఖండలుని ధిక్కరించి తాను బలాఢ్యుడగుటచే తన యేలుబడికి తల యొగ్గవలసినదని దేవేంద్రునాజ్ఞాపించెను. సురలోకాధిపతినుండి తగినసమాధానము రానందులకు కుపితుడైన మహాబలి మహేంద్రునిపై యుద్ధము ప్రకటించెను. మహాబలాఢ్యుడైన బలిచక్రవర్తి శౌర్యమునకు భయపడినవాడై ఇంద్రుడు స్వర్గమును విడిచి పారిపోయెను. ఇంద్రుడు పలాయన మొనర్చుట వలన రాజులేని రాజ్యమగు స్వర్గమును బలిచక్రవర్తి యాక్రమించుకొని తనయేలుబడిలోనికి దెచ్చుకొనెను.

కశ్యపపుత్రుడైన ఇంద్రుడు మహాబలిచే పరాజితుడై స్వర్గము విడిచి పలాయన మొనర్చి తనతల్లియైన యదితివద్దకుంజని మొర

లిడ నామె యాపద్బాంధవుడగు నచ్యుతుని యభయము వేడెను. ఆశ్రిత వత్సలుడగు శ్రీమన్నారాయణుడామె ప్రార్థన విని పదవీ భ్రష్టుడైన ఇంద్రునికి రాజ్యము మరలదొఱకునట్లు కరుణింపనెంచిన సత్యసంకల్పము సర్వేశ్వరుడగు పరంధాముఁ డదితిగర్భమున వామనరూపుడై యవతరించుటకు కారణమయ్యెను.

"ధర్మోరక్షతి రక్షితః" — ధర్మరక్షణం బొనర్చువాడు రక్షితుడగునను శ్రుతివాక్యానుసారము, ధర్మనిరతుడగు మహాబలిని సంహరించుట ధర్మసమ్మతము గానేరదని యెంచి జూచి, భుజబలముచే బలిచక్రవర్తిని జయించుట సాధ్యముగాదని దెలిసి సమయోచిత బుద్ధిచాతుర్యముతో నుపాయంబునంజేసి ప్రేమమార్గమున ధర్మయుక్తముగ నింద్రునకు స్వర్గలోకాధిపత్యము సంప్రాప్తించు నట్లొనర్చుటకై యేర్పడినదే వామనావతారము.

ధర్మనిరతుడగు మహాబలినుండి ఇంద్రపదవిని పరిగ్రహించి వాసవున కొసగుట న్యాయమగునా! యను సంశయముగల్గుట సహజము. కాని బలిచక్రవర్తినుండి స్వర్గపదవిని పరిగ్రహించి ఇంద్రునకొసగుటలో నధర్మమేమియు లేదు. మహాబలి ఇంద్రపదవిని సక్రమముగా సంపాదింపలేదు. నూరశ్వమేధయాగములాచరించిన పుణ్యవంతుడే యింద్రపదవికి కర్హుడగుట నియతి. మహాబలి యట్లుగాక తన బలపరాక్రమములకు భీతిల్లిన ఇంద్రుడు తనంతతానే వదలివెళ్ళిన స్వర్గమును రాజులేని రాజ్యమని మహాబలి సునాయాసముగ నాక్రమించెను. శతక్రతు సముపార్జనాధికార సంపన్నుడుగాక భుజబలము మాత్రమున నతిక్రమించి యాక్రమించుటచే మహాబలి యామాత్రము ధర్మమూ నతిక్రమించినట్లు ధర్మనిర్ణయ మొనర్చి యాతని నా పదవినుండి దొలగించుట న్యాయమేనని యెంచి యతడనూసరించిన విధముగనే యతనినుండి యదేవస్తువుపరిగ్రహించి దానికధికారియైన వాసవునకొప్పగించు నివృత్తి మేర్పడినది శ్రీమన్నారాయణుని వామనావతారము.

బలిచక్రవర్తి నర్మదా నదీతీరమున వైష్ణవ యాగమొనరించు చెఱింగి మాయామానుష విగ్రహుండగు వామనుండు వటుడై వచ్చి తాను తపమాచరించుటకై తన పాదముతో మూడడుగుల స్థలమును గొలిచి యీవలసినదని దానమడిగెను. వామనమూర్తి రూపసౌందర్యమున మైమఱచి యతడడిగిన దానమిచ్చుటకు మహాబలి యాయత్తుడయ్యెను. వచ్చినవాడు విష్ణువేయని యెఱిగించి యతని మాయలో బడవద్దని మహాబలుని కులగురువగు శుక్రాచార్యుడు హెచ్చరించెను. "సకలఫలప్రదోహి విష్ణు" అనబడుటచే యవాప్త సమస్త కాముండును సర్వలోక సరణ్యుండును. ఈప్సిత పలప్రదాయకుండును సర్వేశ్వరుండును నగు శ్రీమన్నారాయణుడే తనవద్ద దానముస్వీకరింప నెంచి వచ్చుటచే నెల్లప్పుడును పైనుండదగిన శ్రీపతి యభయహస్తము దేహియని క్రిందై తాను దాతయై తన చేయి పైన యుండగల ప్రాప్తి కన్నను మిన్నదైన భాగ్యము దొఱకుట దుర్లభవమని యుద్ఘాటించి వామనమూర్తి కోరినట్లు మూడడుగుల స్థలమును క్రమముగ ధారవోసి యిచ్చుటకాయత్తమైన మహాబలిని యడ్డుకొని గాపాడనెంచిన యసురగురువగు శుక్రాచార్యుడు కీటకరూపమున కమండలు ద్వారమున నడ్డపడి నీరు రాకుండునట్లు నిరోధించెను. ధారదత్త మొనరించు సమయమున నంతరాయము గల్గుటగాంచి నీటిరాక కవరోధమైయున్న నిరోదమును దొలగించుటకై వామనుడు కమండులు ద్వారమును తనచేతి వ్రేలినున్న కుశాగ్రముచే గ్రుచ్చి తొలగించుటచే శుక్రాచార్యుడొక కంటిని గోల్పోవునట్లయ్యెను.

మహాబలినుండి ధారాదత్తముగ పదత్రయంబు దానంబుగఁ బడసిన వామనమూర్తియగు విష్ణువు విజృంభించి విశ్వాకారము దాల్చి విక్రమమూర్తియై యొకపాదంబున భూమిని, మఱొక పాదమున నాకాశమునుగొలిచి, మూడవ పాదమునకు స్థలమేదని యడుగ సంభ్రమాశ్చర్యములు పైకొన విష్ణుని విశ్వరూపసందర్శనానంద కందళితహృదయుడై

మూడవపాదము నుంచుటకు తన యుత్తమాంగము తగినదైనచో నాక్ర మించి కృపజూడమని వేడవానివలె నమ్రశిరస్కుడై బద్ధాంజలి ఘటిం చిన బలిచక్రవర్తి శిరస్సున తన పవిత్రమైన పాదము నిడి యతనిని పాతాళమున కణచి యతడచ్చోటనుండి భూమికి దిగువనున్న మూడు లోకముల కధిపతియై వర్ధిల్లునట్లను గ్రహించెను. ఆశ్రితుడైన దేవేం ద్రునికి స్వర్గలోక ప్రాప్తి సిద్ధించుటచే మహావిష్ణుని వామనావతార ప్రయోజనము పూర్తియగుటతో బాటు పరమభక్తుడగు బలిచక్రవర్తి ధర్మవర్తనము ప్రకటితమై మహాబలి ఘనత జగద్విఖ్యాతి బొందెను.

జలజాసన వాసవాది సురపూజా భాజనంబై యొప్పునట్టిదియు, తపోజ్ఞాన ధనులచే ననవరతము ధ్యానింప బడునట్టిదియు, సుకరమై, సుఖప్రదమై సిద్ధమై, స్వతఃఫలప్రదమై, మంగళకరంబగు విష్ణు పాద కతులసేవానురక్తి సంప్రాప్తించుటకై పరమభాగవతోత్తములు సయితము పరిపరివిధముల ప్రార్థించి బహుకాలము ప్రయాసపడవలసి యుండు నపుడట్టి యపూర్వభాగ్యము మహాబలి కప్రయత్నముగ గల్గుటయు, అంతకుమించి భగవంతుడగు నచ్యుతుని చరణకమలములను తన శిర స్సున ధరింపఁగల యసాధారణ యోగమతనికి సంప్రాప్తించుటయు, శ్రీమన్నారాయణుని వర్ణనాతీతమైన కరుణాతిరేకమును ప్రకటించుటతో బాటు మహాబలియొక్క ధర్మనిరత లోకవిదిత మగునట్లయ్యెను. నిరు పాధికవత్సలుడై, నిరపేక్షసాధనభూతుడై సర్వస్వామియై కరుణాతి రేకమున మహాబలిని కటాక్షించి యనుగ్రహించిన మహావిష్ణుని వామనా వతారమునాటి విక్రమరూపమున సందర్శింప నపేక్షించిన యాదిశేషుని కరుణించి సత్యవ్రతక్షేత్రమగు కాంచీపురమున శ్రీమహావిష్ణువు విక్రమ రూపమున సాక్షాత్కరించిన దివ్యస్థలమే కంచిలోని "ఉలగళందపెరు మాళ్ కోయిల్" యనబడు శ్రీవామనమూర్తి దేవాలయము.

పెద్దకంచిలో బస్టాండుకు సమీపముననుు, శ్రీ కామాక్షియమ్మవారి గుడిదాపునను శ్రీ ఉలగళందపెరుమాళ్ దేవస్థానము గలదు. ఈ యాల

యము నందు సారవిమానమనియు, శ్రీకర విమానమనియుఁ జెప్పబడు దివ్యవిమానమున పశ్చిమాభిముఖుడై విక్రమరూపముననిల్చి యతిగంభీరముగ వెలసియున్న విష్ణుమూర్తి యద్భుతసేవ నయనానందకరము. తన దక్షిణ హస్తమును విస్తరించి యందు రెండు వ్రేళ్ళను జూపి తాను రెండుపాదముల భూమ్యాకాశముల గొలిచి యాక్రమించుకొన్న తీరును దెలియజేసి మిగిలిన పాదమునకు తావెక్కడని యడుగునట్లు వామ హస్తమున నొకవ్రేలితో సూచించి భూమ్యాకాశములగొల్చినట్లు పాదము గగనమునంటురీతిని కుడికాలు పైకెత్తియు, యెడమపాదమును మహాబలి శిరస్సుపై నుంచియు నతియున్నతాకారుడై వెలసియున్న విక్రమ మూర్తి గంభీర విగ్రహము సేవార్థులకు వెదురుకఱ్ఱకు తగిలించి పైకెత్తి చూపబడు కాగడా వెలుగులో సేవింప జేయబడుచున్నది. తిరుమయిశై యాళ్వారు, తిరుమంగై యాళ్వార్లచే పేరగత్తాన్ — ఉన్నత శరీరుడని మంగళాశాసనముఁ చేయబడిన యీ విక్రమమూర్తి సన్నిధిని వెలసి యున్న యమ్మవారగు "అమృతవల్లిత్తాయారు" అత్యంత పరప్రసాదినియై విరాజిల్లుచున్నది.

ఆదిశేషునికి సాక్షాత్కార మొనర్చినట్లు విక్రమమూర్తి వెలసి యుండుటచే నీ సన్నిధి గర్భగృహమునకు ప్రక్కన 'ఉరగమని' యాళ్వార్లచే మంగళాశాసనము జేయబడిన యాదిశేషుడు వర్తులాకారుడై వెలసి యుండుట దర్శనీయము. "ఊరగత్తార్" యను నీ యాదిశేషుని సన్నిధిని 'పేరగత్తాన్' యను విక్రమమూర్తి సన్నిధిలో జేర్చి యొకే దివ్యదేశముగ నాళ్వార్లు మంగళాశాసనము జేసియుండుటచే నీ యురగుని వైభవ విశిష్టత విదితమగుచున్నది. ఈ ఫణిపతి సన్నిధి ప్రార్థన స్థలమై ప్రసిద్ధిజెంది యచ్చో వెలసియున్న యురగమూర్తికి తిరుమంజనములు, చందానాలంకారము, క్షీరాన్న నైవేద్యము జఱిపింపబడుచున్నవి. ఈ యురగుని సన్నిధి రాహుకేతువుల దోషనివృత్తికి దగిన

ప్రార్థనా స్థలముగా పరిగణింపబడి భక్తజనులచే భయభక్తులతో గొలువ బడుచుండుట యిచటి ప్రత్యేకత.

శ్రీవిక్రమమూర్తి సన్నిధిని నాలుగు శ్రీవైష్ణవ దివ్యదేశములను సేవింపనగును. శ్రీవామనమూర్తి, త్రివిక్రమమూర్తి, పేరగత్తాన్ అన బరగు వులగళందప్పెరుమాళ్ సన్నిధితో దాని నంటినట్లున్న "ఊరగ" మను యురగరాజగు నాదిశేషుని సన్నిధినిజేర్చి యొక దివ్యదేశముగాగ నీరగము, కారగము, కార్వాణమను మూడు దివ్యదేశములతోజేర్చి యీ వామనమూర్తి సన్నిధియున్న నాల్గుదివ్యస్థలములను ఆళ్వార్లు ప్రశంసించి మంగళాశాసనముఁ జేసియున్నారు. ఈ వామనమూర్తి దేవాలయమున తూర్పున ముఖమండలముతో నిల్చి యక్రూరమహర్షికి ప్రత్యక్షమైన 'నీరగత్తాన్' యనియు జగదీశ్వరప్పెరుమాళనియు బరగు విష్ణుమూర్తి నిలమంగై నాచ్చియారనబడు భూదేవీసహితుడై జగదీశ్వర విమానమున వెలసియున్నాడు. అట్లే నికేతన మహర్షికి ప్రత్యక్షమై దక్షిణాముఖుడై నిల్చి రమ్యవిమానమున వెలసిన 'కారగత్తాన్' అన బరగు కరుణాకర మూర్తి సన్నిధిని వెలసియున్న యమ్మవారు పద్మామణి యనుపేర బరగుచున్నది. వామనమూర్తి యాలయప్రాకారమున పుష్పక విమాన మున పశ్చిమాభిముఖుడై నిల్చి సేవింపఁబడు కార్వానప్పెరుమాళనబడు నవనీతచోరుడు పార్వతి, మహాబలి, యశ్వత్థామలకు ప్రత్యక్షము. ఈ సన్నిధిని వెలసియున్న యమ్మవారు కమలవల్లి యనుపేర బరగు చున్నది. కార్వానప్పెరుమాళ్ సన్నిధిని త్రివిక్రమ స్వామి యుత్సవ మూర్తియు, నీరగ,కారగప్పెరుమాళ్ళ యుత్సవవిగ్రహములు వేంచేయ బడియున్నవి. ఉలగళందప్పెరుమాళ్ దేవస్థానమున కభిముఖముగ వర ప్రసాదియై వెలసియున్న చతుర్భుజాంజనేయస్వామి సన్నిధి గలదు.

శ్రీ వామనమూర్తి సన్నిధిని పుష్యమాసమున పునర్వసు నక్షత్ర మున తీర్థవారియగునట్లు బ్రహ్మోత్సవము వైభవోపేతముగ జరుప

బడుచున్నది. సుప్రసిద్ధ తమిళ గ్రంథమగు తిరుక్కురళ్ కావ్యమునకు తత్కృష్టవ్యాఖ్యాన మొసరించి విఖ్యాతిగాంచి కాంచీపురి వాసియై యుండిన 'పరిమేళయగర్' యను మహనీయుని వంశస్థులే యీ వామన మూర్తి సన్నిధిని యర్చకులై యున్నారు.

శ్రీ మహావిష్ణువు వామనుడై మహా బలిని పదత్రయంబు యాచించి పిదప విజృంభించి విశ్వాకృతిని వ్యాపించి ముల్లోకముల నాక్రమించి తన సర్వవ్యాపకత్వమును నిరూపించుటతోబాటు ధర్మాత్ముడైన బలిచక్రవర్తి దానశీలన ప్రకటితమై ప్రఖ్యాతిగాంచునట్లను గ్రహించిన శ్రీవిక్రమమూర్తి వైభవమును వినుతించుటయే ధర్మాచరణమందభిలాషగల్గి పుణ్యాత్ములై తరించుటకు తగిన మార్గము కంచిలోని ఊరగళందప్పెరుమాళ్ళను కనులార సేవించుటచే కోరికలీడేరి యున్నత పదవి గల్గుటతోబాటు సర్వమంగళములేర్పడి సుఖము గల్గును.

— / —

# శ్రీ వైకుంఠనాథుని వైభవము

శ్రియఃపతియగు నారాయణుడు నిర్హేతుకమైన కరుణాతిరేకముచే జీవరాసులను సంరక్షించుటంజేసి సరేశ్వరుడనియు. సర్వవ్యాపియై, సర్వమూతాన్నై సర్వమును సృష్టింపఁజేసి గాపాడుటచే సర్వశక్తుడై, సర్వలోక శరణ్యుడై, సర్వలోక సంరక్షకుడై యెప్పుటచేతను సర్వేశ్వరుడని ప్రశంసింపఁబడుచున్నాడు. భక్తవత్సలుడగు భగవంతుడు ఆశ్రితరక్షణార్థము అర్చావతారము గైకొని పలుచోట్ల వెలసి దాన జనులకు మేలుగల్గజేసి కృపజూచుటంజేసి యాయాస్థలములు దివ్య దేశములని బ్రశంసింపబడుచున్నవి. భక్తవాత్సల్యము భగవంతుని వైభవ కారణమగుటచే భగవంతుని కల్యాణగుణానుభవమే భాగవతోత్తములు బొందు శాశ్వతానందము. భగవత్కల్యాణ గుణానుభవము పలువిధములై యుండునని మహనీయుల యనుభవ వాక్యములనుండి తెలియనగును.

భగవంతుని సర్వమంగళ విగ్రహమును మనముననిల్పి నిశ్చల బుద్ధితో ధ్యానించుట, భగన్నామ సంకీర్తన మొనరించుట, కరుణామయుడైన సర్వేశ్వరుని కల్యాణగుణవిశేషముల నెంచి వివరించి కీర్తించుట, పరాత్పరుని ప్రతిభను ప్రశంసించుట, భగవంతుని యర్చావతార దివ్యమంగళ విగ్రహములను సేవించి యానందించుట దివ్యదేశములను దర్శించి యట వసించిన మహాత్ముల మహనీయ చరిత్రను శ్లాఘించి వారి యుపదేశములఁ జింతించి, వారి యద్భుత చర్యలను శ్లాఘించి వారి ఘనతను సహృదయులతో సంభాషించి యనుభవించుట, దేవాలయములు నిర్మింపజేసియు, జీర్ణోద్ధారణ మొనరించియు, భగద్భాగవత కైంకర్య

ములందు తమ్మనువర్తింప జేసికొని కైంకర్యపరులై సేవానురక్తిని బొందుట, భూతదయగల్గి సర్వజీవరాసులందు సర్వేశ్వరుని యంశను గుర్తించి జీవకారుణ్యముతో ప్రాణులనెల్ల సమదృష్టిఁ బ్రేమించి యనురాగముతో నుండుట, మొదలుగాగల యనేక తెరగులందు భగవదనుభవము వ్యక్తమగునని విజ్ఞులచే ననుభవ పూర్వముగ వివరింపఁబడి యున్నది. అందుచేతనే భాగవోత్తములు భగవంతునాశ్రయించి

"నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యము నితాం
తాపార భూతదయయును
తాపసమందార! మాకు దయసేయగదే"

యని ప్రార్థించియున్నారు.

కాంచీపురము నేలిన పల్లవరాజు, విష్ణుపదకమల సేవానిరతుడై వైకుంఠనాథుని దివ్యమంగళ రూపమును మనమున నూహించి, చిత్తమందునిల్పి, తన్మయత్వము నొంది తాను పొందిన భగవద్రూపసందర్శనానుభవమున నొక రూపమును గల్పింపనెంచి కంచిలో విష్ణుమూర్తికొక యాలయమును నిర్మింపజేసెను. పల్లవరాజు భక్తికి గుఱుతుగా కంచిలో నిర్మింపఁబడినదే పరమేశ్వర విణ్ణగరమనబరగు శ్రీ వైకుంఠనాథుని దేవాలయము. వైకుంఠమున వేంచేసియుండు చందనంబున శ్రీ మహావిష్ణు వర్చావతారమూర్తియై యీ యాలయమున వేంచేయబడి యుండుట యిచటి ప్రత్యేకత.

పూర్వము విధివైపరీత్యముచే శాపగ్రస్తుడైన పల్లవరాజుకు పరమపదనాథుడత్యంత దయతో ప్రత్యక్షమై యతనికి శాపవిముక్తిని గల్గజేసి పుత్రభాగ్యము ననుగ్రహించి కరుణించుటచే తాను బొందిన భాగ్యాతిశయము నెల్లరకెఱుకపఱచి, జనులా పరమపదనాథుని వాత్స

